# ఎవరన్నారు 'శాంతా' టీకాల కంపెనీ మాత్రమేనని...?

స్వదేశీ ప్రజ్ఞను బహుముఖాలుగా
వెలారిస్తున్న శాంతాగ్రూప్
రథసారథులు
తెలుగువారే...!

క్యాన్సర్, హెపటైటిస్-బి వంటి అనేక భయానక వ్యాధుల
చికిత్సలో ఉపయోగపడే ఇంటర్‌ఫెరాన్ ఆల్ఫా 2
**శాన్ ఫెరాన్**

భారతదేశంలో మును పెన్నడూ
లేని విధంగా యునిసెఫ్‌కు టీకాల విక్రయం

అంతర్జాతీయ ధార్మిక సంస్థల కోరిక మేరకు
వారి తరఫున టీకాల ఉత్పత్తి

అనుబంధ సంస్థ **శాంతా వెస్ట్**
(అమెరికా) ద్వారా క్యాన్సర్
చికిత్సా మూలకాలపై పేటెంటు

కాంట్రాక్టు పద్ధతిపై ఫారిన్
కంపెనీల తరఫున పరిశోధన



హృద్రోగులకు
అత్యవసర సమయాలలో
ప్రాణదానం చేసే
స్ట్రెప్టోకైనేస్
**శాన్ కైనేస్**

చికిత్సకు లొంగని కాలేయపు వ్యాధి
హెపటైటిస్-బి నివారణకై **శాన్‌వాక్-బి**

చిన్నపిల్లలకు పలుమార్లు టీకాలు వేసే అగత్యం
తప్పించే కాంబినేషన్ వ్యాక్సిన్‌లను అభివృద్ధి చేస్తూ...

కలరా, టైఫాయిడ్, హిబ్, మెనింగోకోకల్
టీకాల రూపకల్పనలో ముందుకు సాగుతూ...

ప్రాణరక్షక ఔషధాలను సామాన్యుడికి
అందుబాటు ధరలో అందించే లక్ష్యంలో భాగంగా
విదేశాలపై ఆధారపడకుండా స్వదేశీ పరిశోధన

## ఔను...
## 'శాంతా'
## టీకాలు కూడా
## తయారు చేస్తుంది...

ఆ మాటకొస్తే శాంతాకు అనేక జాతీయ, అంతర్జాతీయ
ప్రశంసలు, అవార్డులు లభించడానికి తొలి సోపానం
టీకాలను పరిశోధించి, తయారు చేసి, మార్కెట్టు చేయడమే!

శరీర నిర్మాణానికి సన్నిహితంగా ఉండే జీవప్రక్రియ ద్వారా తయారయిన బయోటెక్ ఉత్పాదనలు మానవాళికి అనువైనవి. ఆరోగ్యరీత్యా సురక్షితమైనవి.

**బయోఫార్మా రంగంలో ప్రపంచపటంలో భారతదేశానికి స్థానం కలిగించిన ఔషధ సంస్థ శాంతా బయోటెక్నిక్స్**

- Pioneers in r-DNA Based Human Healthcare Products in India
- Customised Monoclonal & Polyclonal Antibodies
- Recombinant Protein Development, Manufacturing & Formulation
- Vaccines, Therapeutic Products & Diagnostics
- cGMP Compliant Facility for Manufacturing Biopharmaceuticals
- Nutraceuticals

W.H.O.(Geneva)
Pre-qualified
U.N.Supplier of
Hepatitis-B Vaccine

SHANTHA
BIOTECHNICS PVT. LTD.
www.shanthabiotech.com

3rd Floor, Serene Chambers, Road No.7,
Banjara Hills, Hyderabad - 500 034. A.P., INDIA.
Ph: +91-40-23548507, 23543010, 23608843
Fax: +91-40-23548476
Email: info@shanthabiotech.com

'హాసం'

హాస్య-సంగీత పత్రిక

# ఇదీ సంగతులు

73

**Also available on net:**
**www.haasam.com**

**ముఖచిత్రం**

'గుడుంబా శంకర్' చిత్రంలో పవన్‌కళ్యాణ్, మీరాజాస్మిన్



## హాస్యం



స్థలాభావం వల్ల 'పెళ్లిపుస్తకం', 'హ్యూమరథం' లను ఈ సంచికలో ప్రచురించలేకపోయాం. వచ్చే సంచికలో యథావిధిగా ఉంటాయి.

-ఎడిటర్

**'సెంటర్ స్ప్రెడ్' లో**

సినిమా పాటల ప్రత్యేకం





## సంగీతం



శ్రీ జి. బాలకృష్ణ ప్రసాద్ నిర్వహణలో 'హాసం' ప్రచురించనున్న అన్నమయ్య పద కవితలలోని అర్థ తాత్పర్యాలను, భావసౌందర్యాన్ని విశ్లేషించే శీర్షికకు పేరుని సూచించిన పాఠకుల వివరాల గురించి, వారికి ఆదిత్యా మ్యూజిక్‌వారు ప్రకటించిన బహుమతుల గురించి
వచ్చే సంచికలో....

**పాత పాటల ప్రత్యేకం**
71వ పేజీ నుండి 74వ పేజీ వరకూ






'హాసం' లో అన్నమాచార్య సంకీర్తనలను అర్థాలతో ప్రచురించబోతున్నట్టు చదివి ఆనందించాను. అందుకు ముందుగా కృతజ్ఞతలు చెప్పుచున్నాను. 'అన్నమాచార్య ' సినిమా పాటల పాఠంలో అరసున్నాలు జొప్పించేరు. కాని సౌండ్ ట్రాక్‌లో ఈ అనుస్వరం వినబడదు. చిత్రం చివర్న "సర్వేజనాసుఖినో భవంతు" అని అక్షరాల్లో చూపిస్తే, 'హాసం' లో .. స్సుఖినో...' అని సరిదిద్దేరు. బావుంది.

**-కె.వి. రమణ, జయపురం**

'హాసం' పత్రికను గతంలో నేను రెగ్యులర్‌గా చదివేవాణ్ణి. అయితే ఏ కారణం చేతనో మా ఊరు శాంతినగర్ ఏజెంట్ 'హాసం' తెప్పించడం మానివేశాడు. అప్పటినుంచి 'హాసం' చదవలేకపోయేవాణ్ణి. అయితే ఇటీవల ప్రయాణంలో కాలక్షేపం కొరకు 'హాసం' పత్రికను కొనడం జరిగినది. పత్రిక ఆద్యంతము చాలా బాగావున్నది. ఇంతమంచి పత్రికను యిన్ని రోజులు మిస్ అయినందుకు చాలా బాధపడ్డాను. అయితే ప్రస్తుతం మా ఊరిలో 'హాసం' ఏజన్సీ లేకపోవడంతో మా ఊరికి 30 కిలో మీ॥ దూరంలో వున్న కర్నూల్‌కి వెళ్ళి 'హాసం' పత్రిక తెచ్చుకుంటున్నాము. 'హాసం' పత్రిక మంచి సాహిత్య విలువలుగల పత్రిక అనడంలో సందేహం లేదు. అందుకే నా స్నేహితులకు కూడా 'హాసం' పత్రికను పరిచయం చేస్తున్నాను. 'హాసం' పత్రిక మరింత అభివృద్ధి చెందాలని మనసారా ఆశిస్తున్నాను.

**-షేక్ అస్లాం షరీఫ్, శాంతినగర్, కర్నూలు**

ఎప్పుడొస్తుందా అని ఎదురుచూసేలా చేసే పత్రిక 'హాసం' ఒక్కటే. ఈమధ్య కొత్తగా కొన్ని వీక్లీలు వచ్చాయి. కానీ కమర్షియల్ కథల బాటలో షరా మామూలై తేలిపోతున్న విషయం పాఠకవిదితమే. ఆరోగ్యాన్నిచ్చే హాసం, ఆనందాన్నిచ్చే సంగీతంను అందించే 'హాసం' చదివితేగాని తెలియదు అస్సలు వదలిపెట్టని ఆత్మీయ పత్రిక అని ! ఈ మధ్య మీరు సందర్భానుగుణంగా అందించే ప్రముఖుల చిత్రాలు పునరావృతం చేయండి.

**-నేమాన సుభాష్‌చంద్రబోస్,శ్రీకాకుళం.**

'హాసం' సెప్టెంబరు 16-30సంచికలోని రావికొండల రావుగారు 'హ్యూమరథం' శీర్షికన అందిస్తున్న పాత కాలం నాటి అనుభవాలు నన్ను అలరిస్తున్నాయి. వాటిని చదువుతుంటే నిజంగా నేను అక్కడ వున్నానా అనిపించింది. కొండలరావుగారికి కృతజ్ఞతలు . 'కొమ్మాకొమ్మా' జానకీబాలగారు అందించిన 'లీల' గారి హిట్స్ హాసానికే హైలైట్. ఇన్ని మంచి శీర్షికలను పాఠకులకు ఇస్తున్నందుకే ఏ పత్రికకురాని విధంగా హాసానికే 3సం॥లకే రెండు ప్రతిష్ఠాకర అవార్డులు వచ్చాయి.

**-ఎ. జయలక్ష్మి, గుర్రంపోడు.**

16-30 సెప్టెంబరు 'హాసం' సంచికను కొని తీసుకెళుతున్నపుడు మిత్రుడొకరు కలిసి దానిని తీసుకొని చూశాడు. 5నిమిషాల్లోనే 'హాసం' గొప్పతనాన్ని అర్థం చేసుకొని నేను వద్దన్నా వినకుండా బలవంతంగా దాని ఖరీదు 10 రూపాయలను నా చేతిలో పెట్టి, ఇంత మంచి పత్రికను నేను ఇన్ని రోజులు ఎందుకు తీసుకోలేకపోయానని బాధపడ్డాడు. నాకు కృతజ్ఞతలు చెప్పాడు. శ్రీమతి జమునగారి నేనూ నా పాటలు శీర్షికన యీ సంచికలో అందించిన మా అభిమాన గీతం 'గులేబకావళి కథ' లోని సి.నా.రె. గారి 'నన్ను దోచుకొందువటే హైలైట్. పి.లీలగారి హిట్స్‌ను నేను ప్రత్యేకంగా భద్రపరుచుకున్నాను. 'జంధ్యామారుతం' శీర్షికన 'వివాహభోజనంబు' లోని బ్రహ్మానందంగారి ప్రజాదరణ పొందిన డైలాగులు అందించినందుకు కృతజ్ఞతలు. రఫీగారు ఆలపించిన హస్రత్‌గారి అజరామగీతం 'పగ్లాకహీకా' లోని 'తుమ్ ముఝే యూ భులాన పావోగే' వివరంగా అందించిన మృణాళిని గారికి ధన్యవాదములు. 'ఆపాత మధురం' శీర్షికన 'భార్యాభర్తలు' చిత్రంలోని మిగతా పాటలలో 'మధురం మధురం' పాటకు మీరు ఇచ్చిన వ్యాఖ్యానం నిజంగా మీ పరిశోధనా పటిమకు దర్పణం వంటిది.

**-ఏలూరు అశోక్ కుమార్ రావు,గుర్రంపోడు.**

సెప్టెంబరు 16 సంచిక లోని 'బాదరాయణ సంబంధం'తో సహా సింగీతం శ్రీనివాసరావుగారి 21 కథలు చక్కని హాస్యం,వ్యంగ్యం, కలగలుపుగావుండి చదివి ఆనందించాము. సీరియల్స్ కన్నా హాస్యకథలు రెండు మూడు వేస్తే బాగుంటుంది, మిగతా సినిమా శీర్షికలతోపాటు. పత్రికలోని శీర్షికలన్నీ దేనికవే గొప్పగా వుంటున్నాయి. రఫీ పాటలను మృణాళినిగారు వివరించి చెప్పటం చక్కగా వుంది. ఆయన పాటలను వివరిన్నూ రాశారు. ఎన్ని సంవత్సరాలైనా ఈ శీర్షికను ఆపే పని లేదు. భక్తిపాటలు, దేశభక్తి పాటలు, హాస్య, ప్రేమ గీతాలు ఎంత రాసినా ఆయన గురించి తక్కువే. బైజు బావరాలో మన్ తడ్‌పత్, 'భగవాన్' అన్నపాట మనసుకు హత్తుకు పోయేటట్లు ఎలా పాడారో..! ఆయన పాడినట్టు ఇంకెవరూ పాడలేక పోయారు. 'ఆమన్'లో ఆజ్‌కి రాత్ ఏ కైసీరాత్, లవ్ ఇన్ టోక్యో 'ఆ జారె ఆ జరా' లాంటి పాటలు విన్న ప్రతిసారి కలిగే ఆనందం వర్ణించలేనిది. పత్రిక ఇలాగే మంచి శీర్షికలతో మమ్మల్ని ఆహ్లాద పరచాలని కోరుకుంటున్నాను.

**-పి. దాక్షాయణి, సికింద్రాబాద్.**

సెప్టెంబర్ 16-30 'హాసం' సంచికలో అర్థంచేసుకుందాం-ఆస్వాదిద్దాం అన్న శీర్షికలో మృణాళినిగారు అనార్కలి చిత్రంలోని "ఏజిందగి ఉసీకీ హై' పాటను హస్రత్ జైపురి వ్రాసారని చెప్పటం జరిగింది. అది సరికాదు.ఆ పాట వ్రాసింది రాజేంద్రకిషన్. అయితే ఆచిత్రంలో మొహబ్బత్ ఐసే ధడ్‌కన్ హై (లతామంగేష్కర్‌కి) పాట వ్రాసింది హస్రత్‌జైపురి!

**-దేశిరాజు భాస్కరరావు,హైద్రాబాద్.**

**(మీరు అందించిన సమాచారం నూటికి నూరుపాళ్ళు కరెక్టు. కృతజ్ఞులం - ఎడిటర్)**

వ్యక్తుల వ్యథలు, వాటికి మందులివ్వటంతో యాంత్రికంగా గడిచిపోయే నాకు 'హాసం' ఒక చిరువెన్నెల లాంటిది. రోజు రోజుకి ఎన్నెన్నో రంగుల సంతరించుకుంటున్న 'హాసం' ఆర్ద్ర వాక్యంలో చెప్పాలంటే "ఎడారిలోన పూలు పూసె ఎంత సందడి ".

మా జానకీ బాల వినిపిస్తున్న కొమ్మాకొమ్మాకోయిలమ్మాలో సినీసాహితీ సరస్వతికి నీరాజనం వంటి గాయినీ మణుల సంగీత సౌరభ వీచికలు, చిత్తరంజన్ గారి సంగీత విభావరి, పాత సినీ సాహితీఔన్నత్యాన్ని స్పృశింపజేసి మనస్సుని ఆహ్లాదపరుస్తున్నాయి. ఏమిచ్చి తీర్చుకోగలం ఇంత చక్కటి పులకింతకి.

**-ఐ.రామకృష్ణ, విజయవాడ.**

ముచ్చటగా మూడు సం॥లు పూర్తిచేసుకొని నాల్గవ వసంతంలో ప్రవేశిస్తున్న మా 'హాసం'కు శుభాకాంక్షలు. అభినందనలు. 72 సంచికలలో 72మేళకర్తల రాగాలలోని చాలావాటిని ప్రస్తావించారు. ఎంతో సాహితీ విషయసేకరణను క్రోడీకరించి అందించటంలో సఫలీకృతులైనారు. ఎంతో మంది విద్వన్మణుల ప్రస్తావనను చేశారు. గుండెలోతుల్లోనుంచి వచ్చిన ఎన్నోభావాలను నిక్కచ్చిగా నిర్మొహమాటంగా పదుగురు ప్రశంసించేలా ముద్రించారు. పత్రికా రంగంలో మన 'హాసం' మణిహారంగా వెలిగిపోతోంది. ఇదే స్ఫూర్తి, సంయమనం, సాహితీ యజ్ఞం , సంగీత మథనం నిరాటంకంగా కొనసాగిస్తూ పాఠక హృదయాలను పులకింపచేయాలని మా ఆకాంక్ష. ఎన్నో సినీ విషయాలకు రెడీరెకనార్‌గా,లెక్సికాన్ లాగా ప్రజల్లో చేతుల్లో, హృదయాల్లో , నాలుకలపై 'హాసం' పొందిన ప్రజాదరణను 3సం॥గా చూస్తూ చదివివింటూ ఆనందించాం. మరెన్నో వసంతాలు మీ ప్రచురణా ఝురి కొనసాగాలని ఆశిస్తూ.

**-వై.శివరామప్రసాద్, రామోజీ ఫిలింసిటీ.**

మీరు పంపిన సి.డి. అందినది. కొరియర్ సర్వీసు బ్రాంచి మా ఊళ్ళో లేనందున సి.డి. అందలేదు. మీరు మరలా శ్రద్ధ తీసుకొని పంపినందుకు కృతజ్ఞతలు. **-రావి రాజ్యలక్ష్మి.**

సంపుటి: 4 సంచిక: 01

**1-15 అక్టోబరు 2004**

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా: రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా: రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 400

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య - సంగీత పత్రిక

73

మేనేజింగ్ ఎడిటర్
**ఎమ్బీయస్ ప్రసాద్**

ఎడిటర్
**రాజా**

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

మేనేజర్
పి.గిరి
చీఫ్ లే-అవుట్ డిజైనర్
జి.రాజేష్

**HAASAM HAASYA SANGEETHA PATHRIKA**
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

సమాజంలో పలు వర్గాల మధ్య విభేదాలు తగ్గాలంటే లలితకళలను ప్రోత్సహించాలని అనేక వేదికలనుండి పెద్దలు ప్రసంగిస్తూ ఉంటారు. కక్షలూ, కార్పణ్యాలూ విపులంగా చిత్రీకరించే సినిమాల కంటె - చక్కటి కుటుంబవాతావరణాన్ని ప్రోత్సహించి, ఆహ్లాదం, వినోదం కలిగించే హాస్యచిత్రాలు తీస్తే అవి ప్రజల మనసులపై పనిచేసి, సమాజంలో వైషమ్యాలు తగ్గి, సామరస్యం, సుహృద్భావం పెరుగుతాయని ఉద్బోధిస్తూంటారు. సినిమాలు, సమాజం ఒకదానినొకటి ఎంతగా ప్రభావితం చేసుకుంటాయన్న విషయంపై చర్చ సాగుతూనే ఉంటుంది. హింసాత్మక చిత్రాలు ఏ కొద్ది మోతాదులోనైనా ప్రజలను ఆవేశపూరితులను చేస్తాయనే వాదనను స్వీకరిస్తే వినోదప్రధానమైన సినిమాలు ఆనందాన్ని పెంచుతాయన్న నిజాన్ని ఒప్పుకుని తీరాలి.

ఓ కులాన్నో ఓ వర్గాన్నో ఓ వృత్తినో కించపరచకుండా ఆరోగ్యకరమైన హాస్యాన్ని పంచే సినిమాలు వర్గ సామరస్యం సాధించడానికి ఒక ఉపకరణంగా ఉపయోగపడతాయనే వాదనలో ఏ కొద్ది వాస్తవం ఉన్నా ముందెన్నడూ లేనంతగా ఫ్యాక్షనిజం పురులు విప్పుకుంటున్న ఈ తరుణంలో ఆ ఉపకరణాన్ని కూడా ప్రయోగాత్మకంగా ప్రయత్నించి చూడడం తప్పుకాదేమో! ఇది ప్రభుత్వ యంత్రాంగం నడిపే విధివిధాననిర్ణేతలు, సామాజిక శాస్త్రకారులు ఆలోచించవలసిన అంశం!

తెరపై హింసాత్మక దృశ్యాలు చూసినపుడు ప్రేక్షకులలో ఉద్రేకం పెరుగుతుందని, వినోదకరమైన దృశ్యాలు చూసినపుడు ఆహ్లాదం కలుగుతుందనీ వ్యక్తిగతంగా మనకు తెలుసు. కానీ ఆ ప్రభావం ఎంతసేపు ఉంటుంది? దృక్పథంలో, జీవనసరళిలో మార్పు తీసుకురాగలదా? అన్న విషయాలే చర్చనీయాంశాలు. ఏది ఏమైనా వినోదప్రధానమైన హాస్యభరితచిత్రాలు సమాజానికి మేలు చేయలేకపోయినా హాని మాత్రం చేయవని కచ్చితంగా చెప్పవచ్చు.

సమాజశ్రేయస్సే పరమావధిగా ఎంచే ప్రజాప్రభుత్వాలు అటువంటి సినిమాలను ప్రోత్సహించడం ద్వారా ప్రజలకు ఎంతో మేలు చేసిన వారవుతారు. ప్రభుత్వమే పూనుకుని అటువంటి సినిమాలు తీయమని కోరుకోవడం అత్యాశ అవుతుంది. కనీసం ఏటేటా ఇచ్చే నందీ అవార్డుల ద్వారా ప్రభుత్వం ఈ అంశంపై తన అభిప్రాయాన్ని, దృక్పథాన్ని వెల్లడి చేయవచ్చు. 1987లో ఈ దిశగా ఆలోచించారో, లేదో తెలియదు కానీ ఉత్తమహాస్యచిత్రానికి నందీ అవార్డు ప్రకటించారు.

'అహ నా పెళ్ళంట' సినిమా ఉత్తమ హాస్యచిత్రంగా ఎన్నికయింది. కారణాలు తెలియవు కానీ ఆ తర్వాత నుండి హాస్యచిత్రాల అవార్డును ఇవ్వడం మానేశారు. అప్పటినుండి మంచి హాస్యచిత్రాలు రావటం లేదని ప్రభుత్వం భావిస్తోందా? వస్తున్న హాస్యం చవకబారుగా ఉందని అనుకుంటోందా? అలా అనుకున్నా ఆరోగ్యకరమైన, సమాజహితానికి దోహదపడే హాస్యాన్ని పెంపొందించే వాతావరణం కల్పించవలసిన బాధ్యత ప్రభుత్వానిదేగా!

నిజానికి వైవిధ్యభరితమైన హాస్యసన్నివేశాలున్న సినిమాలు చాలా వస్తున్నాయి. కొన్నిచోట్ల హద్దుమీరడం కూడా జరుగుతోంది. ఉత్తమ హాస్యచిత్రానికి 'నందీ అవార్డు' ప్రకటించడం వల్ల సినీ పరిశ్రమ నుండి మరిన్ని హాస్యచిత్రాలు వస్తాయని, అదే సమయంలో స్థాయి దిగజారకుండా జాగ్రత్త పడతారని 'హాసం' ఆశిస్తోంది. ఆ దిశగా ఆలోచించమని 'నందీ అవార్డుల'కు సంబంధించిన వారినందరినీ వినమ్రంగా కోరుతోంది.



# శిల్ప



"కౌసల్యాసుప్రజారామా..." అంటూ కోవెల నుండి వస్తున్న సుప్రభాతం, ఆ పల్లెలోని ఇంటింటికీ ప్రసరిస్తూ..... జనాల్ని మేల్కొలుపుతోంది.

భూమాత, అచ్చమ్మ హోటల్ నుండి వస్తున్న వేడివేడి పెసరట్ల స్మెల్లును ఆఘ్రాణించి, ఓ స్మైలు రువ్వి, "ఒరేయ్ రవీ! ఆ పశ్చిమదేశాల్లో ఇంకా ఎంతసేపుంటావురా! త్వరగా వచ్చి వీరిని ఆహ్లాదపరుచు" అని గా...ఠ్ఠి..గా ఒక కేకవేసింది. ఈ దెబ్బకు అదురుకుని తెల్లారిందని గ్రహించి కళ్ళునులుముకుంటూ ఠకీమని ఉదయించేసాడు సూర్యుడు.

రంగయ్య, తన జీతగాడ్ని వెంటేసుకుని ఏదో పిచ్చాపాటి మాట్లాడుతూ...వేపపుల్లతో దంతధావనం చేస్తూ..పొలం వైపు నడవసాగాడు.

ఊరి పొలిమేరలోకి రాగానే... అకస్మాత్తుగా అతని చూపు మర్రిచెట్టుక్రిందున్న ఆరడుగుల రాతిగుండుపై పడింది. అతడు చప్పున ఆగిపోయి "అటుచూడరా" అన్నాడు.

జీతగాడు రాతిగుండువైపు చూసాడు. అతని కళ్ళు గంగరేగుపండ్లంత పెద్దవయ్యాయి. "నిన్న సాయంకాలం చూసాంకదరా!! ఈ రాతిగుండు మాములుగానే వుంది, మరి ఇప్పుడు...ఈ ఆకారమేమిటి? ఆ కాళ్ళు...చేతులూ.... "తనలో తానే గొణుక్కున్నాడు రంగయ్య.

రాతిగుండుపై ఆ ఆకారం అస్పష్టంగా వుంది!!!

"అయ్యగోరూ....!! మన గ్రామదేవత పోలేరమ్మ.....ఈ బండమీద వెలిసినాది!!" అన్నాడు జీతగాడు ఆనందాశ్చర్యాలతో.

"అవునురోయ్!!పోలేరమ్మే!! ఆహా...మనిద్దరం ఎంత అదృష్టవంతులంరా!!ఈ రాతిపై పోలేరమ్మను చూసిన మొదటి వ్యక్తులం మనమేరా!! పద..ఈ విషయం ఊళ్ళో చెప్దాం" అంటూ ఊరివైపు మళ్ళాడు రంగయ్య.

అరగంటలో విషయం గ్రామమంతా పాకిపోయింది.

"పోలేరమ్మ తల్లీ..దండాలు!!"

"అమ్మా... పోలేరమ్మా తల్లా.. మా ఊళ్ళో ఎలిశావా తల్లా.." అరుస్తూ తమ పనులు మానేసి అందరూ మర్రిచెట్టువైపు పరుగుతీశారు.

ఈ విషయం, "గిరితటీనుప్త ముద్భోద్యకృష్ణం..." అని ధనుర్మాస మంత్రాలను అనుసంధానం చేస్తున్న కృష్ణమాచార్యుల చెవినపడింది.

"ఏమిటీ ...? పోలేరమ్మా!! ఛస్.... !!ఇక ఈ అజ్ఞానులు దాని చుట్టూ జంతుబలులు మొదలెడ్తారు. ఎలాగైనా దీన్ని ఆపాలి" అనుకుంటూ వాకిట్లోనికి వచ్చాడు.

అంతలో అతని సుపుత్రుడు బొంగరం తిప్పుతూ అతనికి ఎదురొచ్చి, "నాన్నా! ఊరవతల పోలేరమ్మ వెలిసింది. నేను చూసొస్తున్నాను." అన్నాడు.

"నోర్ముయ్యరా వాజమ్మా! పోలేరమ్మట పోలేరమ్మ సరిగ్గా చూశావుట్రా?! ముక్కెర, చీర, స్త్రీమొహం...ఇవన్నీ వున్నాయట్రా,,,"అడిగాడు.

"ఊహుఁ!!లేవు నాన్నా!! పొట్టికాళ్ళూ చేతులూ.....ఆకారం అస్పష్టంగావుంది" చెప్పాడు.



# రహస్యం

- కండ్లకుంట శరత్‌చంద్ర




"మరింకేం!! అది పోలేరమ్మకానట్టే !! ఒరేయ్..!!నిన్నరాత్రి నాకు, శ్రీమహావిష్ణువు కలలో కనపడి, ఊరవతలున్న మర్రిచెట్టుకింద్ర వెలుస్తానని, సెలవిచ్చాడు. స్వామి....అన్నంత పనీ చేసాడు. ఈ విషయం మన వాళ్ళందరికీ చెప్పి, వారిని వెంటబెట్టుకుని మర్రిచెట్టు వద్దకు రా'' అన్నాడు. పిల్లాడు తలాడించి బుద్ధిమంతుడిలా తలూపి పరుగెత్తాడు.

పోలేరమ్మ సంగతి,''చతుస్సాగరపర్యంతం...."అంటూ ప్రవర చదువుతున్న శంకరశాస్త్రి చెవిని సోకింది.

"హమ్మో!!! అక్కడ పోలేరమ్మ వెలిస్తే... ఇంకేమైనా వుందా  మా ఆధిపత్యం గంగలో కలిసి పోదూ....!!'' అని మనసులో అనుకుని, వెంటనే శివుడ్ని ఆరాధించే వారినందరినీ పిలిపించి తన ఇంటిముందొక చిన్నసైజు మీటింగుపెట్టి, అక్కడ వెలిసినది పోలేరమ్మ కాదనీ, అర్ధనారీశ్వరుడనీ నూరిపోశాడు. అందరూ ''ఓం నమః శివాయ''అంటూ జపిస్తూ మర్రిచెట్టు వైపు బయల్దేరారు.

ఈ విషయం తెలిసిన ఏనుపాదం, తనవారిని సమావేశపరిచి ''ప్రియదైవ బాంధవులారా!! మర్రిచెట్టుక్రిందున్న రాతిగుండుపై పవిత్రమైన శిలువ వెలిసింది. కొందరు అజ్ఞానులు....ఈ విషయం గుర్తించలేకపోతూన్నారు. మనంవెళ్ళి వారందరి కళ్ళు తెరిపించి. ..అక్కడొక పెద్ద చర్చి కట్టించాలి. ఊఁ... పదండి" అన్నాడు.

''నడిపించు నానావ..నడిసాం...ద్రమున..దేవా."పాడుతూ వారంతా నడిచా రు.

క్షణాలలో ఊళ్ళోని ముప్పాతికమంది అక్కడికి చేరుకున్నారు. "సర్పంచ్‌గారూ! పోలేరమ్మకు గుడికట్టించాలి" అన్నాడు రంగయ్య. సర్పంచ్ గొంతు సవరించుకొని,ఏదో మాట్లాడబోయేంతలో." ఆపండి మీకుట్ర!! ఇది పోలేరమ్మ కాదు. శ్రీమహావిష్ణువు. ఏం కేశవాచార్లూ" అన్నాడు కృష్ణమాచార్యులు.

"మరే....విష్ణువే! అదిగో....నాలుగు భుజాలు , ఆ శేషుడు, నాభిలోని పద్మం, నందకఖడ్గం, సుదర్శనచక్రం, పాంచజన్యం....ఇవన్నీ చూస్తూంటే తెలియటంలేదూ.... !! "ఖచ్చితంగా.. విష్ణువే"!! అన్నాడు కేశవాచార్లు.

"నోరుముయ్యవయ్యా... !! ఆ విగ్రహంలో నీకు సుదర్శనం, నందకం, పాంచజన్యం కనిపిస్తూన్నాయటయ్యా!! నువ్వొక చత్వారపు పీనుగువి. అదిగో చూడండి. స్పష్టంగా చూడండి. నావంటి మహాభక్తుని కళ్ళతో చూడండి. ఆహా..ఆహా... ఆ అర్ధనారీశ్వరుడు ఎంత చక్కగా వెలిశాడు..!! తలపై గంగమ్మను చూడండి. చంద్రవంకను చూడండి . మెడలో నాగరాజును చూడండి. ఆ గౌరిదేవిని చూడండి. చూసి తరించండి." అన్నాడు శంకరశాస్త్రి భక్తిపారవశ్యాన్ని నటిస్తూ.

"ఆపండయ్యా!! మీరంతా కలిసి ఏదో పెద్ద ప్లాను వేసుకొచ్చారు. అదీ.. శివుడు కాదు...విష్ణువు కాదు పరమ పవిత్ర మైన ఆ ఏసుప్రభువు మోసిన..శిలువ!'' అన్నాడు ఏసుపాదం.

"పో....పొండయ్యా! పోలేరమ్మను పట్టుకుని నోటికొచ్చిన కూతలు కూస్తున్నారు. అమ్మోరికి కోపమొచ్చిందంటే... మిమ్మల్నందరినీ... మేకల్ని తినేట్లు పరపర నమిలి మింగుద్ది" బెదిరించాడు చాకలిసోమన్న.

"అంతేకాదు... !! ఒక్కొక్కరి రక్తం కూల్డ్రింకులా తాగుద్ది" భయపెట్టాడు సోడాకొట్టు ఓబులేషు.

''ఆపండహే.. మీ గోల ..'' గట్టిగా

అరిచారెవరో. అందరూ ఆ అరుపు వినిపించిన వైపు చూసారు. నాస్తిక, హేతువాద సంఘాలకు జాయింట్‌గా అధ్యక్షుడైన గణేషుబాబు, తన సంఘసభ్యులతో సహా ఊడిపడ్డాడు.

"ఓరి అజ్ఞానుల్లారా!! అదసలు విగ్రహమే కాదు"అన్నాడతను నవ్వుతూ.

" మరీ..!!?" అన్నారందరూ ముక్తకంఠంతో .

"నిన్నరాత్రి పిడుగుపడడంచేత ఆ రాతిమీద ఏవో నాలుగు గీతలేర్పడ్డాయి. వాటిని చూసి మీరందరూ..గందరగోళం సృష్టిస్తున్నారు" అన్నాడు సమస్యను తేలిగ్గా పరిష్కరించిన వాడిలాగ !

"ఏంటి ..పిడుగుపడిందా? వర్షం పడకుండా పిడుగెట్లా పడుతుంది?" ప్రశ్నించాడు రంగయ్య.

"వర్షమెందుకు పడలేదు ? భేషుగ్గా పడింది. నిన్నరాత్రి మేమందరం ప్రక్కనున్న టౌనులో సెకండ్‌షో సిన్మా చూసొస్తున్నాం. అప్పుడు పడింది వర్షం" చెప్పాడు గణేష్‌బాబు.

కృష్ణమాచార్యులు కోపంతో ఊగిపోతూ, "నోర్మూయ్యవోయ్!! వర్షం పడిందట వర్షం!! వర్షం !! వర్షం పడితే..భూమి తడవాలిగా! ఏదీ..ఒక్క చుక్క కూడా నీరు లేదేం!! హేతువాదసంఘ అధ్యక్షుడిగా దీనికేం తర్కం చెబుతావో చెప్పు"అన్నాడు.

గణేష్‌బాబు నిర్లక్ష్యంగా నవ్వి,"ఇదంతా పొడి భూమికదా!! ప్రొద్దునకల్లా నీరంతా భూమిలోనికి ఇంకిపోయింది" అన్నాడు.

శంకరశాస్త్రి ముందుకొచ్చి "ఒరేయ్ గణేషూ! దేవుని పేరుపెట్టుకున్న నువ్వు... నాస్తికసంఘ అధ్యక్షుడివిగా పనికిరావు! ముందా పేరు మార్చుకో. ఏమిటేమిటీ..... నీరంతా ఇంకిపోయిందా!! పోనీ పిడుగుపడితే. ఆ శబ్దమైనా వినిపించాలిగా.

ఈ ఊళ్ళోని.. నాస్తిక హేతువాదసంఘాల వారికి తప్ప.. ఇంకెవరికీ ఆ శబ్దం వినిపించలేదంటావా?" అన్నాడు ఎగతాళిగా.

"అవునండీ...!! నిజంగా..నేను చెప్పేది నిజం!!" అన్నాడు గణేష్‌బాబు.

"అబద్ధం!పచ్చిఅబద్ధం!! అందుకు నేనే సాక్ష్యం" ముందుకొచ్చాడు కృష్ణమాచార్ల సుపుత్రుడు.

అందరూ అతనివైపు విచిత్రంగా చూసారు.

"ఏమిటా సాక్ష్యం?! " అన్నాడు గణేష్‌బాబు.

"నిన్నరాత్రి నేను సెకండ్‌షోకెళ్ళొచ్చాను. అసలు మీరెవ్వరూ సినిమాకు రాలేదు. వర్షం పడలేదు" చెప్పాడా కుర్రాడు.

గణేష్‌బాబు గొంతులో పచ్చివెలక్కాయ పడినట్లయింది. అతడు మారుమాట్లాడకుండా.. ఎవరికీ కనిపించకుండా గుంపులో దూరి పోయాడు. నాస్తికసంఘం వారు తలోదిక్కూ పోయారు.

"ఏమిటీ..!! నిన్నరాత్రి...లక్ష్మణాచార్లవారి ఇంటికి వెళ్ళి, వారి సుపుత్రునితో కలిసి కంబైన్డు స్టడీ వెలగబెడతానని బొంకి..సెకండ్‌షో కెళ్ళావా!! అప్రాచ్యపువెధవా!! చూడు నిన్నేం జేస్తానో!!" అంటూ కృష్ణమాచార్యులు మర్రిచెట్టు కొమ్మనొక దాన్ని విరిచి పిల్లాడి వెంటబడ్డాడు. పిల్లాడు అందరినీ తోసుకుంటూ....తొక్కుకుంటూ గుంపులో దూరి అదృశ్యమయ్యాడు.

"ఇదిగో ఇక్కడ పోలేరమ్మకు గుడికడతాం. మీరుగానీ అడ్డొచ్చారంటే ... మీరు చచ్చాక మీ శవాల్ని అస్సలు తగలబెట్టను" అన్నాడు కాటికాపరి. "మరే..నేను వీళ్ళకు క్షవరం చెయ్యను" అన్నాడు క్షురకుడు.

అందరూ పకాపకా నవ్వారు.

"మీ పకపకలూ ఇకఇకలూ ఆపండి. మీలో సాతాను ప్రవేశించాడు. అందుకే మీరిలాంటి పిచ్చికూతలు కూస్తున్నారు. ఈ రోజే టౌనునుండి ఫాదర్‌ను రప్పించి, చర్చికట్టే ఏర్పాట్లు చేస్తాం" అన్నాడు ఇమ్మానుయేలు.

"ఛస్! బండరాయిని పట్టుకుని దేవుడంటారేమిటి. దేవుడు లేడు ...దెయ్యం లేదు." గుంపులో దాక్కుని అరిచాడు గణేష్‌బాబు.

"ఇక్కడ గుడికట్టి. దానిపేరిట ప్రజల నుండి డబ్బువసూలు చేసి దిగమింగాలని చూస్తే.. మర్యాద దక్కదు..."అన్నాడొక సత్యాన్వేషకుడు.

"అసలు....గుడంటేనే, కాపటలిస్ట్ వ్యవస్థకది చిహ్నం. దీనికి నే నొప్పుకోను" అన్నాడొక కమ్యూనిస్టు.

"ఒప్పుకోవడానికీ.... ఒప్పుకోకపోవడానికీ మధ్యలో నువ్వెవడివహే!"

"ఈ పంచాయితీని సర్పంచ్‌గారే తేల్చాలి" అంటూ ఎవరో సర్పంచ్‌ను మధ్యలోనికి తోసారు.

సర్పంచ్ అందరి వంకా భయంగా చూసాడు.

"అవును సర్పంచ్‌గారే తేల్చాలి" అన్నారందరూ ముక్తకంఠంతో.

"ఇదిగో సర్పంచీ! తీర్పు పోలేరమ్మ వైపే ఇవ్వు" కుడిచెవిలో ఊదాడు రంగయ్య.

"ఇదిగో ! తీర్పు .. మా వైపే ఇవ్వు కాదంటే... నీ ఇంట్లోని మంచికీ, చెడుకీ మేం రాం... మేం లేకుండా కార్యాలెలా చేస్తావ్" చెరో చెవి కొరికారు కేశవచార్లూ, శంకరశాస్త్రి.

"మర్యాదగా .. తీర్పు చర్చి వైపే ఇవ్వు. లేకపోతే .. మా వోళ్ళు ఓట్లేవి ఈసారి నీకు రావు" హడలెత్తించాడు ఏసుపాదం.

సర్పంచ్ గుండె నిమిషానికి వందసార్లు కొట్టుకుంటోంది. అరచేతుల్లో చెమటలు పట్టాయి. ముందునుయ్యి, వెనక గొయ్యి! ఎడమప్రక్క పులి, కుడిప్రక్క సింహం!!

తీవ్రంగా ఆలోచిస్తున్నట్లు ఫోజు పెట్టాడు సర్పంచ్.

అంతలో.. దుమ్ములేపుతూ రయ్యిమని ఓ కారు దూసుకువచ్చి అక్కడ ఆగింది. తెల్లగా, ఎత్తుగా, బలంగా వున్న ఓ అపరిచితవ్యక్తి కారులో నుండి దిగి, వారందరినీ తోసుకుంటూ.. రాతిబండ దగ్గరికి వచ్చాడు.

అతని వెనుక నలుగురు అసిస్టెంట్లు వచ్చారు.

అతడు ... ఎవ్వరినీ పట్టించుకోకుండా.. ఒక క్షణంపాటూ ఏకాగ్రతతో ఆ రాతిబండ వైపు చూసాడు. అసిస్టెంట్లు అతని చేతికి సుత్తి , ఉలి అందించారు.

"ఏయ్! ఏం చెయ్యబోతున్నారు?" అరిచారందరూ ముక్తకంఠంతో.

"మీకు సమాధానం చెప్పాల్సిన అవసరం మాకులేదు"అన్నాడొక అసిస్టెంటు.

"చెప్పితీరాలి. పోలేరమ్మపై ఉలిని మోపడం మహాపాపం!"

"ఛస్!పోలేరమ్మకాదు మహావిష్ణువు"

"విష్ణువుకాదు.... శివుడు"

"శివుడు కాదు... శిలువ"

"ఏదికాదు ... పిచ్చిగీతలు"

అసిస్టెంట్లు వారి మొహాలు చూసి నవ్వుకున్నారు.

"ఎందుకలా నవ్వుతున్నారు?" అడిగారెవరో.

"మిత్రులారా! వీరిపేరు ప్రకాశ్! గొప్పశిల్పి!! నిన్నరాత్రి మేము హైదరాబాద్ నుండి ప్రక్కనున్న టౌనుకు వస్తుండగా....ఇక్కడ టైరు పంక్చరైంది. మేము దాన్ని బాగుచేసే లోగా..మా సార్, ఈ చెట్టుక్రిందున్న గుండుమీద ...ఇది చెక్కారు. మిగతా సగం చెక్కడానికి ఇప్పుడొచ్చారు" చెప్పాడొక అసిస్టెంటు.

అందరూ నోళ్ళుతెరిచి, ఆ రాతిబండ వైపు చూస్తుండగా... ప్రకాశ్ చకచకా మిగతా భాగాన్ని పూర్తిచేసాడు.

అప్పుడొక సుందరమైన మనిషి ఆకృతి తయారైంది.

"అంటే ఇప్పటివరకూ...మనమంతా సగం తయారైన మనిషిలో మన దేవుళ్ళని చూసుకున్నా మన్నమాట" అనుకోసాగారు.

ప్రకాశ్ వారివైపు చూసి నవ్వుకొని .....వెళ్ళి కారెక్కాడు.

"మనమంతా అతడ్ని మెచ్చుకుంటుంటే అతగాడు ఒక్కమాటా మాట్లాడడేం??!!" అన్నారంతా తమలో తావే గొణుక్కుంటున్నట్టుగా.

"అయ్యా!! మా సార్ ఉలితో మాత్రమే మాట్లాడగలరు. ఆయన పుట్టుమూగ. ఇంక మీకేం సమాధానం చెప్పగలరు!!" అన్నాడొక అసిస్టెంట్ కారులో కూర్చుంటూ.

కారు కదిలింది.

అప్పటిదాక తమలో తామే కాట్లకుక్కల్లా పోట్లాడుకున్నందుకు ...సిగ్గుపడుతూ ..కారువైపు చూడసాగారు అక్కడున్న వారందరూ. ■




(గత సంచిక తరువాయి)

ఘజల్ లో ఉన్న షేర్ లను కలిపే సూత్రం ప్రాస. గట్టిగా మాట్లాడితే రెండు ప్రాసలు. వాటిని రదీఫ్, ఖాఫియాలంటారు. రదీఫ్ పాదాంతపదం. ఇది ప్రతి షేర్ రెండో పాదాంతంలో పునరావృతమౌతుంది. రదీఫ్‌కు ముందుండే పదంలోని అంత్యానుప్రాసను (రైమ్) కాఫియా అంటారు.

మీర్జా గాలిబ్ రాసిన ఓ గజల్‌లో మొదటి రెండు షేర్‌లు చూద్దాం -

దర్ద్ మిన్నత్ - కషే - దవా నహువా
మైన అచ్ఛా హువా బురా నహువా
జఖ్మ్‌గర్ దబ్‌గయా లహూ నథమా
కామ్ గర్ రుక్ గయా రవా నహువా

వీటిల్లో నహువా అనేది రదీఫ్ 1, 2, 4 లైన్లలో వచ్చింది. 6, 8, 12.. వ లైన్లలో కూడా వచ్చి తీరుతుంది. అలా అని శ్రోతకు కూడా తెలుసు. అయితే అందం అంతా ఖాఫియాలో ఉంది. 'దర్ద్.' అన్నది మొదటి షేర్ - దాన్నే మత్లా - అంటారు. దానిలో రెండు పాదాలలోనూ ఖాఫియాను ఉపయోగిస్తారు. ఆ షేర్ మొత్తం వినగానే శ్రోత ఖాఫియాను పట్టుకుంటాడు.

ఇక్కడ దవా, బురా అని రెండు లైన్లలోనూ రాగానే 4 వ లైన్లో వీటి ప్రాసతో పదం వస్తుంది అనుకుంటాడు. అనుకున్నట్టుగానే 'రవా' వచ్చింది.

తస్నీమ్ ఫారుఖీ గజల్ ఒకటి -

నజర్ నజర్ సే మిలాకర్ షరాబ్ పీతే హై
హమ్ ఉన్‌కో పాస్ బిఠాకర్ షరాబ్ పీతే హై

అని ప్రారంభమవుతుంది.

ఇది వినగానే 3 వ లైనులో ఆఖరి పదం ఏదైనా రావచ్చు కానీ నాల్గవ లైను ఆఖరి పదం మాత్రం 'షరాబ్ పీతే హై' అని తెలిసిపోతుంది. ఎందుకంటే అది రదీఫ్ కాబట్టి! ఇక దానికి ముందు వస్తున్న మిలాకర్, బిఠాకర్ వచ్చాయి కాబట్టి అది ఖాఫియా కాబట్టి 4 వ లైనులో లాస్ట్ బట్ వన్ పదం వాటితో 'రైమ్' అయ్యే పదం వస్తుందని ఊహించవచ్చు. అవును 'జలాకర్' అని వస్తుంది.

అలాగే ముంతాజ్ రాశిద్ 'బేపర్దా నజర్ ఆయీ' గజల్‌లో 'జమానా ఖరాబ్ హై' అన్నది రదీఫ్‌గా వాడుకున్నాడు. ఖాఫియాలుగా 1 వ లైనులో బేనకాబ్, 2 వ లైనులో శబాబ్, 4 వ లైనులో ఖరాబ్, 6 వ లైనులో జవాబ్, 8 వ లైనులో జనాబ్ వాడుకున్నాడు. ఈ సారి మీరేదైనా గజల్ వింటున్నప్పుడు మొదటి రెండు లైన్లు జాగ్రత్తగా వింటే ఈ 'గెస్సింగ్ గేమ్'లో మీరూ పాల్గొనవచ్చు.

ఈ పదాలు వింటున్నప్పుడు ప్రాస కుదరడమే కాకుండా వీటిల్లో ఏదో ఛందస్సు కూడా ఉండి ఉంటుందన్న అనుమానం వస్తోంది కదూ! అవును. ఉంది. ఉర్దూలో 5 మాత్రల గణాలు 2, ఏడు మాత్రాల గణాలు 5 ప్రధానమైనవి. తెలుగులోలా కాకుండా దీర్ఘాక్షరం తర్వాత వచ్చే పొల్లు హల్లును మరొక మాత్రగా పరిగణిస్తారు. ఉదా॥కి 'భూల్' ను మూడు మాత్రలుగా పరిగణిస్తారు. మొదటినుండి చివరివరకు వృత్తాలను (ఉర్దూలో 'బహర్లు' అంటారు) కచ్చితంగా అనుసరించడం వల్లనే మాత్రాసమత, గానయోగ్యత లభించి గజల్‌లు వినసొంపుగా ఉంటాయి.

వీటి సొగసులకు మురిసి ఇతర భారతీయ భాషల కవులు గజల్‌ను దిగుమతి చేసుకుందామని ప్రయత్నించారు. గుజరాతీ కవులకు శ్రోతల స్పందన లభించగా మరాఠీ కవులు తమ ఛందస్సుకు అవి సరిపోవని గుర్తించి విరమించుకున్నారు. ఉర్దూగజల్లకు వచ్చిన ఆదరణ హిందీ గజల్లకైనా లభించని పరిస్థితుల్లో ఉర్దూ నేపథ్యం లేని పెన్నా శివరామకృష్ణ తెలుగులో గజల్‌ని దిగుమతి చేయబూనడం సాహసమే అనిపిస్తుంది.

40 వ గజల్‌లో 'చూడరాదా' అన్నది రదీఫ్ అనుకుంటే కలిపి (1 వ లైను) గాయ పరచి (2 వ లైను) పరచి (4) నిలిపి (6) కొలిచి (8) పరికించి (10) పరచి (12) అడిగి (14) అన్నవి ఖాఫియా లనుకోవాలేమో!



ధర - 40 రూ॥లు, 99 పేజీలు
ప్రతులకు - రచయిత
(040-24046556), విశాలాంధ్ర...

38 వ గజల్‌లో రదీఫ్, ఖాఫియాలు కొలిని పోయనా యనిపించినా భావం మాత్రం దీనికంటె బాగుంది. శృంగారం, తాత్వికత, ఆశాభావం, వైరాగ్యం అన్నీ కలిసివున్నాయి.



కుసుమమా! నీ కులుకులన్నీ నీడ ఒడిలో రాలువరకే దేహమా! నీ తపనలన్నీ నేల ఒడిలో వాలువరకే
కవితకైనా వనితకైనా అరచాటు ఉంటెనె అందం
పరువమా! నీ సిగ్గులన్నీ పైటబరువై జారువరకే
ఎంతసాహసయాత్రకైనా అంతముండును ఎపటికైనా
మేఘమా! నీ మెరుపులన్నీ వర్షధారలు కురియువరకే
కొండకొమ్ముల చుట్టితేనేం కొనలెన్నో తడిపితేనేం
వంపుసొంపుల నదులగర్వం సాగరంలో కలియువరకే
నిలిచిపోతే మరల పాడే పాటకాదీ మనిషి మనుగడ
గానమూ, ఈ ఉష్ణబాష్పం అగ్నిగుళికగ మారువరకే
మెరుపుతీగలు ఎల్లకాలం వెలుగుపూలను కురవగలవా
తాను తలచును నిన్ను 'పెన్నా' ఆమె కోపం తీరువరకే

'పైటజారడాలు' ఉర్దూ గజల్ పద్ధతికి విరుద్ధమనుకుంటాను. ఈ విషయంలో మన తెలుగుకవులకున్న స్వేచ్ఛ ఉర్దూకవులకు లేదు. 'షిష్టగీ' (మార్దవం)పై వారికి పట్టుదల పెచ్చు. వస్తువు విషయానికి వస్తే 1930 ల వరకు ప్రేమ, వియోగం, వేదన, మధుప్రసక్తి (దీనిని 'రిందానా షాయరీ' అంటారు), నిరాశ, నిస్పృహ లాటి వాటికి పరిమితమయి వుండేవారు. ఆ తర్వాత వామపక్ష కవుల ప్రవేశంతో అభ్యుదయ భావాలకు కూడా గజల్ వాహిక అయింది.

పెన్నా కూడా గజల్‌ను అనేక భావాల, అభిప్రాయాల వ్యక్తీకరణకు ఉపయోగించుకున్నారు.

★లాకప్‌లో మనిషి కుశలడుగనేల 'పెన్నా'
వెంట్రుకతో ఉరిపోసుకు మరణించాడంటారు
★పరిమళమే నీ మహలుకు దారి చూపునేమో
కురుల నలా గాలిలోన పరచి చూడరాదా
★ఆ తోటలో పాట నాలకించను పోయి
తేనెపట్టుకు చేయి తగిలించి వచ్చాను

బోనస్‌గా ఇచ్చిన 6 రుబాయిలలో -

★ఎగసిపడే అలను పూలపడకగ భావించకు
అలలలోని నింగితోటి బంధము నూహించకు
★పులకలు రేపిన చినుకే పిడుగులు కురిపిస్తే ఏం చేయను
పెనవేసిన సుమవల్లిక నన్నడవిని చేస్తే ఏం చేయను
★ఇరులతోడ మరలతోడ ఇరుకునగరమాయె జగతి

ఇలాటి చక్కటి కవిత్వం ఆస్వాదించడంతో బాటు, ఉర్దూ గజల్ గురించి మరిన్ని వివరాలు తెలుసుకోవాలంటే చదవాల్సిన పుస్తకం. బాపు, చంద్ర బొమ్మలు మనోహరంగా ఉన్నాయి.

- ఎమ్బీయస్ ప్రసాద్

# నేనూ నా పాటలు

50 సంవత్సరాల
నట జీవితాన్ని పూర్తి చేసుకున్న
స్వర్ణోత్సవ నటి జమున
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా అందిస్తున్న
జ్ఞాపకాల ధారావాహిక

14



- శ్రీమతి జమునా రమణారావు

ఇంత వరకూ మనం హిందీ, తెలుగు కవర్ చేశాం. తమిళం కవర్ చేయలేదు. తమిళంలో నేను ఇంతవరకూ 20 సినిమాలు చేశాను. అందులో శివాజీ గారితో నాలుగు, ఎం.జి.ఆర్. గారితో రెండు! అందులో ఒకటి రిలీజైంది. ఒకటి మధ్యలో ఆగిపోయింది.

శివాజీ గారితో ఫస్ట్ పిక్చర్ 'తంగమలై రహస్యం' అని బి.ఆర్.పంతులు గారు తీశారు. అది డబుల్ వెర్షన్. తమిళంలో శివాజీ, కన్నడంలో ఉదయ్ కుమార్. ఉదయ్‌కుమార్‌కు అది ఫస్ట్ పిక్చర్. నాకు అప్పటికి 15, 20 సినిమాలు ఉన్నాయి. ఉదయ్‌కుమార్ కన్నా నేను చాలా సీనియర్. 'తంగమలై రహస్యం' కన్నడంలో నాకు సెకండ్ పిక్చర్. కన్నడంలో ఆ సినిమా పేరు 'రత్నగిరి రహస్య' రెండు పిక్చర్లూ (కన్నడం, తమిళం)100 రోజులు ఆడాయి. ఆ సినిమాలో ఉదయ్‌కుమార్‌కు చాలా చక్కటి పేరు వచ్చింది. మ్యూజిక్ చాలా చక్కగా ఉంటుంది. తెలుగులో దానిని 'రత్నగిరి రహస్యం' అని డబ్ చేశారు. మ్యూజిక్ సైడ్ వస్తే ఈనాటికీ తమిళ్‌లో ఈ సినిమా నుండి వేసే పాట 'అముదై పోయుం నిలవే నీ అరిగిళ్ వరాదదేనో...' అని చాలా ఫేమస్. ఇప్పటికీ ఏ తమిళ ఛానెల్ అయినా పాత పాటలంటూ వేయడం జరిగితే ఈ పాట తప్పకుండా ఉంటుంది. అలాగే సిలోన్ రేడియోలో కూడా ఈ పాట ఎప్పుడూ వినిపిస్తూ ఉంటుంది. తెలుగులో యమునా ముఖమున్ కనవే... అని ఉంటుంది. అది ఓ మంచి పాట. శ్రీ శ్రీ రాశారా పాటని.

'రత్నగిరి రహస్యం'లో తమాషా సంఘటనలు చెప్పుకోవాలంటే అప్పటికి నేను గ్లామర్ హీరోయిన్‌గా ఎస్టాబ్లిష్ అయ్యాను. అయినా కూడా రొమాంటిక్ సీన్స్ ఏవైనా ఉంటే హీరోలు భుజం మీద కూడా చెయ్యి వేయకుండా చూసుకునేదాన్ని. అంత మడిగా యాక్ట్ చేసేదాన్ని. అప్పుడు తమిళ వెర్షన్‌కు శివాజీగారితో కొడైకెనాల్‌లో షూటింగ్ జరుగుతోంది. ఆ బిట్

చిత్రం : రత్నగిరి రహస్యం
రచన : శ్రీశ్రీ
సంగీతం: ఎం.సుబ్రహ్మణ్యరాజు, టి.జి.లింగప్ప
గానం: పి.సుశీల

యమునా ముఖమున్ కనవే నీ
కలుకా పరాకడేలో - అలుకా పరాకడేలో
యమునా ముఖమున్ కనవే నీ
కలుకా పరాకడేలో -అలుకా పరాకడేలో
హృదయం ప్రేమకె దాసిని చేసే -
నీ చెలి పూవుల బాలా
పరిమళ మిందే మాయునో ఏమో -
వెన్నెలవేళా ఆడగ రాదా
అలుకా పరాకడేలో -
అలుకా పరాకడేలో ॥యమునా॥
మదినా ఆశకె ప్రాణం పోసి -
మరచేవో చందమామా
చెలిపై చలము ఇకపై విడుము -
కనవా కథయే ముగియక ముందే
అలుకా పరాకడేలో అలుకా పరాకడేలో॥యమునా॥






'రత్నగిరి రహస్యం'
పాటల పుస్తకం కవర్‌పేజీ

మాత్రం కలర్‌లో తీశారు. అది క్లాసికల్ సాంగ్. నవరాగమాలికలో పెట్టారు. అది కూడా మంచి పాటే. అందులో ఓ సంఘటన ఏమిటంటే డ్యాన్స్ మాస్టర్ చోప్రా గారనుకుంటా. హీరోయిన్ గట్టు మీద నుంచుని ఉంటే హీరో ఆ అమ్మాయి నడుం పట్టుకుని క్రిందకు దింపాలి. ఇది నేను అబ్జెక్ట్ చేశా. నడుంమీద చెయ్యి వేయకూడదు. అలా కాకుండా వేరే విధంగా ప్లాన్ చేయమని చెప్పాను. మా అమ్మానాన్న ఎదురుగానే ఉన్నారు. మొదట్నుంచీ కూడా కొంచెం రిజర్వ్‌డ్‌గా ఉండేదాన్ని కనుక అలా కాకపోతే ఆ సీన్ నేను చేయనని చెప్పేశాను. 'ఎలాగమ్మా మాస్టర్ కంపోజ్ చేసేశారు....' అన్నాడు చోప్రా గారి అసిస్టెంటు. నేను మాట్లాడటం మా అమ్మ చూశారు. 'ఇదిగో.... నడుము పట్టుకుంటే అసలు ఒప్పుకోవద్దు...' అని నాతో అన్నారు. 'వేరే విధంగా ప్లాన్ చెయ్యమని డ్యాన్స్ మాస్టార్‌కి కబురుపెట్టానమ్మా' అని సర్దిచెప్పాను.

నేను అలా అన్న విషయం చోప్రా గారు బి.ఆర్.పంతులుగారికి, శివాజీ గారికి చెప్పారు. 'సార్... ఎన్నా సార్... అక్కడ మూమెంట్ అదే. దూకాలి కదా. హీరోయిన్ దూకుతున్నప్పుడు హీరో సపోర్ట్ చేయాలి కదా' అన్నారు బి.ఆర్.పంతులు. ఇక శివాజీ అయితే షాక్ అయిపోయాడు. " ఇదు ఎన్నడా... ఏ హీరోయిన్ కూడా ఇలా అబ్జెక్ట్ చేయదు కదా" అంటూ నా దగ్గరకు వచ్చి " ఎన్న కొళందే...నువ్వు చిన్నపిల్లవి. మనం చేసేది యాక్టింగ్. నేనేమైనా నిన్ను నమిలి మింగేస్తానా? రా ...." అని చెప్పి నన్ను కన్విన్స్ చేశారు. (శివాజీ నన్ను ఎప్పుడూ 'కొళందే' అని పిలిచేవాడు. చిన్న పాపల్ని అలా పిలుస్తారు.)

బి.ఆర్.పంతులు గారు వచ్చి మా అమ్మగారితో 'అమ్మా... మేమేమీ అసహ్యంగా తీయట్లేదు" అన్నారు. మా అమ్మకు వచ్చీరాని తమిళ్. "అదేమీ... అక్కడ చేయి పట్టుకుని దూక వచ్చు కదా..." అంటే "చేతితో ఎట్లా దూకుతారమ్మా. అదొక పోజ్. చక్కటి డ్యాన్స్ మూమెంట్ వస్తుందక్కడ." అని ఈయన. అలా ఆయన మా అమ్మను కన్విన్స్ చేస్తేగానీ ఆ షాట్‌కు నేను సిద్ధం కాలేదు. అందులో శివాజీ గారి పెర్ఫార్మెన్స్ అద్భుతం. ముఖ్యంగా గూని మేకప్‌లో. ఆయన కురూపిగా మారటం, తరువాత హీరోయిన్ రాయిగా మారటం ఆ సీన్స్ అన్నీ బాగుంటాయి.

జానపదం నుండి పౌరాణికంలోకి వస్తే... పౌరాణిక చిత్రాలు కూడా చాలా యాక్ట్ చేశాను. అన్నిటికన్నా ఫస్ట్ 'వినాయక చవితి'లో ఎన్.టి.ఆర్. గారు కృష్ణుడుగా నేను సత్యభామగా చేశాం. ఆ సత్యభామ వివాహానికి ముందు సత్యభామ. అందువల్ల ఆ సత్యభామలో అవమాయకత్వం, ఆత్మాభిమానం... ఒక విధమైన అహంకారం ఉంటాయి. అందుకని ఎక్కువ ఇన్నోసెన్స్ మిళితం చేశాను., అహంకార పూరితురాలు కాదు. ఎప్పుడు అహంకారం వస్తుందంటే కృష్ణునితో పెళ్లయిన తరువాత.... ఎప్పుడైతే కృష్ణుడు పూర్తిగా తనకి కంప్లీట్‌గా దాసోహం అయిపోయాడు అని అనుకుంటుందో అప్పుడు ఒక విధమైన అహంకారం, శ్రీకృష్ణుడు ఎప్పుడూ నా దగ్గర ఉండాలనే



చిత్రం : శ్రీకృష్ణ తులాభారం
రచన: దైతా గోపాలం
సంగీతం: పెండ్యాల
గానం: పి.సుశీల

మీర జాలగలడా..
మీర జాలగలడా నా యానతి
వ్రత విధాన మహిమన్ సత్యాపతి ॥మీర॥
నటన సూత్రధారి మురారి
ఎటుల దాటగలడో నా యానతి
వ్రత విధాన మహిమన్ సత్యాపతి (2) ॥మీర॥
సుధా ప్రణయ జలధిన్ వైదర్భికి
ఈడ తావుగలదే నాతోనిక
వాదులాడ గలడా సత్యాపతి (2) ॥మీర॥
మధుర మధుర మురళీగాన రసాస్వాదనమున....ఆ..
మధుర మధుర మురళీగాన రసాస్వాదనమున
అధర సుధారస మదినే గ్రోలగ (2) ॥మీర॥













నేనూ నా పాటలు



చిత్రం : శ్రీకృష్ణ తులాభారం
రచన : సముద్రాల
సంగీతం: పెండ్యాల
గానం: ఘంటసాల

ఓ చెలి కోపమా
అంతలో తాపమా
సఖి నీవలిగితే -
నే తాళజాలా ॥ఓ చెలి॥
అందాలు చిందే మోము
కందేను ఆవేదనలో
పన్నీట తేలించెదనే
మన్నించవే ॥ఓ చెలి॥
ఏనాడు దాచని మేను
ఈనాడు దాచితివేల
దరిచేరి అలరించెదనే
దయజూపవే ॥ఓ చెలి॥
ఈ మౌనమోపగలేనే
విరహాలు సైపగలేనే
తలవంచి నీ పదములకు మ్రొక్కేనులే







పొజెసివ్ నేచర్ వస్తాయి. 'వినాయక చవితి'లోని సత్యభామ క్యారెక్టర్‌లో అహంకారం కొద్దిగానే చూపించాం. ఎందుకంటే నారదుడు వచ్చి చెప్తాడు... 'అమ్మా ఇలా నువ్వు అహంకార పూరితంగా ఉన్నావంటే శ్రీకృష్ణుడు నీకు లొంగడు' అని.

తరువాత 1965లో... నాకు పెళ్లయిన కొత్తలో శ్రీకృష్ణతులాభారం.... రామానాయుడు గారికి అది రెండో పిక్చర్ నేను చేయటం. అంతకుముందు 'రాముడు -భీముడు' చేశాను. అందులో కూడా రామారావు గారితోనే కాంబినేషన్. ఈ శ్రీకృష్ణ తులాభారంలో రెండు మూడు చిన్న సంఘటనలు ఉన్నాయి. అప్పటికి పాత సత్యభామ నేను వేసి ఎన్నో సంవత్సరాల గ్యాప్ వచ్చేసింది. ఆ పాత్రకి పద్మశ్రీ స్థానం నరసింహారావు గారు చాలా ఫేమస్ కదా.... అందుకని ఈ స్క్రిప్టు అదీ చూసిన తరువాత రామానాయుడు గారితో చెప్పాను... 'ఏవండీ స్థానం వారిని చాలా గొప్పగా చెప్పుకుంటారు... కాబట్టి ఓ సారి ఆయన డ్రామా ఉన్నప్పుడు చూసినా లేకపోతే ఒక్కసారి ఆయనతో డిస్కస్ చేసినా బాగుంటుందేమో.... ఇది ఛాలెంజింగ్ సత్యభామ కదా...' అని నేను అన్నాను. రామానాయుడు గారు చాలా ట్రై చేశారు, కానీ స్థానం వారు దొరకలేదు. ఎకార్డింగ్ టు స్క్రిప్ట్ వెళ్లిపోయాం. దర్శకుడు కమలాకర కామేశ్వరరావు గారు... నాకు అదే సమయంలో 'మిలన్' షూటింగ్ గోదావరి ఒడ్డున జరుగుతోంది. బాంబే ఆర్టిస్టులంతా వచ్చారు. దీనికి సంబంధించిన విశేషాలు ఇంతకుముందే చెప్పుకున్నాం కదా.

పొద్దున్నంతా 'మిలన్' హిందీ షూటింగ్. సాయంత్రం స్నానం అయిపోయిన తరువాత అద్దం ముందు ఈ టేప్ రికార్డర్ పెట్టుకుని ఓం నమః లు నేర్చుకుంటారు చూడండి అలా అద్దం ముందు రిహార్సిల్స్ చేసేదాన్ని. నిజంగా సత్యభామ అంటే జమున - జమున అంటే సత్యభామ... నభూతో నభవిష్యతి అని ప్రేక్షకులు, సినిమా పరిశ్రమకు సంబంధించిన వాళ్లు చెప్పుకోవటానికి కారణం ఏమిటంటే దీనికి నేను చేసిన కృషి. ఆ పాత్ర స్వభావాన్ని బాగా అర్థం చేసుకుని, ఆ పద్యాలు, పాటలు.... సాధన చేశాను. 'మీర జాల గలడా..' పాట అద్దం ముందు రోజూ రిహార్సిల్స్ చేసేదాన్ని. ఎక్కడ, ఎప్పుడు చేతి వేలు ఇలా పెట్టాలి, కాలు వంకర ఎలా ఉంచాలి. నడుంమీద చేయి ఎప్పుడు వేయాలి.... అంత స్టడీ చేయబట్టే ఆ పాత్ర కానీయండి, ఆ పద్యాలలో నా ఎక్స్‌ప్రెషన్స్ కానీయండి అంత నేచురల్‌గా వచ్చాయి. అంత బాగా నేను చేయగలిగాను అంటే అంత హోమ్‌వర్క్ ఉంది మరి. ఈ పాట సుశీల గారు అద్భుతంగా పాడారు. ఇంచుమించు పాత నాటకంలో ఉండే రాగాలే పెట్టి స్వరపరిచారు పెండ్యాల గారు. ఆ చిత్రం అంత బాగా ఆడటానికి కారణం ముఖ్యంగా మ్యూజిక్... పాత పద్యాలు ఇంచుమించు ఆ రాగాల్తో పెట్టినందువల్ల ... రిచ్‌గా తీయడం వల్ల...యాస్పెక్ట్స్ అన్నీ బాగా కుదిరాయి.. పద్యాలతో కూడిన సినిమా కాబట్టి అది మనకు నాటకం ఎఫెక్ట్ రాకుండా, సినిమా ట్రెండ్‌లో తీయటం అనేది శ్రీకృష్ణతులాభారం విశిష్టత.

ఈ సినిమా షూటింగ్ అప్పుడు ఓ సంఘటన జరిగింది. ఫస్ట్ డే షూటింగ్ లో మేం ఇద్దరం అంటే ... కృష్ణుడు, సత్యభామ ఇంద్ర లోకానికి వస్తాం. ఇంద్రుడు తల్లిగా ఋష్యేంద్రమణిగారు యాక్ట్ చేశారు. ఆవిడ పెద్ద నటి. నాటకాలలో చేసి ఉన్నారు. సరే రిహార్సిల్స్... అవీ అయినాయి. నాకేమీ పెద్ద డైలాగులు ఉండవు. ఆవిడ వస్తూనే 'అమ్మాయ్ జమునా... స్థానం వారు వేసినటువంటి సత్యభామ క్యారెక్టర్ వేస్తున్నావు. ఆయనతో పోటీ ఎవరూ రాలేరు. చాలా జాగ్రత్తగా చేయమ్మా. విమర్శలు వచ్చేస్తాయ్. ఆయన ముందు ఎవరూ ఆగరు" అని చెప్పి "ఇదిగో... స్థానం వారు ఇలా నటించేవారు'' అని ఆవిడ నాకు చేసి చూపించింది. ఎలా చేసిందంటే... పమిట మాటి మాటికి సర్దుకోవటం, తొడ మీద నుండి చేయి తిప్పుకోవడం చేసి చూపించింది. స్థానం వారు అలా చేసేవారంట. అనకూడదు గానీ నాకు నవ్వు వచ్చింది. పెద్దావిడ చెప్పింది కదాని మాట్లాడలేదు. సరే ఆ షాట్ అయిపోయింది. ఆ షాట్‌లో నేను నడుం మీద చేయి పెట్టుకుని ఉంటాను అంతే. షాట్ అయిపోయిన తర్వాత ఆవిడ వచ్చి "ఏంటమ్మాయ్... నేను చెప్పినట్టు అసలు చేయలేదు. పమిట సర్దుకోవటం చేయలేదేంటి?' అన్నారు.

అప్పుడు నేనన్నాను 'అమ్మా... స్థానం వారు మగవారు. ఆయన ఆడ క్యారెక్టర్ వేస్తున్నారు కాబట్టి కొంచెం అతిగా, ఓవర్‌గా నటించాలి. అందుకని పమిటను మాటి మాటికి సర్దుకోవటం, తెచ్చిపెట్టుకున్నటు వంటి వయ్యారంతో యాక్ట్ చెయ్యడం చేయాలి.... నేను ఎవరినీ ఇమిటేట్ చేసి ఎరుగను. పైగా ఆయన వేసిన డ్రామాలను కూడా నేను చూడలేదు. నా ఊహకు తగినట్లు చేస్తాను. అదే ప్రకారం నేను చేస్తున్నాను. మీరు చెప్పినట్లు చేయట్లేదని ఏమీ అనుకోవద్దమ్మా.... స్థానం వారు వేసింది మీ కాలంలో.. స్టేజ్‌కు మైలు దూరంలో జనం కూర్చుని ఉంటారు. గట్టిగా గొంతెత్తి పాడాలి. కొంచెం విగరస్‌గా యాక్ట్ చేయాలి. అందుకని ఆయన అలా చేసుంటారు. నేను అస్తమానం పమిట గానీ సర్దుకున్నానంటే జనం.... మరీ ఓవర్ చేసానని అనటమే కాక, నా పాత్రకు కూడా చెడ్డ పేరు వస్తుంది. సత్యభామ పాత్రను సెక్సపీల్ పాత్రగా చేశానని నన్ను ఆడిపోసుకుంటారు. శృంగారాన్ని చూపుల్లో, నడకలో, యాక్టింగ్‌లో నేను తీసుకు రావాలని అనుకుంటున్నాను." అని ఆవిడను శాంత పరచగలిగాను.

ఇంకొకటి ఏమిటంటే గ్రేట్‌నెస్ ఆఫ్ ది డైరెక్టర్. ఆ రోజుల్లో ఆర్టిస్టులకు, టెక్నీషియన్స్‌కు చాలా చక్కటి అండర్‌స్టాండింగ్ ఉండేది.

కె.వి.రెడ్డి గారు.... చాలా పెద్ద డైరెక్టర్. ఆయన పది రకాలుగా చేసి చూపించేవారు. ఇలా చేయమ్మా... అలా చేయమ్మా... అని చూపించి ఇలా చేస్తే నాకు చాలమ్మా...అని చెప్పేవారు. ఇంకో డైరెక్టర్‌కు మనం చెప్పాలి. ఆయన కూడా చాలా పెద్ద డైరెక్టర్. సార్ నేను ఓ పది రకాల ఎక్స్‌ప్రెషన్స్ ఇస్తాను. వాటిలో ఈ సందర్భానికి పనికి వచ్చే ఎక్స్‌ప్రెషన్ ఏదో చెబితే అది నేను చేస్తాను అంటే.... ఓకే అలాగే చేయండమ్మా... అని వాళ్లకి కావలసిన ఎక్స్‌ప్రెషన్ రాగానే నాకు ఇలా కావాలనేవారు. ఇలాంటి అండర్‌స్టాండింగ్ ఆర్టిస్టులు, డైరెక్టర్స్ మధ్య ఉండేది.

ఇది ఎందుకు చెబుతున్నానంటే శ్రీకృష్ణతులాభారంలో 'మీరజాలగలడా' సాంగ్‌లో ఆ మాట రెండు మూడు సార్లు రిపీట్ అవుతుంది. అలా రెండేసి సార్లు మూడేసి సార్లు మీరజాలగలడా అని వచ్చినప్పుడు కెమెరా ఎక్కడ పెట్టారు...అని చూశాను. నాకు స్ట్రెయిట్‌గా పెట్టారు. లాంగ్ షాట్ నుంచి క్లోజప్‌కు రావాలి. అంతకుముందు కూడా ఇంచుమించు ప్యార్‌లల్ ట్రాలీ పాడ్ వేసి ఇంచుమించు 3/4లో తీశారు. థర్డ్ రిపిటేషన్ వచ్చేసరికి లాంగ్‌షాట్ నుండి క్లోజప్‌కు వస్తుంది. అది మూడు రకాలు.... అప్పటికే కొంచెం అనుభవం వచ్చింది. షాట్స్ డివిజన్ కూడా కొంచెం తెలుస్తోంది. డైరెక్షన్‌కు సంబంధించిన విషయాలు బుర్రకెక్కుతున్నాయి. అందుకని సజెషన్ ఇచ్చాను. సార్ ఇందాక మనం ఇలా తీసుకున్నాం కదా... ప్రతిసారి మీరజాలగలడా అంటూ వేలు చూపించటం చేస్తున్నాను... అలా కాకుండా కాలు మీద నుండి మీరు టిల్ట్ అప్ చేసుకోవచ్చు కదా సార్ .... సత్యభామ కాలుతో గిరి గీసినా కూడా కృష్ణుడు దాటడు అన్న సెన్స్ వస్తుంది. మీరు ఏమీ అనుకోకపోతే నేను అలా కాలుతో గీత గీస్తున్నట్టు చేస్తాను. మీరు కాలు మీద నుండి టిల్ట్ అప్ చేసుకుంటూ కెమెరాని వెనక్కి తీసుకెళ్లండి - ఫుల్ ఫిగర్ తీసుకునేందుకు ! మీకేమీ అభ్యంతరం లేకపోతే నాకు ఈ ఐడియా వచ్చిందండి. చేద్దామా" అన్నాను. అలా అనగానే 'చాలా బాగుందమ్మా... చేద్దాం.. వెరీ గుడ్ వెరీ గుడ్' అన్నారు దర్శకుడు కామేశ్వరరావు గారు. అంటే ఆ పాత్ర గురించి నేను ఎంత ఆలోచించానన్నదానికి ఇది ఓ నిదర్శనం. ఓ ఆర్టిస్ట్‌గా నేను చెబితే దాన్ని ఎంత స్పోర్టివ్‌గా... ఆయన తీసుకున్నారు...!? చేతితోనే కాదు సత్యభామ కాలితో గిరి గీసినా కూడా జవదాటడు అన్న సెన్స్ వచ్చింది దాంట్లో.

అలాగే ఇంకో సంఘటన ఏమిటంటే - దీన్ని నేను చాలా క్లారిఫై చేయాలి. ఎందుకంటే రాజకీయాలకు కూడా దీనిని ముడిపెట్టేశారు.

'ఓ చెలీ కోపమా..' అలక సీన్‌లో రామారావుగారు పాట పాడతారు. ఆఖరున వచ్చి ఆయన కిరీటంతో సహా నా కాలు దగ్గర తల వంచుతారు. కాలు నేను జాడించటంతో కిరీటం పడిపోవటం... ఆ తరువాత 'నను భవదీయ దాసుని....'పద్యం. ఆ షాట్ అయిన తరువాత నేను వెంటనే రామారావు గారికి సారీ చెప్పటం అయిపోయింది. అది యాక్టింగే అయినా ఆయన తలకు నా కాలు తగిలింది కదా! నేను అసలే కృష్ణ భక్తురాల్ని. కృష్ణుణ్ణి చూడటంతోనే తన్మయత్వం పొందుతాను. ఇక రామారావు గారు కూడా కృష్ణుడులా చాలా బాగుండేవారు. అందుకే వెంటనే నేను సారీ చెప్పటం కూడా జరిగింది.

నేను రాజకీయాల్లోకి వచ్చిన తరువాత కాంగ్రెస్ వాళ్లు దీన్ని బాగా వాడుకున్నారు. నేను రామారావుగారిని తన్నానని పబ్లిక్ మీటింగ్‌ల్లో ఎప్పుడూ అనలేదు. ఆయన కృష్ణ పరమాత్ముడైతే నేను అవర సత్యభామను అని చెప్పేదాన్ని కానీ స్టేజ్‌పై చాలామంది కాంగ్రెస్ నాయకులు మాత్రం ఆవిడ సత్యభామ... ఆయన్ని కాలుతో తన్నింది అని అనేవారు. సరే ప్రెస్ పీపుల్ కొంతమంది నేను అలా మాట్లాడినట్టు రాశారు. యాక్చువల్‌గా నేను కడప జిల్లాకు వెళ్లినప్పుడు ఓ లేడీ మాట్లాడింది ఈ మాట. దాన్ని పట్టుకుని నాకు అంటగట్టేశారు. అదీ చరిత్ర.

రామారావు గారి పట్ల నేను చాలా గిల్టీగా ఫీల్ అయ్యాను. పురాణంగా వచ్చిన దాన్ని మార్చమని మనం ఎలా అంటాం. ఇంకోటి ఏమిటంటే భాగవతంలోనే రాశారో... మరి ఎక్కడ రాశారో కానీ... సత్యభామ అలిగినప్పుడు ఉల్లిపొరలాంటి గుడ్డ కప్పుకుంటుందంట. అది ఎక్కడో చదివాను నేను. నిజంగా అలానే తీశారు. ఓ పల్చటి గుడ్డను కప్పుకుని.... ఓరగా తీయటం... మళ్లా కప్పటం... ప్రత్యేకంగా ఆ అలక సీన్.

సామాన్యంగా ఏంటంటే తులాభారంలో సత్యభామ అంటే పరమ కోపిష్టిది. చాలామందిని నేను అబ్జర్వ్ చేశాను. కులుకుతారు. కోపం వచ్చినప్పుడు బుస కొట్టినట్టు తెగ ఫిజికల్ మూమెంట్ ఇస్తారు. కానీ నేను అలా చేయలేదు.

## నే నూ నా పా ట లు



*సత్యభామ పాత్ర గురించి వచ్చే సంచికలో మరికొంత...*



రైటర్ : మన సినిమాలో హీరోయిన్‌కు కన్నుండదు, హీరోకు కాలుండదు, విలన్‌కి చెయ్యుండదు,
ప్రొడ్యూసర్ : ఈ సినిమా తీస్తే ఫీల్డులో నేనుండను.



ఫారిన్‌లో వున్న చైతన్య: మన చిన్నప్పడు వెకిలి వేషాలు వేస్తూ మాష్టారి చేతిలో రోజూ తన్నులు తింటూండే మోహన్ ఇప్పుడేం చేస్తున్నాడ్రా?
ఇండియాలో వున్న శ్రీను : సినిమాల్లో కామెడీ వేషాలు వేస్తున్నాడ్రా.



సైక్రియాట్రిస్ట్ : సినిమా హీరోయిన్లు కలల్లోకి వస్తున్నారంటున్నారు. సంతోషవేగా.....అందులో బాధేముంది?
సుబ్బరావు : ఏం చెప్పేది సార్, మేకప్ లేకుండా వస్తుంటే....

**ఈ జోకులను పంపించిన వారు: గొల్లపూడి శ్రీనివాస్, హైద్రాబాద్.**



"ఏరా టింకూ ! ఎన్నిసార్లు చెప్పినా నీ చేతివ్రాత ఇంప్రూవ్ చేసుకోవెందుకురా ?"
"నేను పెద్దయ్యాక డాక్టర్ అవ్వాలని నువ్వేకదమ్మా అంటావు ! ప్రిస్క్రిప్షన్ పేషంట్లకి అర్థం కాకుండా వ్రాయాలంటే ఇప్పట్నుంచీ ప్రాక్టీస్ చేయాలి కదా ?"



ఇద్దరు పిల్లలూ మేడ మీద ఆడుకుంటూ ఉండగా 'దబ్' మని పెద్దగా చప్పుడు విన్పించి తల్లి కంగారుగా కేక వేసింది " చింటూ ! ఏంట్రా ఆ శబ్దం" అంటూ.
"మరేం లేదమ్మా ! తమ్ముడికి మేడమెట్లు ఉపయోగించకుండా క్రిందికి దిగడం వచ్చేసింది " అంటూ సమాధానమిచ్చాడు చింటూ.

**ఈ జోకులను పంపించిన వారు: యస్.వి. మహేష్‌బాబు, చిత్తూరు.**



రోగి : నా ఆపరేషన్ ఎప్పుడు సార్ ?
డాక్టర్ : మార్చురి ఖాళీకాగానే !



టీచర్ : నీళ్ళలో రాయి మునుగుతుంది. కప్ప తేలుతుంది. ఎందువల్ల?
విద్యార్థి : రాయికి ఈతరాదు కాబట్టి !



టీచర్ : మనకి ముందు మెరుపు కనపడుతుంది. తరువాత ఉరుము వినపడుతుంది. ఎందువల్ల?
విద్యార్థి : మనకి కళ్ళు ముందు, చెవులు వెనుక ఉన్నాయి కాబట్టి!

**ఈ జోకులను పంపించిన వారు: కె. రామారావు, హైద్రాబాద్.**



" అదేంటయ్యా మీ కొట్లో కొన్న ఈ చీర ఒక్కసారి వాష్ చేసేసరికే రంగు మారిపోయింది" వాపోతూ చెప్పింది వాణి.
"మీరు చీర కొన్నప్పుడే చెప్పాను కదమ్మా! అది ఇంద్రధనుస్సు చీరనీ, వాష్ చేసినప్పుడల్లా రంగులు మారతాయనీ!!" చెప్పాడు సేల్స్‌మేన్ తాపీగా.



"హిప్నాటిజమ్ అంటే ఏమిటోయ్?" అంటూ అడిగాడు గిరి.
"ఆ మాత్రం తెలీదా ! అవతలి మనిషిని లోబరుచు కుని వాడి చేత మనం చెప్పినట్టల్లా చేయించడం" అని చెప్పాడు చిన్నారాయణ
"అదేమిటి! దాన్ని పెళ్లి అంటారుగా !!" అన్నాడు గిరి ఆశ్చర్యపోతూ.

**ఈ జోకులను పంపించిన వారు: మడగల గోవిందరావు, అనకాపల్లి.**



"యువరానర్, నా క్లయింట్‌కి ఆరు నెలలు జైలు శిక్ష విధించడం అన్యాయం. డిఫెన్స్ వారి అభియోగం పాలల్లో నీళ్ళు కలిపాడనీ కానీ నా క్లయింట్ నీళ్లలో మాత్రమే పాలు కలిపాడు. కనుక ఏ నేరం చేయని నా క్లయింట్‌ని నిర్దోషిగా విడుదల చేయాలి' అంటూ బల్లగుద్ది వాదించి నీరసించిపోయి కుర్చీలో కూలబడ్డాడు లాయర్ అబద్ధాల రావు.
ఈ వాదన ఓపిగ్గా విన్న జడ్జి. "ఆరు నెలలు జైలు శిక్ష" మార్చి 'జైలు శిక్ష ఆరు నెలలు'అని తీర్పు చెప్పాడు.



"నీకు తెలుసా...... తనకు చెందవలసిన వాటిని తగ్గించుకుని పక్కవాళ్ళకి నిర్మొహమాటంగా ఇచ్చెయ్యగల ప్రాణి ప్రపంచంలో స్త్రీ ఒకతే"
"అదెలా" ?
"ప్రతి స్త్రీ తన వయస్సును కనీసం పది సంవత్సరాలు తగ్గించుకోవడమే కాకుండా పక్కింటామె వయసులో వెంటనే కలిపి చెప్తదూ?...

**ఈ జోకులను పంపించిన వారు: యం. జయలక్ష్మి అన్నపూర్ణ, విజయవాడ.**



క్లాసులో తెలుగు మాష్టారు ధైర్యవంతుడి గురించి పాఠం చెప్తున్నారు. "ధైర్యవంతుడికి ఎంత పెద్ద విషయమైనా చాలా చిన్నదిగా కన్పిస్తుంది. -సముద్రం పిల్లకాలవలాగ, మేరు పర్వతం గులకరాయి లాగ, పెద్దపాము చిన్నతాడు లాగ". అనిచెప్పి - " పిల్లలూ, ఈ పాఠం వల్ల మీకేం తెల్సింది?" అని ప్రశ్నించారు మాష్టారు.
ఒక కొంటె కుర్రవాడు లేచి చెప్పాడు.
" ధైర్యవంతుడు ఎక్కువ పవరున్న కళ్ళజోడు పెట్టుకోవాలి సార్.



"చూసిన ప్రేక్షకులే మళ్లీ మళ్లీ చూస్తున్నారని ఎడ్వర్‌టైజ్ చేస్తున్నారు .. అంత చెత్త సినిమా అన్నిసార్లు చూసిన ప్రేక్షకులెవరబ్బా!
"ఇంకెవరూ థియేటర్ ఆపరేటరూ, గేట్ కీపరున్నూ".

**ఈ జోకును పంపించిన వారు: టి. శశికళ, గుంతకల్లు.**



ఒకావిడ హడావుడిగా భర్త దగ్గరకి వచ్చి చెప్పింది. "ఏమండీ విన్నారా, పాపం మన పెళ్ళి చేయించిన పురోహితుడు రోడ్ యాక్సిడెంట్‌లో చనిపోయాడటండీ". ,....
"అవును మరి... చేసిన పాపం ఊరికే పోతుందా " అన్నాడు ఆ భర్త తాపీగా .

**ఈ జోకులను పంపించిన వారు: జి. విజయలక్ష్మి , విశాఖపట్నం.**

ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన యస్.వి. మహేష్‌బాబు -చిత్తూరు , టి. శశికళ-గుంతకల్లు, జి.విజయలక్ష్మి-విశాఖపట్నం, యం. జయలక్ష్మి అన్నపూర్ణ-విజయవాడ, కె. రామారావు-హైద్రాబాద్, మడగల గోవిందరావు-అనకాపల్లి, గొల్లపూడి శ్రీనివాస్-హైద్రాబాద్ గార్లకు సోహన్ మ్యూజిక్ వారు 'గౌరి'సినిమా పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.

SOHAN MUSIC



# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

## ఎం.చిత్తరంజన్

సమర్పిస్తున్న శీర్షిక ఇది.

ఫోన్ నెం. 040-27402993

**బృందగానం**

| | |
|---|---|
| రచన | : శ్రీమతి ఆదూరి సత్యవతీదేవి |
| సంగీతం | : కీ॥శే॥తిరుపతి రామానుజ సూరి |
| రాగం | : దేశ్ (హిందుస్తాని రాగం) |
| తాళం | : త్రిశ్రగతి (కర్ణాటక సం॥) దాద్రా (హిందుస్తాని సం॥) |
| ఆరోహణ | : స రి మ ప ని స |
| అవరోహణ | : స ని ద ప మ గ రి గ ని స |

షడ్జము, చతుశృతి రిషభం, శుద్ధమధ్యమం, పంచమం, కాకలి నిషాదం ఆరోహణలోనూ, కైశికి నిషాదం, చతుశృతి దైవతం, పంచమం, శుద్ధ మధ్యమం, అంతరగాంధారం, చతుశృతి రిషభం, అంతరగాంధారం, కాకలి నిషాదం, షడ్జము యీ క్రమం అవరోహణ లోనూ కలవి యీ రాగంలోని స్వరాలు.

ఈ రాగం హిందుస్తాని సంగీతంలో బాగా వాడుకలో వున్నదే . కర్ణాటక సంగీతంలో యీ మూర్ఛన గల రాగం లేదు. లలిత సంగీతంలో కూడా ఈ రాగం ప్రచారంలో వున్నది. ఆకాశవాణి, చలన చిత్రాలలో చాలా మంది స్వరకర్తలు యీ రాగంలో అందమైన బాణీలు కూర్చారు. దేశ్ రాగం గురించి వివులంగా 'హాసం' నవంబర్1-15 సంచికలో ప్రస్తావించాను.

విశిష్ట సంస్కృతీ సంప్రదాయాలతోను, భిన్నత్వంలో ఏకత్వాన్ని ఆశయంగా, ఆదర్శంగా గల పౌరులతోను అలరారుతున్న యీ పవిత్ర భారత భూమిని అనాదిగా ఎంతో మంది కవులు, కవయిత్రులు విభిన్నరీతులలో కొనియాడి వెలయించిన లలిత గీతాలు ఎన్నోవున్నాయి. భారతమాత స్తుతిగీతాలుగాను, జాతి సమైక్యతను, మతసామరస్యాన్ని, సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని ప్రభోధించే గీతాలుగాను, స్వాతంత్ర్య సమరగీతాలు- యిలా వైవిధ్య భరితమైన యితివృత్తాలతో వందలాది గీతాలు రూపొందాయి. 'పాపిట మెరయు హిమవన్న గాల'తో 'ముంజేతి కంకణ మంగళ ధ్వనులతో కదలాడు కారుణ్యమూర్తి 'గా చిరయశస్సుగల దివ్య ధాత్రిగా భారతమాతను కీర్తించి అందమైన గీతాన్ని అందించారు కవయిత్రి ఆదూరి సత్యవతి దేవిగారు. "అదిగదిగో మా తల్లి అందాల వల్లి" అంటూ సాగే యీ గీతానికి దేశ్ రాగం ఆధారంగా సుమధురమైన బాణీని కూర్చి కీ॥శే॥ రామానుజసూరిగారు ఆకాశవాణి విశాఖపట్టణం కేంద్రంలో గాయనీ గాయకులచే బృందగీతంగా పాడించారు.

### అదిగదిగో మా తల్లి

ప॥ అదిగదిగో మా తల్లి అందాల వల్లి
అతి పురాతన సహన తేజోవల్లి

చ॥ మందార మల్లికా చందన తరులతలతో
అలరారు సౌందర్య దీప్తి
ముంజేతి కంకణ మంగళ ధ్వనులతో
కదలాడు కారుణ్య మూర్తి ॥అదిగదిగో॥

చ॥ పాపిటా మెరయు హిమవన్నగాలు
పాదాల జీరాడు గంగాతరంగాలు
కనులెత్తి కురిపించు దివ్యమౌవరాలు
పలుకరించిన చాలు సంగీత స్వరాలు ॥అదిగదిగో॥

చ॥ వెన్నలవలె పొన్నవలె మెత్తని మనసు
వెన్నెలవలె మిన్నులవలె చిరయశస్సు
విమల కేదారముల వెలుగొందురూపు
విజయగాధలతోటి మెరిసేటి చూపు ॥అదిగదిగో॥







### శ్రీమతి ఆదూరి సత్యవతీదేవి

ప్రముఖ కవయిత్రిగా పేరుగాంచిన శ్రీమతి ఆదూరి సత్యవతీదేవి తన పదమూడవ ఏటనే

గీత రచనకు శ్రీకారం చుట్టారు. పుట్టింది గుంటూరులోనైనా కథారచయిత శ్రీ ఆదూరి వేంకట సీతారామమూర్తితో వివాహం జరిగిన తరువాత విశాఖపట్టణంలో స్థిరపడ్డారు. ఆకాశవాణిలో వీరి తొలి రచన 1978లో ఉగాది నాడు ప్రసారమైనది. అప్పటినుండి యింత వరకూ సుమారు 50 గీతాలు ఆకాశవాణి, దూరదర్శన్‌లలో ప్రసారమయినాయి. కొన్ని లలిత, భక్తిగీతాలు వివిధ సంస్థలు కూర్చిన క్యాసెట్లలో చేర్చబడ్డాయి. "వెన్నెల్లో వేణుగానం" శీర్షికన వీరి అష్టోత్తర శతగీతమాలిక 1985లో వెలువడింది. కీ॥శే॥ మధురాంతకం రాజారాం వంటి విజ్ఞుల మెప్పు పొందింది. ప్రముఖ సాహితీపరులు, విమర్శకులు ఆచార్య చేకూరి రామారావుగారు వీరి గ్రంథాన్ని ప్రశంసించి తమ 'వ్యాసావళి' లో కూడా చేర్చడం జరిగింది.

ఆకాశవాణి విశాఖకేంద్రం ప్రసారం చేసిన సత్యవతి గీతాలలో తిరుపతి రామానుజసూరి స్వరపరిచిన "జయము జయము భారతీ", "కోయిల గొంతేనా పాట", "ఒక్కపాటకు మేఘమైతిని" మొ॥ లగునవి, ప్రముఖ విద్వాన్ కున్నక్కుడి వైద్యనాథన్ స్వరపరచిన "కమ్మనైన స్వరాలు", వింజమూరి లక్ష్మి సంగీతంలో "ఒక వేణువు " మొదలగునవి ఎంతో ప్రాచుర్యాన్ని పొందాయి. వీరే కాక యింకా బండారు చిట్టిబాబు, మల్లాది సూరిబాబు, బి.ఎ.నారాయణ మున్నగు వారు కూడా సత్యవతిగారి గేయాలకు సంగీతం కూర్చారు.

గేయాలేకాక, 'రెక్కముడవని రాగం' , 'జలపాతం గీతం', వంటి వచన కవితా సంపుటాలు కూడా రసజ్ఞులకు అందించారు. 'ప్రకృతి పిలుపులు', 'మావితోపు' వంటి సంగీత రూపకాలు యీమెవి ప్రసారమైనాయి.

'కృష్ణశాస్త్రి ఆత్మరాగం' దేవులపల్లి వారిమీద, 'లలిత భావరాగం- బాలసరస్వతి గానం' అని రావుబాలసరస్వతీదేవి మీద వ్యాసాలు వ్రాశారు. వీరి కవితలు పాతిక వరకూ ఆంగ్లంలోకి ,హిందీలోకి అనువదింపబడ్డాయి. 1994లో సత్యవతిదేవికి తెలుగు విశ్వవిద్యాలయం నుండి కీ॥శే॥ నాళం కృష్ణారావు స్మారక 'ఉత్తమ రచయిత్రి', అవార్డు 1998 లో ఆంధ్రల లలిత కళా సమితి నుండి 'కృష్ణశాస్త్రి' అవార్డు,2000సం॥లో 'యునెస్కో' అవార్డు,2002లో 'జెమిని అకాడమి' అవార్డు లభించాయి.

1996 ప్రాంతంలో నాకు వీరితో పరిచయం కలిగింది. శ్రీమతి సత్యవతిదేవి సాగిస్తున్న నిర్విరామ సాహితీ సేవకు నా హార్దికాభి నందనలు.

## కీ॥శే॥తిరుపతి రామానుజసూరి

1936లో సంగీత కుటుంబంలో జన్మించిన రామానుజసూరిగారు వారి పితామహులైన శ్రీతిరుపతిరామదాసు,అన్నగారు పొన్నారావుగార్ల వద్ద కర్ణాటక సంగీతం అభ్యసించారు.



పొన్నారావుగారు సుప్రసిద్ధ వయొలిన్ విద్వాంసులు. తిరుపతిలోని అన్నమాచార్య ప్రాజెక్టులో విద్వాంసులుగా పనిచేశారు 1990వ దశకంలో. సూరిగారు కూడా గాత్రం, వయొలిన్ రెంటింటిలోను గొప్ప విద్వాంసులుగా ప్రసిద్ధి చెందారు. 1964-65 సం॥లో విజయవాడ సంగీత కళాశాలలో రెండేళ్ళ డిప్లొమా కోర్సు శ్రీ నేదునూరి కృష్ణమూర్తి గారి గురుత్వంలో పూర్తిచేశారు. ఆ తరువాత 1976 లో ఆకాశవాణి విశాఖపట్టణంలో మ్యూజిక్ కంపోజర్‌గా ఉద్యోగంలో చేరి 19సం॥లపాటు గణనీయమైన సేవలందించారు. 1976 నుండి వారితో నాకు బాగా సాన్నిహిత్యం లభించింది. ఎంతో మంది కవుల గేయాలకు చక్కని సంగీతాన్ని అందించారు. ఆకాశవాణిలోను, దూరదర్శన్ లోను ప్రాచుర్యం పొందిన గీతాలు మచ్చుకు కొన్ని:

'మాధురీ రసానందఝురి' (స్వీయరచన), ఈ పాదకమలమే' ( యం. రామకోటి) 'అలికిడైతే చాలు' (దేవులపల్లి), 'కోయిల గొంతే నా పాట' (ఆదూరి సత్యవతీదేవి) 'కనులలోని కాంతినీవె' (కిల్లాన మోహనబాబు), ' 'ఏడే అల్లరి వనమాలి' (మధురాంతకం రాజారాం).

వీరి స్వరకల్పనలో వెలువడ్డ సంగీత రూపకాలు 'శ్రీ త్యాగరాజస్వామి', 'నాట్యావతరణం', 'పౌష్యలక్ష్మి' , 'ధాన్యలక్ష్మి', 'తిరుప్పావై', 'కథాసరిత్సాగరం' మొదలైనవి.

1992 లో ఆకాశవాణి జాతీయ అవార్డు 'ఏకోహం - బహుళ్యాం', 1995 లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ అవార్డు 'కళానీరాజన పురస్కారం', 1997 లో శ్రీవాసవీ కన్యకాపరమేశ్వరి సంస్థనుండి 'వాయులీన చూడామణి' బిరుదు వీరు పొందారు.శ్రీసూరిగారు ఎన్నో సంస్థల నుండి ఘనసన్మానాలు పొందారు.

వీరి సంగీతదర్శకత్వంలో యల్.పి. లు, క్యాసెట్లు వెలువడినాయి.

1. **సుందరకాండ** (రచన: గ్రంధి అప్పల నరసింహం, కందాళ చిదంబరస్వామి) గానం: యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, బృందం(1985)
2. **శబరిగిరి పదయాత్ర** (రచన : శివగణేష్ బాబు) గానం: యస్.పి. బాలసుబ్రహ్మణ్యం, జి. ఆనంద్(1985)
3. **వేంకటేశ్వర సుప్రభాతం** (రచన : శివగణేష్‌బాబు) గానం: వాణిజయరామ్, ద్వారం లక్ష్మి, జి. ఆనంద్
4. **విఘ్నేశ్వర భక్తిగానం** (రచన: శారదా అశోకవర్ధన్, శివగణేష్‌బాబు) గానం: జి.ఆనంద్, బి. వరహాలు.

సంగీతమే ఉచ్ఛ్వాసనిశ్వాసాలుగా జీవితకాలమంతా సప్తస్వరాల సేవలో గడిపిన ధన్యజీవి శ్రీరామానుజసూరి గారు కేన్సరు వ్యాధికి గురై జూలై 17, 1998 న దివంగతులైనారు. ■

### దేశ్ రాగం రాగం ఆధారంగా కొన్ని చిత్రగీతాలు

| పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|
| **తెలుగు** | | | |
| 1. అలిగినవేళనే చూడాలి | గుండమ్మకథ | పి. సుశీల | ఘంటసాల |
| 2. మురళీధరా హరే మోహన కృష్ణా | భలేరాముడు | పి. సుశీల | యస్. రాజేశ్వరరావు |
| 3. వేణుగానలోలుని గన వేయికనులు చాలవులే | రెండుకుటుంబాల కథ | పి. సుశీల | ఘంటసాల |
| 4. సృష్టిలో తీయనిది స్నేహమేనోయి | ప్రయివేటు రికార్డు | రావుబాలసరస్వతీదేవి | పెండ్యాల |
| 5. ఊపరే ఊపరే ఉయ్యాల | ప్రయివేటు రికార్డు | యస్. వరలక్ష్మి | డా॥బాలమురళీ కృష్ణ |
| 6. నాలోని మధురప్రేమ | పెళ్ళికానిపిల్లలు | ఘంటసాల,సుశీల | మాస్టర్‌వేణు |
| 7. అజీ రూఠ్ కర్ అబ్ కహా జాయియేగా | ఆర్ జూ | లతా / రఫీ | శంకర్ - జైకిషన్ |



జంతువులు మనగురించి మాట్లాడేది తెలిసిపోతే
ఎంత తమాషాగా ఉంటుందో వివరించే...



బాల్యపు
లేతదనం
మళ్ళీ కోరుకునే
పెద్దలకు
మరీ మరీ
ప్రత్యేకం

పిల్లల కోసం ప్రత్యేకం...

# డాక్టర్ డూలిటిల్



నవలీకరణ
ఎమ్బియస్ ప్రసాద్

2వ భాగం

చిత్ర పరిచయం 3

సమన్వయం
మంజీర

## జరిగినకథ

జంతు వైద్యుడిగా కూడా దేశదేశాలా ఖ్యాతి గడించిన డా॥ జాన్ డూలిటిల్ పారిస్ ట్రిప్‌నుండి అతని పెద్ద కూతురు 16వ పుట్టినరోజున తిరిగి వచ్చాడు. ఆమె ఆ రోజు బాయ్‌ఫ్రెండ్‌తో డేటింగుకి వెళుతుందని భార్యద్వారా విని మండిపడిన జాన్ కూతుర్ని తిట్టి కావాలంటే నీ బాయ్‌ఫ్రెండును కూడా మనతోబాటు డిన్నర్ చేయమని ఆహ్వానించు అంటాడు. ఆమె సెల్‌ఫోన్ లాక్కుని నంబర్‌లు వెరిఫై చేస్తూంటే 'బిగ్గీ మాక్' అనే వాడి తరుచుగా చేస్తున్నట్టు తెలుస్తుంది. ఆ నంబరుకు ఫోన్ చేస్తే ఆ అబ్బాయి తండ్రి ఫోనెత్తుతాడు. జాన్ అతనితో పోట్లాటకు దిగుతాడు.

- ఇక చదవండి

లీసా భర్తనుండి ఫోను లాక్కోబోయేటంతలోనే అవతలి వ్యక్తి జాన్ గొంతు గుర్తుపట్టేశాడు. "ఈజిట్ డా॥ జాన్ డూలిటిల్?" అని అడిగేశాడు.

తామెవరో తెలిసిపోతే కుటుంబం పరువు, కూతురు పరువు బజారు కెక్కడం ఖాయమని తెలిసిన లీసా కంగారుగా 'సారీ దిసీజ్ రాంగ్‌నెంబర్' అంటూ పెట్టేసింది.

జాన్ విసుక్కున్నాడు - 'నన్ను మాట్లాడ నివ్వవేమిటి? అవతల మాట్లాడుతున్నది కుర్రకారు కాదు, ఓ పెద్దమనిషి!'



'ఇవతలకూడా అలాటివాళ్లే ఉండాలిగా' అంది లీసా వెక్కిరింతగా!

ఏం సమాధానం చెప్పాలో తెలియక జాన్ బుర్ర గోక్కుంటూ ఉండగా డోర్ బెల్ మోగింది.

"ఎవరో బెల్ మోగిస్తున్నారు" అంది లీసా.

"వినబడుతోంది" అన్నాడు జాన్ చికాగ్గా.

"వెళ్లి చూడమని నా భావం.." అని అతని భుజం తట్టింది లీసా.

ఈ లోపుగానే తలుపుకు అవతలున్న కుర్రాడు బాదేస్తున్నాడు, మ్యాజిక్ హోల్‌లోంచి చూసేస్తున్నాడు, తెగ హడావుడి పడిపోతూ ''హేయ్, డాక్టర్ డూ, సంగతేంటి, నేను..నేనే..'' అని అరిచాడు.



"నేనంటే..? ఎవడా నేను..? సరిగ్గా చెప్పండి." అన్నాడు జాన్ హోల్‌కు ఇటువైపు నుంచి చూస్తూ! పాపం అతనికి ఆ కన్నంలోంచి ఫాంటమ్ లాంటి ఓ మొహం మాత్రం కనబడుతోంది.

కన్నానికి మరీ దగ్గరగా ఉంటే కన్నం అద్దంలోంచి అవతలి వాళ్ళకి సరిగా కనబడదని గుర్తు తెచ్చుకుని, కాస్త వెనక్కి వెళ్లి "ముందు నన్ను లోపలికి రానియ్యండి, అపుడు మీకే తెలుస్తుంది" అన్నాడా కుర్రాడు. ఎట్టకేలకు జాన్ తలుపు తీయగానే "హేయ్, డాక్టర్ డూ, ఏటి సంగతి? ఎందుకింతాలీసెం?" అని పలకరించాడు.

వాడెవడో జాన్‌కి చటుక్కున గుర్తు రాలేదు. గుమ్మంలోనే నిలబెట్టి "సారీ, మీరు..?"

"హేయ్, నన్ను గుర్తుపట్టలేదూ, ఎరిక్! డొమినికో పిజ్జా..మీరు ఎక్స్ట్రా చీజ్ కావాలంటూంటారూ... "

జాన్‌కు గుర్తొచ్చింది - "నువ్వా, నువ్వు.. పిజ్జా డెలివరీ బాయ్‌వి కదూ.."

కుర్రాడు సగర్వంగా చెప్పాడు - "యా.., మీకు పిజ్జాలు సరఫరాలు చేసేది నేనే!'



"సారీ, టిప్ మర్చిపోయాను కదూ'' అంటూ జేబులు తడుముకోబోయాడు.

కుర్రాడు ఇమ్మీడియేట్‌గా క్షమించేశాడు - "పోనీ, పోనీ.. టిప్‌కంటె మంచిదే ఇచ్చారు మీరు."

''అబ్బెబ్బే, నీ నంగతి

మర్చిపోలేదు నేను..” అంటూ జాన్ జేబులో చిల్లరడబ్బులు తీస్తుండగానే షెరెజ్ లోపట్నుంచి గుమ్మం దగ్గరకి వచ్చింది. “హాయ్ ఎరిక్” అంటూ!

షెరెజ్‌ను చూడగానే పిజ్జా కుర్రాడి ముఖం పిజ్జా అంతైంది. “సంగతేంటి, బేబీ, రెడీయేనా? బయల్దేరదామా?” అని పలకరించాడు.

జాన్‌కు బుర్ర తిరిగిపోయింది. ఎడాపెడా తలతిప్పి ఇద్దర్నీ చూసి మాటలు తడుముకుంటూ, “వీడా నువ్వు డేటింగ్ చేయబోయే బాయ్‌ఫ్రెండ్?” అని అడిగాడు.

షెరెజ్ వెటకారంగా ఒకరికొకర్ని పరిచయం చేసింది - ‘డేడీ, ఇతను ఎరిక్’, ‘ఎరిక్, మా డాడీ’

జాన్ వారించేలోపునే ఎరిక్ వచ్చి జాన్‌ను కౌగలించుకున్నాడు - ‘హాయ్, మామా’ అంటూ.

షెరెజ్ మొహం అదోలా పెట్టి, “ఎరిక్, మనం బయటకు వెళ్లకూడదట. వీళ్లందరితో కలిసి ఇక్కడే డిన్నర్ చేయాలంట” అంది.

ఇదెక్కడి డేటింగా అన్నట్టు ఎరిక్ తెల్లమొహం వేసి అంతలోనే సర్దుకుని “ఇట్సాల్‌రైట్ బేబీ” అంటూండగా షెరెజ్ కోపంగా అక్కణ్నుంచి



వెళ్లిపోయింది.

జాన్ షెరెజ్‌ను మందలించాడు - “ఇదిగో నువ్వలా బిహేవ్ చేయకు. ఇక ఎవరికీ డిన్నర్ రుచించదంతే! రా, సరదాగా అందరితో కలిసి భోంచేయి.” అన్నాడు. కానీ షెరెజ్ వింటేగా! చరచరా లోపలికి వెళ్లిపోయింది.

ఎరిక్ కలగజేసుకున్నాడు - “నువ్వూరుకో మామా! నేనున్నానుగా! నే చూసుకుంటా!” అంటూ చొరవగా ఇంట్లోకి దూసుకుపోయాడు. ఆ కుర్రాడి సంబోధనకు విస్తుపోతూ జాన్ తలుపు మూసి ఇంట్లోకి నడిచాడు.

ఎరిక్ ఏం మాయ చేసాడో జాన్‌కు ఎరికలేదు కానీ డిన్నర్‌టేబుల్ వద్దకు షెరెజ్ ‘దయ’చేసింది.



కూతురి ప్రవర్తన గురించి సంజాయిషీగానో ఏమో జాన్ తెగవాగడం మొదలెట్టాడు - “నీకు తెలుసా, ఎరిక్? షెరెజ్ చిన్నప్పటినుండీ ఇంతే! స్వంత నిర్ణయాలు తీసుకోవడం అలవాటు. ఏడాదిన్నర పసిగుడ్డుగా ఉన్నప్పుడే ఓ నిర్ణయం తీసుకుంది - ఇకపై చెడ్డీలు వేసుకోకూడదని...’ అంటూ కూతురికేసి తిరిగి ‘షెరెజ్, గుర్తుందా?’ అని అడిగాడు.

మొగుడి వాక్ప్రవాహానికి, వాగుడు ప్రవాహానికి అడ్డుకట్టవేసే ప్రయత్నంగా చేయబోయింది లీసా. “జాన్, ఇప్పుడవన్నీ..”

కానీ జాన్ వింటేనా..? “...నిజానికి ఇంట్లో అప్పుడు..”

ఈ సారి షెరెజ్ ఓ ప్రయత్నం చేసిచూడబోయింది. “నాన్నా, నువ్వెక్కడికో వెళ్లాలన్నావు..”

జాన్ కొట్టిపారేశాడు - “చూడు, ఫ్యామిలీకంటె అవన్నీ ముఖ్యం కాదు. ఇక్కడ పరాయివాళ్లెవరున్నారు? కుటుంబ విషయాలు ఇక్కడ తప్ప వేరెక్కడ మాట్లాడతాం, చెప్పు...”

ఎరిక్ ఏదో కనిపెట్టినట్టు చిటికేసి “నాకో సంగతి తెలిసివచ్చింది.” అన్నాడు.

“నిజంగానా!? నీక్కూడా కొన్ని విషయాలు తెలుస్తాయా? డిన్నర్ టేబుల్ దగ్గర టోపీ తీసేసి కూచోవాలనీ.. ఇలాటి విషయాలు కూడా నీకు తెలుస్తాయా?” ఆశ్చర్యం నటిస్తూ అడిగాడు జాన్.



వ్యంగ్యం అర్థం చేసుకున్న ఎరిక్ వెంటనే టోపీ తీసి బల్లమీద పెట్టాడు. ఏం లాభం? దానికింద మరో తలగుడ్డలాటిది ఉంది.

“నీకోటి చెప్పనా? నువ్వా టోపీ వేసుకుని కూచుంటే నీ సంగతేమో గానీ నాకు మాత్రం మహా ఉక్కపోస్తోంది.” అని జాన్ అంటూంటే సంభాషణ దారి మళ్లించడానికి లీసా కూతురికేసి చూస్తూ, “షెరెజ్, ఇవాల్టినుండి ఇంకో ఏడాదిన్నరలో నువ్వు కాలేజీకి వెళ్లిపోతావు. ఈ ఇంట్లోంచి బయటకు వెళ్లి హాస్టల్లో ఉండాల్సి వస్తుంది.” అంది.

ఇంట్లోంచి ఎంత త్వరగా బయటపడదామా అని రోజులు లెక్కపెడుతున్న షెరెజ్ తల్లి పొరబాటును వెంటనే సవరించింది. “ఏడాదిన్నర కాదు, సరిగ్గా ఏడాది పది నెలలమీద 16 రోజులు!”

ఆమె స్వేచ్ఛాకాంక్షను గ్రహించని జాన్ “షెరెజ్ నీకో ఐడియా చెప్పనా? బెర్కలీ కాలేజీలో చేరావనుకో. ఇంటికి దగ్గరగా ఉంటుంది. వెళ్లివస్తూండవచ్చు. హాస్టల్‌లో ఉండాల్సిన ఖర్మపట్టదు. ఎంచక్కా ఇంటిపట్టున ఉంటూ ఇంటిభోజనం చేస్తూ చదువుకోవచ్చు. ఎలా వుంది?” అన్నాడు కళ్లెగరేస్తూ.



తండ్రి సూచనను స్టడీ చేసినట్టు కాస్సేపు అభినయించి, “ఐడియా బాగుందనుకో, కానీ నేను వేరే కాలేజీలో సీటు అప్లయి చేద్దామని అనుకుని టిక్కెట్టు బుక్ చేసేశానే!” అంది షెరెజ్ ఇప్పుడీ డిస్కషన్ గతజలసేతుబంధనమే అని దు:ఖం నటిస్తూ...

“హేమిటీ! ఏడాదీ పదినెలల తర్వాతి ప్రయాణానికి ఇప్పుడే.. ఇప్పుడే బుక్ చేసేశావా?” అని జాన్ ఆశ్చర్యపడుతూండగానే మాయా అతన్ని తట్టింది - “నాన్నా, నీ కోసం ఎవరో వచ్చారు” అని.

- (సశేషం)

ఆ మధ్య చీరాలలో నాటక పోటీలంటే వెళ్లాను....

రామనవమి ఉత్సవాల సందర్భం !!

గత ఇరవై అయిదు సంవత్సరాలుగా నిరాటంకంగా కొనసాగుతున్నాయ్ ఉత్సవాలు. నిర్వాహకుడు... ముస్లిం !!

ఆ సభలోనే అన్నాను - రామదాసు ఎన్ని కీర్తనలు పాడినా భద్రాచలరాముడు ముందు దర్శనం ఇచ్చింది 'తానిషా'కే ననీ. అలాగే రామదాసు పేరెత్తగానే..మనకి

"సీతమ్మకు చేయిస్తీ చింతాకూ పతకాము రామచంద్రా
ఆ పతకమునకు బట్టే పదివేల వరహాలు రామచంద్రా... "

ఆర్తి..నాదమూ.. ఆ తరువాత కొరడా దెబ్బల చప్పుడూ...

వెంటనే..



# రామదాసుగారూ రండీ... రసీదందుకోండీ !!

"నీవు కులుకుచూ తిరగేవు ఎవడబ్బా సొమ్మనీ" అనే నింద.. ఆ తరువాత వేదనానంతర పశ్చాత్తాపం.. ఆ నిశ్శబ్దంలోంచి..

" అబ్బా తిట్టితిననుచూ ఆయాసపడబోకు రామచంద్రా...ఈ దెబ్బాల కోర్వక అబ్బా తిట్టితినయ్యా రామచంద్రా.." అంటూ... నన్నర్థం చేసుకుని క్షమించలేవూ అన్న అభ్యర్థన.. వినపడ్తాయ్...

పదిహేడో శతాబ్దంలో గోలకొండ నవాబైన అబుల్ హసన్ తానీషా... కొలువులో హోం మంత్రిగా ఉన్న అక్కన్న - మాదన్నల్లో... మాదన్నగారి మేనల్లుడు కంచెర్ల గోపన్న.. ఎలాగో సిఫారసుతో తనూ నవాబు కొలువులో చేరాడు.. అంత వరకూ బావుంది !..

వెళ్ళి పన్ను వసూలు చేసుకు రావయ్యా మొగడా అంటే భద్రాచలం వెళ్ళీ

వామాంక స్థిత జానకీవిలసత్కోదండరాముణ్ణి చూసీ... కళ్ళనిండా నీళ్ళు పెట్టుకునీ !..అఖిలాండకోటి బ్రహ్మండ నాయకుడివే !.. నీకు నిలువనీడ లేదా!.

పరంజ్యోతివి... నీకు దీపం పెట్టే దిక్కు లేదా !..

వనవాసమంతా నారచీరలే కట్టావ్ గద నా తల్లీ.. నీకు పట్టుబట్టల్లేవు... మణిమాణిక్యాల వాళ్ళో పుట్టిన అవనీతనయవు నీకు ఏడువారాల నగలు లేవాఁ...

అన్ని బెంగపెట్టేసుకునీ.... నౌఖరీ మాట గోదారి గట్టున పెట్టీ భద్రాచలంలో పెద్ద గుడి కట్టీ......వజ్రవైడూర్యాల తోటీ.. మణిమణిక్యాల తోటీ... అద్భుతమైన నగ నట్రా చేయించి అమ్మని అయ్యచేతిలో పెట్టీ.. అందరికీ వడపప్పు ....పానకమూ ఇచ్చీ .. అమ్మయ్య నా పనై పోయిందని చేతులు దులుపుకున్నాడు.... కంచెర్ల గోపన్న...

దులుపుకున్న చేతులకు అరదండాలేసీ ఈడ్చుకెళ్ళారు రాజభటులు నవాబు దగ్గరికీ !..

హమారా క్యా హుకుం థా ..తుమ్ క్యాకరే......
(మేం ఏం ఆజ్ఞాపించాం.... నువ్వు చేసిందేవిటి)
రామ్‌కా ఆరామ్ కేలియే.. దేవల్ బనాయా హూఁ...
(రాముడి విశ్రాంతి కోసం... ఓ మందిరం కట్టాను..)
'కిస్‌కే బాప్‌కా మాల్‌హై'
(ఎవడబ్బ సొమ్ము అనుకునీ..) గర్జించాడు తానీషా ...

బిక్క చచ్చిపోయిన కంచెర్ల గోపన్న

'నను బ్రోవమనీ చెప్పవే... సీతమ్మ తల్లీ నన్ను బ్రోవమనీ చెప్పవేఁ... నన్ను బ్రోవమనీ చెప్పు నారీ శిరోమణి !... జనకునీ కూతురా జననీ జానకీ దేవీ !..'

అన్నాడు ...ఆవిడ విందో లేదో గానీ ! నవాబుగారు మాత్రం విన్లేదు. హుక్కా నొక్కలాగు లాగీ ... చప్పట్లు చరిచాడు...

'జీ హుజూర్' అన్నారు రాజభటులు.

'లేజావ్ ఁ..' అన్నాడు.. అంతే సంకెళ్ళేసి ఈడ్చుకెళ్ళి గోల్కొండలోనే.. ఓ చీకటి కొట్లో బంధించారు!

"రామచంద్రులూ... నా పై
చలమూ జేసీనారూ.. సీతమ్మ చెప్పుమమ్మా ..."
అని మొరబెట్టుకున్నాడు..!'

చెడ తిట్టారు, చచ్చేలా కొట్టారు.. నానా హింసా పెట్టారు..

వాళ్ళంతా నెత్తురుతో రామకోటి రాసేసారు..

అయినా సరే ! ఒకే నమ్మకం... నా రాముడొస్తాడూ... నన్ను విడిపిస్తాడు..

కానీ వాడు ఉలకడు.. పలకడూ

"పలుకే బంగారమాయెనా.. ఓ రామచంద్రా
పలుకే బంగారమాయెనా
పలుకే బంగారంమాయే - పిలచిన పలుకవేమి
కలలో నీ నామస్మరణ మరువ చక్కనీ తండ్రీ..."

కమ్మని కలలు కంటున్న సీతమ్మ కలలోకి

దెబ్బలు తిన్న రామదాసొచ్చాడు..!

ఉలికిపడి లేచింది అమ్మవారు!..

'పీడకలా...' అన్నారు రాములవారు...

"మరే !... రామదాసుకి నవాబు 'పీడ' వదిలించరూ.." వేడుకుంది.... సీతమ్మ..

లక్ష్మణ సమేతుడైన రాముడు... భద్రాద్రినించి గోళాద్రికి(గోలుకొండ) కి బైలు దేరారు.

ఇక్కడ రామదాసు మనస్సు నృత్యం చేస్తోంది !....
"ఓ రామ నీ నామ మెంతో రుచిరా....
పాలు మీగడల కన్న పంచదార చిలకలకన్నా.."
అని రామనామృతాన్ని స్మరిస్తున్నాడు...
అగరు పొగల మధ్య.. మగతగా నిద్దరోతున్న
మొఘల్ తానీషాకీ మెలుకువ...

కళ్లునలుపుకుని చూస్తే... కోదండపాణులైన ఇద్దరు రాచయువకులు- సూర్యులై మెరుస్తున్నారు.

"కౌన్ హై ఆప్ లోగ్ .."అనీ..
"ఏ దేశము.. నుండూ వారూ మీరూ...
ఎందుండి ఇటు వచ్చినారు...."అన్నాడు
అన్నదమ్ములిద్దరూ ఒకరి మొహాలు
ఒకరు చూసుకునీ...
"దాస జవానులము మేము...
రామదాసు పంపగ వచ్చినాము.."
అంటూ .. వరహాల మూటల్ని తానీషా కందించారు..
ఏమో అనుకున్నా.. రామదాసు నిక్కచ్చయిన మనిషే...

"ఠీక్ హై"... అని ఒక రాజముద్ర కొట్టీ... రామదాసునీ విడుదల చెయ్యమని ఫర్మానా పంపాడు !...

దెబ్బతో కంచెర్ల గోపన్నల్లా... రామదాసై పోయాడు!!!

ఎన్ని ఎన్ని ఎన్ని వందల కీర్తనలు.. అన్నిటికన్నా ముఖ్యంగా

'దాశరథీశతకం'
శ్రీ రఘురామ చారు తులసీ
దళదామ శమక్షమాది
శృంగార గుణాభిరామ
త్రిజగన్నుత శౌర్య
రమాలలామ
దుర్వార కబంధ
రాక్షస విరామ జగన్నుత
కల్మషార్ణవో
తారకనామ భద్రగిరి దాశరథీ
! కరుణాపయోనిధీ !!

రామదాసు సాక్షాత్తు త్యాగరాజస్వామికే గురుతుల్యుడు..

ఆయన స్ఫూర్తికి శతకోటి వందనాలు చేసుకుంటూ..
రామచంద్రాయ
జనక రాజజా మనోహరాయ
మామకాభీష్టదాయ
మహిత మంగళం



- తనికెళ్ల భరణి

పాఠకులకి.....నమస్కారం..

ఎందరెందరో మహానుభావుల గురించి 'హాసం'లో రకరకాల వ్యాసాలు రాసే అవకాశం కలిగింది. వీటన్నిటినీ కలిపి 'ఎందరో మహానుభావులు' అనే మకుటంతో ఓ పుస్తకంగా వేస్తే... అనే ఆలోచన ఈ మధ్యనే వచ్చింది. లెక్క చూసుకుంటే 48... మరొక రెండు వ్యాసాలు ఎలాగోలా వీలుచిక్కించుకుని రాయగలిగితే 50 అవుతాయి. చెప్పుకుందికి బావుంటుంది. అందుకే మళ్లీ మొదలుపెట్టాను.

సరే...ఈ ఆలోచనతో పాటే మరో ఆలోచన...

'హాసం'లో నా వ్యాసాలు వచ్చిన తర్వాత ఎందరెందరో ఉత్తరాలు రాసేవారు. ఫోన్లు చేసేవారు, వ్యక్తిగతంగా కలిసేవారు. "మేం మీరు రాసిన ఫలానా వారి బంధువులమండీ... మా దగ్గర వారికి సంబంధించినవీ ఎన్నో ఉన్నాయండీ" అంటూ చెప్పేవారు. ప్రాణం ఉసూరుమనేది. అవి కూడా ఉంటే ఇంకా బాగా రాసేవాణ్ణి కదా అనిపించేది.

అందుకే 'హాసం'లో ఇప్పటివరకూ నేను రాసిన మహానుభావుల పేర్లు ఈ దిగువున ఇస్తున్నాను. వీరికి సంబంధించిన వివరాలు, ఫోటోలు, వారు వాడిన వస్తువుల యొక్క ఫోటోలు ఏవి దొరికితే అవి పంపించండి. పుస్తకంలో కలుపుకుంటాను. పంపిన వారిని జీవితాంతం మరిచిపోలేను. పుస్తకంలో పేరుపేరునా కృతజ్ఞతలు తెలుపుకుంటాను. అలాగే నేను రాయబోయే మిగిలిన ఇద్దరు మహానుభావుల పేర్లు కూడా ఆయా వ్యాసాలు ప్రింట్ అయ్యాక చూసి పంపించండి.

నేను ఇప్పటి వరకూ రాసిన మహానుభావుల పేర్లివి.

తుమరాడ సంగమేశ్వర శాస్త్రి, పట్రాయని సీతారామశాస్త్రి, కోలంక వెంకటరాజు, గుమ్మలూరి వెంకట శాస్త్రి, దూర్వాసుల సోమయాజులు, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి, ఆదిభట్ల నారాయణదాసు, విశ్వపతి శాస్త్రి, హనుమద్దాసు, సారంగపాణి, వీణవెంకట రమణదాసు, గరికపర్తి కోటయ్యదేవర, బొబ్బిలి కేశవయ్య, మద్దిరాల వెంకట రాయకవి, దుడ్డు సీతారామయ్య, మనుసారి వెంకట లక్ష్మమ్మ, వాసా అప్పయ్య, పిరాట్ల శంకరశాస్త్రి, దాసు శ్రీరాములు, విద్యల నారాయణ స్వామి నాయుడు, కాళహస్తి వీరయ్య, పాటల రామన్న, వెంకట సామయ్య, పప్పు వెంకన్న, ద్వారం వెంకట స్వామి నాయుడు, మహేంద్రవాడ బాపన్న శాస్త్రి, పారుపల్లి రామక్రిష్ణయ్య పంతులు, కామసముద్రం అప్పలాచార్యులు, శ్రీశ్రీశ్రీ ఆనందగజపతి మహారాజా, త్యాగరాజు, పొడుగు రామమూర్తి, షేక్ చినమౌలా, యానం రామకృష్ణ, కొచ్చెర్లకోట రామరాజు, తూము నరసింహదాసు, వారణాసి రామసుబ్బయ్య, హరి నాగభూషణం, పలుకూరి వెంకట రమణ, నందిగానం వెంకన్న, వీణకుప్పయ్య, స్వాతి తిరుణాళ్,అల్లారఖా, భీమ్‌సేన్ జోషి, నారాయణ తీర్థులు, ముత్తుస్వామి దీక్షితులు, శ్యామశాస్త్రి, కైరం భూమగౌడు, కృష్ణమయ్య.

వీర్ని గురించిన వివరాలను మీరు
పంపవలసిన చిరునామా :

**తనికెళ్ల భరణి,**
**కేరాఫ్ 'హాసం,'**
**502, శ్రీ బాలాజీ నిలయం,**
**మోతీనగర్,**
**బాలాజీస్వర్ణపురికాలనీ,**
**హైదరాబాద్-500 018**

నన్నింతవరకూ ప్రోత్సహించినట్టే, లభించిన వివరాలను రాసి పంపి ఆశీర్వదిస్తారు కదూ..

మీ తనికెళ్ల భరణి





# అన్నమయ్య పద భావ దర్శనమ్



నిర్వహణ
జి.బాలకృష్ణప్రసాద్

## వినరో భాగ్యము విష్ణుకథ...

సంపుటం 3, సంకీర్తన 355
టి.టి.డి. వారి శ్రీ వేంకటేశ్వర గీత మాలిక
(నం. 294) క్యాసెట్‌లో పాడినది
సంగీత కూర్పు, గానం -
జి. బాలకృష్ణ ప్రసాద్

వినరో భాగ్యము విష్ణుకథ
వెనుబలమిదివో విష్ణుకథ ॥

ఆది నుండి సంధ్యాది విధులలో
వేదంబైనది విష్ణుకథ
నాదించీనిదె నారదాదులచే
వీధి వీధులనె విష్ణుకథ ॥

వదలక వేదవ్యాసులు నుడివిన
విదిత పావనము విష్ణుకథ
సదనంబైనది సంకీర్తనయై
వెదకిన చోటనె విష్ణుకథ ॥

గొల్లెతలు చల్లలు గొనకొని చిలుకగ
వెల్లవిరియాయె విష్ణుకథ
ఇల్లిదె శ్రీ వేంకటేశ్వరు నామము
వెల్లిగొలిపె నీ విష్ణుకథ ॥

ఓ ప్రజలారా! వినండి! వినండి! ఈ విష్ణుకథ మన పాలిటి నిజమైన భాగ్యము. అంతేకాదు ఇదే మనందరికీ వెనుబలము. (వెన్నుపూస బలం లేని మనిషి ఎలాగైతే కదలక మెదలక పడి వుంటాడో అలాగే ఈ విష్ణుకథ అనే వెనుబలం లేని వాడు చైతన్యరహితుడై పురోగతి లేక జీవన్మృతుడౌతున్నాడని భావం). వేదము మనకు విధినిషేధాలను అనుగ్రహించింది. అలా విధించిన వాటిలో మొదటిది సంధ్యా వందనము. ఇది చెయ్యకుండా ఏ ఇతర కర్మలు చేసినా అవి ఫలించవు. అటువంటి "సంధ్య"లో కూడా ఈ విష్ణుకథయే వేదమై వెలుగొందుతున్నది. (సంధ్యావందనం ఆరంభంలో ఆచమనానికి చెప్పే "కేశవాయస్వాహా" నామంతో ఈ విష్ణుకథ ఆరంభం. ఆ భగవంతునికి గల అన్ని నామాలకూ ఆధారమైన ఒక కథ ఉండనే వున్నది కదా! మానవజాతికి సంధ్యావందనాది విధులన్నీ వేదం విధించిన కర్మలే! వేదంలో ఉన్నదంతా విష్ణులీలలే... కాబట్టి సంధ్యాది విధులలో కూడా మనకు ధ్వనించేది విష్ణుకథలే కదా!). నారదుడు మొదలైన పరమ భాగవతోత్తముల చేత ముల్లోకాలలోనూ నినదిస్తున్నది (గానం చేయబడుతున్నది).

(ఒక్క విశేషాంశమును కూడా) వదలక శ్రీ వేదవ్యాసులు చెప్పగా (నుడివిన) మనకు విదితమై (అందివచ్చి)న పావనగ్రంథము శ్రీమద్భాగవతము. అందులో వున్నదంతా విష్ణుకథయే. ఆ విష్ణుకథయే సంకీర్తన రూపంలో ఎక్కడ వెదికితే అక్కడ నెలకొని (సదనమై) వున్నది.

శ్రీకృష్ణుని మీదనే తమ ధ్యాసనంతా నిలిపిన గొల్లెతలు - తాము చల్ల చిలికినపుడు వచ్చిన వెన్న ఆ కృష్ణుడే ఆరగించాలనీ, ఆ చల్లలు అతనికే చెందాలనీ కోరుకొని (గొనకొని) చల్లలు చిలికినారు. జీవాత్మ పరమాత్మల కలయికగా మధురమధురంగా ప్రకటమైన (వెల్లవిరియైన) కథ విష్ణుకథయే కదా! ఇదిగిదిగో! మన తిరుమల గిరిపై అనంతమైన ప్రవాహముగా (వెల్లిగొలిపె) కొనసాగిస్తున్నది.

మహిమాన్వితమైన, పావనమైన ఆ విష్ణుకథ వినటమే మనకు నిజమైన సౌభాగ్యము. అదే మన వెనుబలం.

## పాఠకులకు (ప్రధానంగా గాయనీ గాయకులకు) ఒక గమనిక

పాటలు పాడే సమయంలో కొన్ని పదాలు ఉచ్చరించడంలో సాధారణంగా చిన్న లోపాలు వుంటున్నాయి. ఆ పదాలు సక్రమంగా పలకటం వల్ల భాష బ్రతికిపోవడమే కాక పలుకు కూడా వినసొంపుగానూ - కొన్ని సమయాలలో సరియైన అర్థ, భావ ప్రకటనకూ అవకాశం ఏర్పడుతుంది. ఉదాహరణకు :- అక్షరాల మధ్య వున్న "సున్న"ను ప్రతీసారీ "మ్"గా పలుకరాదు.

**"సంధ్య"** :- ఈ పదం "వినరో భాగ్యము" సంకీర్తనలో మొదటి చరణంలో వున్నది. ఈ పదాన్ని కొందరు"సమ్ధ్య" అని వినిపించేటట్లు పలుకుతున్నారు. అలా కాకుండా **"సన్ధ్య"** అని వినిపించేటట్లు పలకాలి. అలాగే **"నాదించీనిదె"** అనే పదం "నాదిన్చీనిదె" అని వినిపించాలి.

2వ చరణంలో - **"సదనంబైనది"** అనే పదం వున్నది. దీనిని **"సదనమ్బైనది"** అని వినిపించే విధంగా పలకాలి.

అసలు - **"సంకీర్తనం"** అనే పదాన్ని **"సఙ్కీర్తనమ్"** అని వినిపించేటట్లు పలకాలి. అలాగే **వెంకటేశ్వర** శబ్దాన్ని కూడా **"వేఙ్కటేశ్వర"** అని స్పష్టంగా పలకాలి.

**మరికొన్ని ఉదాహరణలు :- పంట= పణ్ట ॥ వెండి = వెణ్డి ॥ పంకజ = పఙ్కజ ॥ అంగద = అఙ్గద ॥ సంఖ్య = సఙ్ఖ్య ॥ పంచ = పఞ్జ (ఇది దాదాపు 'పన్చ' అనే వినిపిస్తుంది.)**

**భంజ = భఞ్జ ॥ పంతము = పన్తము ॥ సంత = సన్త ॥ అంబ=అమ్బ॥**

అదిగో, ఇదిగో - అన్న పదాలు వచ్చే చోట "అదివో, ఇదివో" అని ప్రయోగించటం అన్నమయ్యకు మామూలే.

## ఓ చిన్న విన్నపం.....

అది 2004సం॥ మే 10వ తేది అని గుర్తు. అన్నమాచార్య సంకీర్తనల వర్క్‌షాపు నిర్వహించడానికి మిత్రులు సంగీత విద్వాన్ మోహన్‌కృష్ణ ఆహ్వానించగా హైదరాబాద్‌లో వున్న రోజులు. ఆరోజు ఒక ఫోన్ కాల్ 'హాసం' ఎడిటర్ రాజా నుండి. నాకు ఆశ్చర్యం, ఆనందం ఒకేసారి కలిగినై. 30 ఏళ్ళ క్రితం "సినీ హెరాల్డ్ రాజా" గా ఆయన పరిచయం అయ్యారు నాకు. అన్నమాచార్య సంకీర్తనలు కొన్ని ఎన్నుకొని-వాటిని అర్థ తాత్పర్యాలతో 'హాసం'లో ప్రచురించే కార్యక్రమం నా ద్వారా జరగాలని కోరారు. కొంత ఆనందం కలిగినా ఒక రకంగా భయంతో ఏం సమాధానం చెప్పాలో తెలియని అయోమయంలో పడ్డాను. కానీ-28 సం॥లుగా వందలాది సంకీర్తనలను స్పష్టమైన ఉచ్చారణతో భావస్ఫోరకంగా పాడిన అనుభవము, అన్నమాచార్య ప్రాజెక్టు వారు ఏటా నిర్వహించే అన్నమయ్య వర్ధంతి, జయంత్యుత్సవాలలో ఎంతో మంది విద్వాంసులు అన్నమయ్య సాహిత్యంలోని వివిధ అంశాలను గురించి చేసిన ప్రసంగాలు వందలాదిగా వినివున్న అనుభవంతో - ఈ పని మీరు చేయగలరనీ సందేహించవద్దనీ చాలా ప్రోత్సాహకరంగా మాట్లాడారు శ్రీరాజా. అన్నమయ్య సాహిత్యంలో ఇప్పటికిప్పుడే పరిష్కారం కాని, వివాదాలకు తావునిచ్చే అనేక అంశాలు ఎలాగూ వున్నాయి. వాటిని మినహాయిస్తే -కనీసం గాయకులకు, సామాన్య స్థాయిలోని సాహితీ జిజ్ఞాసువులకు కొంతవరకు ఉపయోగపడే రీతిలో కొన్ని సంకీర్తనలకు అర్థతాత్పర్యాలు వ్రాసివ్వగలననే అనిపించింది. తదితర హంగులు ఎలాగూ "రాజా" గారు కల్పిస్తారు కనుక. నాకు కొంతవరకూ ఇదొక సాధన, పుణ్యకార్యమే అవుతుంది. ఈ రకం భావాలతో , ఈ కార్యక్రమానికి నడుం కట్టాను. సహృదయులైన పాఠకులు నా పరిశ్రమనీ రాజా గారి అభిలాషనీ సరిగానే గ్రహించగలరనీ విశ్వసిస్తూ...

మీ

బాలకృష్ణప్రసాద్

## బాలకృష్ణప్రసాద్ గురించి...

అన్నమాచార్య ప్రాజెక్ట్ అనగానే స్ఫురణకు వచ్చే మొట్టమొదటి గాయకుడు శ్రీ గరిమెళ్ళ బాలకృష్ణప్రసాద్. "సంకీర్తన యజ్ఞాలు" (ఒకే వేదికపైన 7 రోజుల్లో సుమారు 250 సంకీర్తనలు గానం చేయ్యడం)చేసి తన మాతృసంస్థ ఐన తిరుమల తిరుపతి దేవస్థానం వారిచేతనే బంగారు పతకమూ, "అన్నమాచార్య సంకీర్తన మహతి" అన్న బిరుదును పొందిన సంకీర్తన ఆచార్యుడు శ్రీ ప్రసాద్. సంగీత కుటుంబంలో పుట్టి తల్లిదండ్రుల వద్దనే కొంత వరకు సంగీతం నేర్చుకొన్న వీరికి సంగీత కళానిధి శ్రీ నేదునూరి కృష్ణమూర్తిగారి వద్ద అన్నమాచార్య సంకీర్తనలతో బాటు మరికొంత సంగీతం కూడా అభ్యసించడం ఒక గొప్ప వరం అయింది. 'పద్మ విభూషణ్' బాలమురళీకృష్ణగారు, ప్రొ॥ డి.పశుపతిగారు, శ్రీఎం.ఎన్. బాలసుబ్రహ్మణ్యశర్మగారు, ఈయనకు మరిన్ని కీర్తనలు, సంగీతమూ నేర్పి గురుస్థానంలో వున్నవారు. కేవలం సంగీత దృష్టితోనే కాక అర్థభావ సౌందర్యారాధన చేసిన అనుభవం తోనూ, స్పష్టమైన ఉచ్చారణతోనూ గానం చేయ్యడంలో సాటిలేని మేటిగా శ్రీ బాలకృష్ణప్రసాద్ వన్నెకెక్కారు.

సుమారు 700 సంకీర్తనలు గానం చేయగల శ్రీ ప్రసాద్ శాస్త్రీయ సంగీత 'కృతుల' "ధోరణి లోనూ ; లలిత శాస్త్రీయ, లలిత సంగీత" జానపద గీతాల బాణీలలోనూ సుమారు నాలుగువందల అన్నమయ్య సంకీర్తనలకు సంగీతం సమకూర్చారు. ఇప్పటికి 250 కీర్తనలను ఆడియో క్యాసెట్స్, సి.డి. రూపాలలో పాడి విడుదల చేశారు. ప్రత్యేకంగా అన్నమయ్య సంకీర్తనలతో దేశ విదేశాలలో నాలుగు వేల కచేరీలు కూడా చేశారాయన.

సుమారు 350కృతులు (శాస్త్రీయ సంగీత రచనలు) రచించి ఎందరో సంగీతజ్ఞుల మన్ననలు పొందిన బాల కృష్ణప్రసాద్. 300 లలిత సంగీత గీతాలు కూడా రచించారు.

# జంధ్యా మారుతం ⑧





### కోరింతల్ని నూరింతలు చేసే నవ్వుల గుణింతం

## రెండు రెళ్ళు ఆరు









2 + 2 = 4
2× 2 = 4

మరి రెండు రెళ్ళు ఆరు ఎలా అవుతుందంటారు ! ?!

ప్రపంచం మొత్తం మీద రెండు రెళ్ళు ఎంతని ఎవరిని అడిగినా నాలుగే అని చెబుతారు.

కానీ తెలుగు సినిమా ప్రేక్షకులని మాత్రం రెండు రెళ్ళు ఎంతని అడిగితే 'ఆరు' అని చెబుతారు.

ఇది జంధ్యాల (సినిమా) మహత్మ్యం.

పెద్ద పీట వేసినా, చిన్న పీట వేసినా జంధ్యాల ఎప్పుడూ కొత్తదనానికే ఆహ్వానం పలుకుతారు. తెలుగు తెరపై ఆయన చేసినన్ని అల్లరి వనులు, తమాషాలు ఇంకెవరూ చేయలేదంటే అతిశయోక్తి కాదేమో. టైటిల్ కార్డ్ మొదలుకుని శుభం కార్డు వరకూ హమేషా ఏదో ఒక తమాషా చేనన్తానే వుంటారాయన. అలాంటిదే ఈ 'రెండు రెళ్ళు ఆరు' కూడానూ.

ఇదో తమాషా ప్రేమకథ. టైటిల్ కార్డ్ నుండే జంధ్యాలమార్కు తమాషాలు మనల్ని గిలిగింతలు పెడతాయి. ఇంచుమించు చిత్రం నిండా తన మార్క్ స్పార్క్ డైలాగులు నింపారు జంధ్యాల. రెండు జంటల మధ్య మూడు జంటల కథ నడవడమే 'రెండు రెళ్ళు ఆరు' అన్నదానికి అర్థం.

ఇందులో ఏ పాత్రని తక్కువ చేయడానికి లేదు. రాజేంద్రప్రసాద్, రజని, చంద్రమోహన్, ప్రీతిలతో పాటు కోపం వచ్చిన ప్రతిసారి బట్టలు చింపుకునే ఐరావతం (సుత్తివీరభద్రరావు), తన విచిత్ర గాత్రంతో సకల మానవాళినీ క్షతగాత్రుల్ని చేసే లలిత (శ్రీలక్ష్మి), గొంతు విప్పితే అరమైలు దూరం వినిపించేలా మాట్లాడే కీర్తన (ప్రీతి)మావయ్య దత్తాత్రేయులు (పి.యల్. నారాయణ), తను ఎప్పుడో మిలట్రీలో వుండగా సైనికుల సౌకర్యార్థం నేర్చుకున్న బహుభాషా ప్రజ్ఞను ఎప్పుడూ వినిపిస్తుండే తికమకరావు (రాళ్ళపల్లి), ఒకనాటి మహానటుడు సిఎస్సార్ గొంతును అనుకరించే నాటకాల రాయుడు గిరీశం (వేలు), సూపర్ స్పీడ్‌లో మాట్లాడే మధునాధనరావు తండ్రి జగవతిరావు



రిలీజ్
1991

నిర్మాణప్రాంతాలు
గుడివాడ,
విజయవాడ,
వైజాగ్

(సాక్షిరంగారావు) 'పితా' అని గొంతు చించుకుని అరిచే స్వామీజీ (పొట్టిప్రసాద్).. ఇలా రకరకాల పాత్రలు తెరమీద నవరసాలు చిందిస్తాయి.

ప్రఖ్యాత మెజీషియన్, హిప్నాటిస్ట్ ప్రొఫెసర్ బి.వి. పట్టాభిరాం ఇందులో తన పాత్రను తానే పోషించుకోవడం ఓ ప్రత్యేకత. ఆయనను ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ ఉపయోగించుకున్న ఘనత జంధ్యాలదే. చాలా మందికి తెలియని విషయం మరొకటుంది. జంధ్యాల కూడా మంచి మెజీషియన్. ఆ మోజుతోనే ఈ సినిమాలో రాజేంద్రప్రసాద్‌తో చిన్న చిన్న మేజిక్‌లు చేయించారు. పట్టాభిరాం నటించడం గురించి, మేజిక్‌ల గురించి ముమ్ముందు డీటైల్డ్‌గా చెప్పుకుందాం.

ఇందులో రాజేంద్రప్రసాద్‌ది భలే చిలిపి పాత్ర. తన ప్రేమను పండించుకోవడం కోసం ఓ తమాషా పద్ధతిని ఎంచుకుంటాడు. సినిమా థియేటర్‌లో పరిచయమైన ప్రీతిని 'ఒకే గొడుగు క్రింద ఐదుగురు ఎలా వెళ్ళొచ్చు' అనే ప్రశ్నతో, అలాగే మరిన్ని తమాషాలతో ఆమె మనసులో విజయవంతంగా తిష్టవేసేస్తాడు.

కథానాయిక ప్రీతికి 'బాబి' (హిందీసినిమా) అంటే ప్రాణం. 90 సార్లకు పైగానే ఆ సినిమా చూసింది. ఈ విషయంలో సెంచరీ పూర్తి చేయాలన్నది ఆమె ఆశ. ఇలా 'బాబి' సినిమా చూస్తున్నప్పుడే ఆమెకు రాజేంద్రప్రసాద్‌తో పరిచయం ఏర్పడుతుంది, పరిచయం కాస్తా ప్రణయంగా మారుతుంది.

ఇక సుత్తివీరభద్రరావుది ఓ విచిత్రమైన గాథ. సంగీతమంటే చెవికోసుకునే అతగాడు సంగీతం బాగా తెలిసిన అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలనుకుంటాడు. కానీ పెళ్ళి చూపుల్లో మోసపోతాడు. తను చేసుకున్న శ్రీలక్ష్మికి సంగీతం అస్సలురాదు. అందుకే నెలరోజుల్లోగా సంగీతం నేర్చుకోమని హుకుం జారీచేస్తాడు. అదే అతని కొంపముంచుతుంది. రాత్రీపగలూ తేడా లేకుండా హార్మోని పెట్టె ముందేసుకుని సంగీత శిక్షణ పేరుతో అందర్నీ శిక్షిస్తూ వుంటుంది. ఈ శిక్ష భరించలేక వీరభద్రరావు



బట్టలు కూడా చించేసుకుంటాడు. శ్రీలక్ష్మి సంగీతం పిచ్చి ముదిరి పోవడంతో హిప్నాటిస్ట్ పట్టాభిరామ్‌ని ఆశ్రయిస్తాడు వీరభద్రరావు. ఆయన ఆమె సంగీతపు పిచ్చిని పోగొట్టి వంట బాగా చేసే విధంగా హిప్నటైజ్ చేస్తారు. అయితే వీరభద్రరావు ఆయనకివ్వాల్సిన పదిహేనువందల రూపాయిల ఫీజు ఎగ్గొట్టడంతో తిరిగి శ్రీలక్ష్మిని పూర్వ స్థితికి తీసుకొచ్చేస్తారు. హిప్నాటిజంతో కూడా కావెండీ పుట్టించగలనని ఈ ఎపిసోడ్‌తో జంధ్యాల నిరూపించారు.

రాళ్ళపల్లి విషయానికొస్తే ఆయనది బహుభాషా పాత్ర. ఒకే మాటని నాలుగైదు భాషల్లో ఉపయోగిన్తుంటాడు. ఉదాహరణకు రండి -తెలుగు, వాంగో-తమిళ్, ఆయియే -హిందీ, ప్లీజ్ కమ్ - ఇంగ్లీష్ ఇది రాళ్ళపల్లి తరహా సంభాషణమ్.

సీనియర్ నటుడు పొట్టిప్రసాద్‌కి ఈ సినిమాలోని స్వామిజీ పాత్ర మంచి గుర్తింపుని తీసుకువచ్చింది. 'పితా' అంటూ ఆయన గొంతు చించుకుని అరిచే ప్రక్రియ మనల్ని కడుపుబ్బా నవ్విస్తుంది. పొట్టిప్రసాద్ తొలి చిత్రం 'అప్పు చేసి పప్పుకూడు'. 300కి పైగా చిత్రాల్లో







## పాత్రలు - పాత్రధారులు

| | |
|---|---|
| మధుసూధనరావు | : రాజేంద్రప్రసాద్ |
| సద్గుణరావు | : చంద్రమోహన్ |
| వింధ్య | : రజని |
| కీర్తన | : ప్రీతి |
| ఐరావతం | : సుత్తివీరభద్రరావు |
| లలిత | : శ్రీలక్ష్మి |
| దత్తాత్రేయులు | : పి.యల్. నారాయణ |
| దత్తాత్రేయులు భార్య | : డబ్బింగ్ జానకి |
| గిరీశం- | : సుత్తివేలు |
| తికమకరావు | : రాళ్లపల్లి |
| సర్వానందం | : పుచ్చా పూర్ణనందం |
| జగపతిరావు | : సాక్షిరంగారావు |
| స్వామీజీ | : పొట్టి ప్రసాద్ |
| వార్డెన్ | : కాకినాడ శ్యామల |
| పట్టాభిరాం | : బి.వి. పట్టాభిరాం (మెజీషియన్, హిప్నాటిస్ట్) |
| చిన్నప్పటి విఘ్నేశ్వరి | : బేబి మీనా |

మరియు

రామలింగేశ్వర రావు, ప్రకాశరావు, తాత అప్పారావు, కె. యస్, హరిబాబు, భీమేశ్వరరావు, సింధూరి, సుందరలక్ష్మి, పద్మ, మాస్టర్‌వేణు, మాస్టర్ శ్రీకాంత్.

## సాంకేతిక నిపుణులు

బేనర్
**విజయ కమర్షియల్స్**
సమర్పణ
**కె. శాంతికుమార్**
కథ
**మల్లాది వెంకటకృష్ణమూర్తి**
సంభాషణలు
**జంధ్యాల**
కళ
**దిలీప్ సింగ్**
స్టిల్స్
**గిరి**
అసిస్టెంట్ డైరెక్టర్స్
**జె. పుల్లారావు, ప్రకాష్**
నిర్వహణ
**టి. సభాపతిరావు**
అసోసియేట్ డైరెక్టర్
**ఇ.వి. వి. సత్యనారాయణ, బి.యస్.నిష్ఫల**
నేపథ్యగానం
**బాలు,జానకి**
పాటలు
**వేటూరి**
నృత్యాలు
**శేషు**
ఎడిటర్
**గౌతంరాజు**
సంగీతం
**రాజన్-నాగేంద్ర**
డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ
**బి. కోటేశ్వరరావు**
నిర్మాత
**జి. సుబ్బారావు**
దర్శకత్వం
**జంధ్యాల**

నటించిన ఆయనకు తన జీవితంలో బాగా నచ్చిన చిత్రాలుగా రెండే సినిమాలుగా చెప్పుకునే వారు. ఒకటి 'సాగర సంగమం' అయితే, మరొకటి 'రెండు రెళ్ళు ఆరు'.

జంధ్యాల సినిమాలో పర్మినెంట్ ఆర్టిస్ట్ అయిన వేలు ఇందులో గుర్తు (గొంతు )ండి పోయే పాత్ర. వేలు ఇందులో సిఎస్సార్ గొంతుని అనుకరించడం వెనుక చాలా పెద్ద కథే వుంది. అదేమిటో వివరంగా తెలుసుకుందాం.

ప్రఖ్యాత నవలా రచయిత యండమూరి వీరేంద్రనాథ్‌ది నాటక రచనలో కూడా అందె వేసిన చేయి. అప్పటి సినిమాలు, వాటి ధోరణుల మీద ఆయన 'చీమకుట్టిన నాటకం' పేరుతో వ్యంగ్య నాటకం రాస్తే బాగా పాపులరైంది. ఈ నాటకాన్ని కృష్ణ చైతన్య టీమ్ వాళ్ళు అనేకసార్లు వైజాగ్‌లో ప్రదర్శించారు. ఈ నాటకంలో హీరోయిన్ తండ్రి పాత్ర భలే వెరైటిగా వుంటుంది. ఇందులో పాత్రలన్నీ ఏదో ఒక నటుణ్ణి అనుకరిస్తుంటాయి. హీరో పాత్ర ఎన్‌టిఆర్‌ని అనుకరిస్తే, హీరోయిన్ పాత్ర అంజలీదేవిని అనుకరిస్తుంది. ఈ అనుకరణ అనేది ఆయా పాత్రధారుల అభీష్టం మేరకు వుంటుంది. హీరోయిన్ తండ్రి పాత్రను పోషించిన నటుడు కొంచెం భారీ పర్సనాల్టీ కావడంతో ఎస్వీఆర్‌ని అనుకరించేవాడు. అదే పాత్రను మన వేలుకి పోషించే అవకాశం వచ్చింది. అయితే వేలు పీల వ్యక్తి. బాడీ లాంగ్వేజ్‌తో ఎస్వీఆర్‌ని అనుకరిస్తే బాగోదు. అందుకే తన కిష్టమైన నటుడు సియస్సార్‌ని అనుకరించే ప్రయత్నం చేశారు వేలు. "సిఎస్సార్ డైలాగ్ డిక్షన్‌లో వెరైటీ వుంటుంది, క్లారిటీ వుంటుంది. ప్రతి అక్షరాన్ని స్పష్టంగా పలుకుతారాయన. అందుకే ఆయన్ని అనుకరిస్తే బాగుంటుందనిపించింది. ఇందు నిమిత్తం సిఎస్సార్ నటించిన 'అప్పుచేసి పప్పుకూడు', 'జగదేకవీరుని కథ' చిత్రాలను బాగా జీర్ణించుకున్నాను" అని తెలిపారు వేలు.

వేలు అక్కడితో ఆగిపోలేదు. ఇదే



అనుకరణని 'రామదాసు' నాటకంలో కూడా కొనసాగించారు.

ఆరోజు గాయకుడు ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం జన్మదినం. జంధ్యాల కోరిక మేరకు 'రామదాసు' నాటకంలోని తన పాత్రను ఆహూతుల ముందు అభినయించారు వేలు, దీన్నంతా జంధ్యాలే స్వయంగా వీడియోలో చిత్రీకరించారు కూడా.

అలా జంధ్యాల మదిలో ఓ పాత్ర పుట్టింది. అదే 'రెండు రెళ్ళు ఆరు'లోని 'గిరీశం' పాత్ర.

'గిరీశం' తాలూకు అనుభవాలను వేలు వివరిస్తూ "సినిమాలో చిన్న పాత్రే అయినా పెద్ద గుర్తింపునే తీసుకువచ్చింది. నా కెరీర్‌లో ఇదొక ప్రత్యేకమైన పాత్రగా పరిగణించాలి. సిఎస్సార్‌ని వెక్కిరించాలనే ఉద్దేశ్యంతో నేను ఏ కోశానా ఈ అనుకరణ చేయలేదు. ఆయన మాడ్యులేషన్ లోని విరుపుని అందరూ ఎంజాయ్ చేస్తారనే ఉద్దేశ్యంతోనే అలా చేశాను. ఈ అనుకరణ ద్వారా సిఎస్సార్ గారి కున్న పేరుని మాత్రం పోగొట్టలేదని గర్వంగా చెప్పుకోగలను" అని చెప్పారు.

ఇక 'రెండు రెళ్ళ ఆరు' లో ప్రధానంగా చెప్పుకోవలసింది బి.వి.పట్టాభిరాం గురించి. హిప్నాటిస్ట్‌గా, మెజీషియన్‌గా ఆయనకున్న పేరు ప్రఖ్యాతుల గురించి తెలుగు ప్రజలకు ప్రత్యేకంగా గుర్తు చేయనవసరం లేదు. హిప్నాటిస్ట్‌లకు, మెజీషియన్‌లకు సమాజంలో ఓ ప్రత్యేకమైన గుర్తింపును, గౌరవాన్ని తీసుకువచ్చారాయన.

ఈయన నటించిన తొలి సినిమాగా 'రెండు రెళ్ళు ఆరు'కు ఓ ప్రత్యేకత ఆపాదించబడింది. అసలు ఆయన ఈసినిమాలో ఎలా నటించారో తెలుసుకునే ముందు జంధ్యాలతో వారి పరిచయం ఎలా మొదలైందో పట్టాభిరామ్ మాటల్లోనే తెలుసుకుందాం.

"జంధ్యాలగారు విజయవాడలో బి.ఎ. చదివే రోజుల్లో, నేను




'రెండు రెళ్ల ఆరు' శతదినోత్సవానికి జంధ్యాల తయారు చేయించిన ఆహ్వాన పత్రం ఇది.

కాకినాడలో బి.కాం చదువుతుండేవాణ్ణి. వైజాగ్‌లో ఆంధ్రా యూనివర్సిటీ కల్చరల్ ప్రోగ్రామ్స్‌లోనేను మేజిక్ షోలు చేస్తే, ఆయన డ్రామాలు వేయడానికి వచ్చేవారు. అప్పుడాయన నాకు పెద్ద పరిచయం లేదు. హలో అంటే హలో అనుకోవడమే.


బి.వి.పట్టాభిరాం, సుత్తి వీరభద్రరావు, శ్రీలక్ష్మి

జంధ్యాలకు అత్యంత సన్నిహితుడైన జర్నలిస్ట్ రాజా ('హాసం' సంపాదకులు ) నాక్కూడా మంచి స్నేహితుడు. 'మీరిద్దరూ కలిస్తే మంచి మంచి అద్భుతాలు సృష్టించొచ్చును' అంటూ చొరవ తీసుకుని నాకు, జంధ్యాలకు మధ్య స్నేహ వారధి ఏర్పాటు చేశాడు రాజా. అప్పట్నుంచీ జంధ్యాల చనిపోయేవరకు మా స్నేహం నిరాటంకంగా కొనసాగింది. నా మేజిక్ షోలకి చాలాసార్లు జంధ్యాలగారిని గెస్ట్‌గా పిలిచాను. ఆయనక్కూడా హిప్నాటిజం, మేజిక్‌లంటే చాలా ఇష్టం. ఆ మక్కువ కొద్దీ నా దగ్గర హిప్నాటిజం కూడా నేర్చుకున్నారాయన. రచయిత ఆదివిష్ణు కోరిక మేరకు ఓసారి ఆయనే స్వయంగా నన్ను హిప్నటైజ్ చేశారు కూడా. గురువునైన నన్నే ఆశ్చర్యపరిచేలా నన్ను హిప్నటైజ్ చేశారు. "మా స్నేహం కలిసిన రోజుల్లోనే 'ఆనందభైరవి' ట్రూప్‌తో అమెరికా వెళ్తున్నారు జంధ్యాల. నన్నూ రమ్మన్నారు. ఓ పక్క బాలూగారి మ్యూజిక్‌షో, మరోపక్క నా మేజిక్ షో. నా మేజిక్ షోకి అసిస్టెంట్‌గా బాలూగారి మ్యూజిక్ ట్రూప్‌లో వున్న మాధవపెద్ది సురేష్, వాసురావు, శివమణిలు సహకరించారు" అని తెలిపారు పట్టాభిరాం.

ఇక 'రెండు రెళ్ళు ఆరు' సినిమాలోకి బి.వి. పట్టాభిరాం ఎలా ఎంటరయ్యారో చూద్దాం. ఓ రోజు సడన్‌గా పిలిపించుకుని ఈ సినిమాలో పాత్ర వేయాలని కోరడంతో పట్టాభిరాం మొదట చాలా ఇబ్బంది పడిపోయారు. "నాకు సినిమాలంటే మొదట్నించీ ఇంట్రస్ట్ లేదు. మా అన్నయ్య సీతారాముడు, బాపు, రమణలు ముగ్గురూ క్లాస్‌మేట్స్. 'నీకు ఆసక్తి వుంటే చెప్పు బాపు గారితో చెప్పి ఆయన సినిమాలో వేషం ఇప్పిస్తా' అని అన్నయ్య చాలా సార్లు అన్నాకూడా



నేను ఆసక్తి కనబరచలేదు. అందుకే జంధ్యాలగారు అడిగినా వెంటనే ఓకే చెప్పలేకపోయాను. మరో కారణం కూడా వుంది. చాలా సినిమాల్లో హిప్నాటిజాన్ని భ్రష్టుపట్టించడం నాకు చాలా బాధ కలిగించింది. అందుకే జంధ్యాల గారితో ఖరాఖండీగా చెప్పేసాను. 'నాపాత్ర స్థాయి ఏ మాత్రం దిగజారకూడదు, సంభాషణలు కూడా నా కనుగుణంగానే వుండాలి' అని చనువుకొద్దీ చెప్పాను. జంధ్యాలగారు కూడా అలాగే అన్నారు. మాట తప్పకుండా చేతల్లో కూడా ఆ సంస్కారాన్ని నిలబెట్టారు. అరగంట చేస్తే గానీ హిప్నాటిజమ్ పండదని చెప్పాను. అయితే అంతసేపు సీన్ చేయడం కష్టం కాబట్టి తెలివిగా గడియారం చూపి అరగంట అయినట్టుగా తన డైరెక్షన్‌తో ప్రేక్షకుల్ని హిప్నటైజ్ చేశారు జంధ్యాల. నేను ఈ వేషం వేస్తున్నానని తెలిసి ఓ పెద్ద ఆర్టిస్ట్ జంధ్యాల దగ్గరకు వచ్చి 'ఆయన కెందుకండీ వేషం. మాతో వేయించొచ్చుగా'అని అడిగారు. కానీ జంధ్యాలగారు సహజత్వానికే ప్రాణమిచ్చే వ్యక్తి. అందుకే ఆ ఆర్టిస్ట్ వాదన పట్టించుకోలేదు" అని తెలిపారు.

ఈ సినిమాలో పట్టాభిరామ్ అడ్రస్‌లో ఊరిపేరు 'కిర్లంపూడి' అని వేసారు జంధ్యాల. తూర్పుగోదావరి జిల్లా సామర్లకోట సమీపంలో వుందా వూరు. జంధ్యాలకు కొన్ని పేర్ల మీద మక్కువ ఎక్కువ. ఆ మక్కువతోనే సరదాగా 'కిర్లంపూడి' అని పెట్టారాయన. ఆయన సరదాపడి పెట్టిన ఆ ఊరి పేరును చాలామంది ప్రేక్షకులు సీరియస్‌గా తీసుకున్నారు. పట్టాభిరామ్ నిజంగానే ఆ ఊళ్ళోనే వుంటారనుకుని చాలామంది తమ సమస్యలు తెలుపుకుంటూ ఉత్తరాలు వ్రాశారట. "ఈ సినిమా రిలీజైన చాలా రోజుల తర్వాత ఆ ఊరి నుంచి నా దగ్గరకు వచ్చిన ఓ క్లయింట్ ద్వారా నాకీ విషయం తెలిసింది. వందలాది ఉత్తరాలు చూసి పోస్టల్ డిపార్టుమెంట్ వాళ్ళు కూడా తిట్టుకున్నారట. వెంటనే ఆ ఊరి పోస్ట్‌మేన్‌కి ఫోన్ చేస్తే చింపగా మిగిలిన ఓ వంద ఉత్తరాలు దాకా నాకు పంపాడు. ఈ సంఘటనతో సినిమా ప్రజల్ని ఇంతలా ప్రభావితం చేస్తుందని అర్థమైంది' అంటూ షూటింగ్ సమయంలో జరిగిన ఓ సరదా సంఘటనని ఇలా వివరించారు పట్టాభిరాం.

"నేను శ్రీలక్ష్మిని హిప్నటైజ్ చేసే సీన్ తీస్తున్నారు. 'మీరు వంట బాగా చేయగలుగుతారు' అంటూ, స్క్రిప్ట్ ప్రకారం వంటకాల లిస్ట్ చెబుతుంటే సడన్‌గా 'మజ్జిగపులుసు ' కూడా కలపండి అన్నారు వీరభద్రరావు. ఆయన డైలాగ్‌కి నాతో పాటు శ్రీలక్ష్మి, జంధ్యాల కూడా నవ్వేసారు. వెంటనే ఆ సీన్‌కు కట్ చెప్పి వీరభద్రరావు నిజంగా ఆ డైలాగ్ చెప్పేట్టుగా సీన్ మార్చితీశారు. ఆ సీన్ నిజంగానే చాలా బాగా పండింది' అని వివరించారు.

పట్టాభిరాం వెర్షన్ షూటింగ్‌కి రెండ్రోజుల సమయం పట్టింది. వైజాగ్‌లో హోటల్ ఓషన్‌పార్క్‌లో ఆయన వెర్షన్ షూటింగ్ చేశారు.

ఈ సినిమాలో పట్టాభిరాం కేవలం నటనకే పరిమితమై పోలేదు. హీరో రాజేంద్రప్రసాద్‌కి మ్యాజిక్ ట్రిక్స్ నేర్పడం, కొన్ని తమాషా ప్రశ్నల్ని సినిమా కోసం రాయడం వంటివి చేశారు.

అదేమిటో ఆయన మాటల్లోనే వివరంగా తెలుసుకుందాం "కాస్తందుకో దరఖాస్తందుకో' పాటలో రాజేంద్రప్రసాద్ చేత 13 మేజిక్‌లు చేయించారు జంధ్యాల. ఇందుకోసం నాకు పెద్ద పని పెట్టారు. 3 రోజుల్లో 30 మేజిక్ ఐటమ్స్ రాజేంద్రప్రసాద్‌కి నేర్పాలి. అయితే రాజేంద్రప్రసాద్ నాకు పెద్ద షాక్ ఇచ్చారు. ఉదయం నుంచి సాయంత్రంలోపే మొత్తం ఐటమ్స్ అన్నీ నేర్చేసుకుని, రాత్రి డిన్నర్ టైంలో

'రెండు రెళ్ళు ఆరు' చిత్రానికి కథనందించిన మల్లాదివెంకటకృష్ణమూర్తి జగమెరిగిన నవలారచయిత. ఆయన ఫోటో ఇప్పటి వరకూ ఎక్కడా పబ్లిష్ కాకపోవటం వల్ల ఆయనెలా ఉంటారో చాలామందికి తెలియదు. ఆ పాయింట్‌ని పట్టుకుని 'హాసం' సంపాదకులు రాజా 1986లో 'మల్లాది వెంకటకృష్ణమూర్తి' అనే ఓ సీరియల్‌ని రాశారు. పాఠ కులలో సంచలనాన్ని రేపిన ఆ సీరియల్ 3సార్లు నవలగా ప్రచురించబడింది. 'అద్దంలో చందమామ' అనే టైటిల్‌తో దూరదర్శన్ లో 13 వారాల సీరియల్‌గా ప్రసారమైంది. పల్లకి వార పత్రికలో 14 వారాలపాటు ప్రచురించబడిన ఆ సీరియల్‌లో- హీరోయిన్, ఆమె స్నేహితులు, ఆమె తండ్రి, ఇంటి నౌకరు తప్పిస్తే తక్కిన పాత్రలన్నీ నిజ జీవితంలో నిజంగా ఉన్న పాత్రలే. అందులో చాలామంది




ప్రముఖులు కూడా ఉన్నారు. తెలుగు నవలా సాహిత్యంలో అటువంటి ప్రయోగం అంతకు ముందెప్పుడూ జరుగలేదు. 'రెండురెళ్ళు ఆరు' సినిమా నిర్మాణానికి ముందు పట్టాభిరాం దగ్గర కొన్ని మ్యాజిక్‌లు, ట్రిక్కులు, పజిల్స్, గేమ్స్ నేర్చుకున్న జంధ్యాల స్నేహితులమధ్య సరదాగా వాటిని ఎలా ప్రదర్శించేవారో తెలిపే ఓ సంఘటనని 'మల్లాది వెంకటకృష్ణమూర్తి' నవలలో రాజా రాయటం జరిగింది. 'రెండు రెళ్ళు ఆరు' నవలలో లేని ఆ సంఘటన సినిమాగా వచ్చేసరికి ఎలా చోటుచేసుకుందో తెలిపే ఘట్టాన్ని 'మల్లాది వెంకటకృష్ణమూర్తి' నవలనుంచి 'హాసం' పాఠకుల కోసం దిగువన పొందుపరుస్తున్నాం....

"ఈ మధ్య హిట్టయిన రెండు రెళ్ళు ఆరు' మీ నవలే కదండీ! అందులో రాజేంద్రప్రసాద్ ప్రీతికి యిచ్చిన క్విజ్‌లు చాలా బావున్నాయండీ" అంది ఉషాకుమారి.

జయశ్రీ నెమ్మదిగా కేరియర్‌లు విప్పి తెచ్చినవన్నీ కాగితపు ప్లేట్లలో అమర్చి ఒక్కొక్కరికి పాస్ చెయ్యసాగింది.

'రెండు రెళ్ళు ఆరుకి సంబంధించినదే ఓ తమాషా ఇన్సిడెంట్ ఉందండీ...ఆ ఇన్సిడెంట్ నవల్లో లేదు. అది సినిమాలో జంధ్యాలగారు పెట్టినదే..." అని ప్రారంభించాడు మల్లాది.

అందరూ తింటూ ఉత్సాహంగా వింటున్నారు.

"జంధ్యాలగారు ఎప్పుడు హైద్రాబాద్ వచ్చినా రెగ్యులర్‌గా కలిసే స్నేహితుల్లో ఆదివిష్ణుగారు ఉంటూ వుంటారు. అన్నట్టు మీకు ఆదివిష్ణు తెలుసు కదూ?"

"తెలుసండి మౌళవిక చెప్పింది. ఆయన మీకు మా మౌళవిక అడ్రసు ఇవ్వడం అదీ...."

అంది సరళ.

"అదే... ఆయన, జంధ్యాలగారు మంచి స్నేహితులు. అసలు తనలోని కామెడీకి ఇన్స్పిరేషన్ ఆదివిష్ణే అని అంటూ ఉంటారు. జంధ్యాల.

ఆ రోజు ఏం జరిగిందంటే- వాళ్ళిద్దరూ, మెజీషియన్ పట్టాభిరాం మరికొంతమంది స్నేహితులూ హోటల్ అశోకాలోని ఆయన రూమ్‌లో కబుర్లు చెప్పుకుంటూ ఉన్నారు. ఆ టైములో నేనూ ఉన్నాను. పట్టాభిరాం కొన్ని మేజిక్‌లు అవీ చేసి చూపించాడు సరదాగా.

ఇంతలో 'ఆదీ..! (ఆదివిష్ణును జంధ్యాల అలా పిలుస్తారు.) నేనో మంచి మేజిక్ చెయ్యనా' అని అన్నారు జంధ్యాలగారు. మన ఆదివిష్ణుగారు సరేనన్నారు. ఒక టేబుల్ మీద ఆదివిష్ణుని నిలబెట్టి 'నేను మూడుసార్లు ఈ టేబుల్ చుట్టూ తిరిగేలోగా నువ్వు దిగిపోతావు చూస్తూ ఉండు' అని అన్నారాయన.

'నేను ఛస్తే దిగను పందెం' అని అన్నారు ఆదివిష్ణు.

"సరే -నా కళ్ళలోకి చూడు - తిరుగుతున్నాను .. ఒకటో సారి - అబ్రకదబ్రా'' అని తిరిగారు జంధ్యాల.

ఆదివిష్ణు కదలకుండా స్థిరంగా నిలబడ్డారు.

'ఆదీ ! జాగ్రత్త .. రెండోసారి తిరుగుతున్నా... అబ్రకదబ్రా" అంటూ రెండోసారి తిరిగారాయన. ఆదివిష్ణు మరింత ధృడంగా నిలబడి వున్నారా టేబుల్ మీద.

రెండుసార్లు తిరగటం పూర్తయ్యాక జంధ్యాలగారు వచ్చి మంచం మీద కూర్చున్నారు. పక్కనే ఉన్న సితార, జ్యోతిచిత్ర పేజీలు తిరగేశారు. అక్కడున్న తక్కిన స్నేహితులతో కొంతసేపు మాట్లాడేరు. ఇప్పుడే వస్తానని బాత్‌రూమ్‌కి వెళ్ళి వచ్చారు. ఇన్ని చేస్తున్నా ఆదివిష్ణు వైపు చూడనయినా చూడలేదు. తర్వాత నా పక్క తిరిగి ఏదో అనబోయే ఇంతలో -

'మూడోసారి ఎప్పుడు తిరుగుతావయ్యా' అని అడిగారు ఆదివిష్ణు కాళ్ళు పీకుతుండగా.

'అది ఇంత టైములో తిరగాలని మన పందెంలో లేదు కదయ్యా... నాకు ఇష్టం వచ్చినప్పుడు తిరుగుతాను. ఇప్పుడు కుదరకపోతే నేను మళ్ళీ హైద్రాబాద్ వచ్చినప్పుడు తిరుగుతాను' అని అన్నారు జంధ్యాల.

'ఏయ్.. ఇది మోసం గురువా' అంటూ టేబుల్ మీదనుంచి దిగిపోయారు ఆదివిష్ణు.

అదీ .. ఆ ఇన్సిడెంట్.. జంధ్యాలగారు 'రెండు రెళ్ళు ఆరు' సినిమాలో పెట్టారు. మీకు గుర్తుండే ఉంటుంది." అని ముగించాడు మల్లాది.

"అవును ..సముద్రం పక్కనున్న రాతిబండల మీద రాజేంద్రప్రసాద్ ప్రీతి దగ్గర ఈ మేజిక్ చేస్తాడు". అంది సుధ సంతోషంగా.

మల్లాది చెప్పిన సన్నివేశం అందరికీ నచ్చింది. ●

జంధ్యాల ముందు అద్భుతంగా ప్రదర్శించి చూపారు రాజేంద్రప్రసాద్. 'హేట్సాప్ టూ హిమ్. అలాగే ఈ సినిమా కోసం రకరకాల పజిల్స్ క్రియేట్ చేయమని అడిగారు జంధ్యాల. 'ఒక గొడుగు కింద తడవకుండా ముగ్గురు ఎలావెళ్ళగలిగారు?' 'మేడ ఎక్కి మేసే ఆవుని చూస్తారా ?' ఇత్యాది తమాషా ప్రశ్నలని నేను తయారు చేసి ఇచ్చాను. ఈ సినిమాలో నా కాంట్రిబ్యూషన్ కూడా వుంది. కాబట్టే టైటిల్స్‌లో నాకు స్పెషల్ ఇంపార్టెన్స్ ఇచ్చారు" అని చెప్పారు పట్టాభిరాం.

పట్టాభిరాం తన పాత్రకి తనే స్వయంగా డబ్బింగ్ చెప్పుకోవడం జరిగింది. మేజిక్ ప్రొగ్రామ్స్‌లో విపరీతమైన బిజీగా వుండటంతో తొలుత డబ్బింగ్ చెప్పడానికి ఆయనకు ఖాళీ దొరకలేదు. ఒక రోజు సమయం చిక్కింది దాంతో ఉదయం ఫ్లైట్‌కి మద్రాసు వెళ్ళి మధ్యాహ్నం డబ్బింగ్ పూర్తి చేసి ఈవినింగ్ ఫ్లైట్‌కి తిరిగి హైద్రాబాద్ చేరుకున్నారాయన.

"అలవాటు లేని ప్రక్రియ కాబట్టి డబ్బింగ్ చెప్పడం కొంచెం కష్టమనిపించింది. ఎక్కువ టైం తినేస్తున్నాననిపించి సిగ్గేసి, జంధ్యాలగారితో 'ఇక నావల్ల కాదు వేరే ఎవరితోనైనా డబ్బింగ్ చెప్పించుకోండి' అన్నాను. దానికాయన 'అలా కుదరదు, మీరు చెప్పగలరు' అని ధైర్యం చెప్పి పక్కన కూర్చుని డబ్బింగ్ చెప్పించారు " అని వివరించారు పట్టాభిరాం.

జంధ్యాల దర్శకత్వంలో పట్టాభిరాం చేసిన ఏకైక సినిమా ఇదే. ఆ తర్వాత 2,3 సినిమాల్లో చేయాల్సివున్నా కుదరలేదు. అయితే బైటవారి దర్శకత్వంలో జీవితఖైదీ, వజ్రం, ఎంజాయ్, శ్వేతనాగు మొదలైన చిత్రాల్లో నటించారాయన.

ఇక నేటి ప్రముఖ కథానాయిక మీనా కూడా ఈ సినిమాలో నటించింది. అప్పటికామె బాలతార. ఇందులో చిన్నప్పటి విఘ్నేశ్వరిగా బొద్దుగా, ముద్దుగా కనిపిస్తారామె.

జంట సంగీత దర్శకులు రాజన్-నాగేంద్రలతో జంధ్యాలది అపురూప రాగానుబంధం. 'నాలుగు స్థంభాలాట'తో మొదలైన వీరి స్నేహం అనేక చిత్రాల వరకూ కొనసాగి లలిత లావణ్య బాణీలతో తెలుగు ప్రేక్షకులు రాగాల ఉయ్యాలలూగేలా చేసాయి.

ఇందులో కేవలం మూడే మూడు పాటలున్నాయి. రాజేంద్రప్రసాద్, ప్రీతిలపై చిత్రీకరించిన 'కాస్తందుకో.. దరఖాస్తందుకో' పాట భలే బావుంటుంది. ప్రేమకు, దరఖాస్తుకు ముడిపెట్టి చేసిన ఈ రచన చాలా

## 'రెండు రెళ్ళు ఆరు'లో ప్రజాదరణ పొందిన కొన్ని డైలాగ్స్

- నన్ను లోపలకు వెళ్లనీయకపోయావో వరుసగా వారంరోజులు తెలుగు సినిమాలు చూపిస్తాను
  వద్దు యువరాజా... అసలే అర్ధకుడ్ని భరించలేను
- పగలల్లా నీ విచిత్రగాత్రంతో నన్ను క్షతగాత్రుడ్ని చేస్తున్నావ్. ఇప్పుడు రాత్రిళ్లు కలలు తెచ్చుకుని మరీ నన్ను కలవర పెట్టకే.
- ఒరెరే... ఆగరా... పిల్లులు ఏడుస్తున్నాయ్ అన్నావ్... ఆవిడ పాడుతున్నారు రా...
  నువ్ మాత్రం ఆ సౌండ్ నక్కల ఊళలనలా
- హలో ఐరావతం హియర్...
  కామధేను హియర్...
  ఎవరూ కామధేనువా.... ఏం ఆటలుగా ఉందేటయ్యా నీకు... నేను ఐరావతాన్నంటే నువ్ కామధేనువంటావేంటి...
- నేను ఇంట్లో వంట చేస్తానని చెప్పిన ఆ శుంఠ ఎవడు ?
  మీ ఏరియా ముష్టివాడు సార్
  ఎవరూ... మా ఏరియా ముష్టివాడా... వాడి మాటలు నమ్మి మీ గ్రైండర్ కంపెనీ పబ్లిసిటీలో నా ఫోటో వేసుకుంటావా... ఇలా నాతో మాట్లాడటానికి ఎన్ని గుండెలురా రాస్కెల్... ఓసారి ఇటువచ్చి కనబడు... నిన్ను రోట్లో వేసి రుబ్బుతా గ్రైండర్ వెధవా...
- ఒక గొడుగు క్రింద 5 గురు ఎలా వెళ్లగలరు అనడిగారు కదా... మీ ప్రశ్నకి సమాధానం తెలిసింది.
  వర్షం లేనప్పుడు
- ప్రేమించడం తేలిక. ప్రేమించిన అమ్మాయిని పెళ్లిచేసుకోవడం కష్టం. ప్రేమించిన అమ్మాయిని పెళ్లి చేసుకుని కూడా సుఖంగా ఉండటం అమిత కష్టం
- First is the first of the first and last is the first of the last, in between two zeroes అంటే ఏమిటో చెప్పండి.
  ఫస్ట్‌లో మొదటి అక్షరం ఎఫ్, లాస్ట్‌లో మొదటి అక్షరం ఎల్. ఇన్ బిట్వీన్ టూ జీరోస్... అంటే ఫూల్ (Fool)
- ప్రేమకు దరఖాస్తు అంటే ఏమిటి?
  ప్రేమకు దరఖాస్తు అంటే ముద్దు. Kiss is an enquiry about the heart whether it is to be letout or not.
- నువ్వు సంగీతం వినిపించేసరికి వంకాయలు మాడిమసై పోయాయి. బెండకాయకు దడపుట్టి దొండకాయంత కుమిలిపోయింది.
- ఓరి నీ పితాను పిల్లులు తిన... పిల్లలు వెళ్లిపోతున్నారయ్యా
- ఇవాళ నీకు నేనున్నాను, వండిపెడుతున్నాను. రేపు అటో ఇటో అయితే నీకు తిండి ఎలా చెప్పు?
  నా అదృష్టం ఇంతే అనుకుని హోటల్ నుండి క్యారియర్ తెప్పించుకుంటాను
- అయ్యా మాదాకోళం తండ్రీ...
  ఛీ... మరీ మద్దెల బ్రతుకు అయిపోయింది నాది. ఒక వైపు నాకు వంట చేసిపెట్టని ఆడది, మరో వైపు నావంట మాత్రమే అడుక్కుతినే మగాడు. వస్తున్నా నాయనా... మళ్లీ అరవకు నీరసం వస్తుంది.
- చొక్కా చింపుకుంటున్నారా... కానీయండయ్యా... నేను కాసేపు వెయిట్ చేస్తాను.
- ఏరా బకాసురుడి బావమరిదీ


మీనా

సున్నితంగానూ, చిలిపిగానూ వుంది.

టైటిల్ కార్డ్‌లో జంధ్యాల మార్కు తమాషాలు గురించి ఇప్పటికి చాలానే చెప్పుకున్నాం. ఇందులో కొత్త ధోరణి చూపించారు. యువరాజు వేషంలో వున్న రాజేంద్రప్రసాద్ గుర్రం మీద ఓ పాడుపడ్డ కోటలో ప్రవేశించడం, అడ్డుకున్న ద్వారపాలకుడుతో సంస్థానం ఎవరిదంటే 'సినిమా టైటిల్ ' రావడం, లోపల ఎవరున్నారంటే 'ఆర్టిస్టు'ల పేర్లు రావడం, ఇలా టైటిల్స్ అన్నీ సందర్భోచితంగా వస్తాయి. ఇంతకూ ఇదంతా హీరో కనే కల అన్నమాట.

ఆంధ్రుల అహ్లాద రచయితగా పేర్గాంచిన మల్లాది వెంకటకృష్ణమూర్తి ఈ సినిమాకి కథ నందించారు. "నేను ఇంతవరకూ 1500 కథలు, 50 నవలలు రాశాను. అవన్నీ పాఠకుల కోసమే రాశాను. కానీ సినిమాలను దృష్టిలో పెట్టుకుని ఏనాడు రచన చేయలేదు. సినిమాగా తీసిన నా మొదటి నవల 'రేపటి కొడుకు'. ఆ నవలను హిందీలో సినిమాగా తీశారు. 'రెండు రెళ్ళు ఆరు' కథను మాత్రం సినిమా కోసం, జంధ్యాల కోసం రాశాను" అని ఈ సినిమా షూటింగ్ సమయంలో చెప్పారు మల్లాది.

విజయవాడ నటరాజ్ హోటల్‌లో శ్రీలక్ష్మి పిక్చర్స్ ఆధ్వర్యంలో ఈ చిత్రం అభినందన సభ జరిగింది. ఈ సందర్భంగా జంధ్యాల మాట్లాడుతూ.." నవరసాల్లో ఏ రసంలో అయినా హాస్యరసం కలిస్తేనే అది రక్తి కట్టిస్తుంది. దురదృష్టవశాత్తు మన దేశంలో హాస్యానికి కావాల్సినంత గుర్తింపు రావడం లేదు. చిత్రరంగంలో చూస్తే ఇప్పుడిప్పుడే హాస్యభరిత చిత్రాల్ని, ప్రేక్షకులు ఆదరిస్తున్నారు" అని అన్నారు. "కామెడీ పాత్రలు పోషించడం నిజంగా కష్టం. ఆర్టిస్టుల కోసం పాత్రలను మలచకుండా పాత్రల కోసం ఆర్టిస్టులను ఎంపిక చేయడంవల్లనే ఈ సినిమా విజయవంతమైంది" అని చంద్రమోహన్ పేర్కొన్నారు.

## కథాంశం

మధుసూదనరావు, సద్గుణరావు ఇద్దరూ మంచి రూమ్మేట్స్. ఓ సినిమా థియేటర్‌లో పరిచయమైన కీర్తనను గాఢంగా ప్రేమిస్తాడు మధుసూదనరావు. కీర్తన, వింధ్యలు ఒకే హాస్టల్‌లో వుంటారు. మధుసూదనరావు అసలు పేరు వెంకటశివం, కీర్తన అసలు పేరు విఘ్నేశ్వరి. వెంకటశివం, విఘ్నేశ్వరికు ఇష్టం లేకుండానే చిన్న వయసులోనే పెళ్ళి అయిపోతుంది. తల్లిదండ్రుల ఉద్యోగరీత్యా ఇద్దరూ చిన్న వయసులోనే వేరుపడిపోతారు. విఘ్నేశ్వరి పెద్దనాన్న సర్వానందం ఎన్నోసార్లు ఊరు రమ్మంటాడు. విఘ్నేశ్వరి స్థానంలో వింధ్య, వెంకట శివం స్థానంలో సద్గుణరావు మంగళగిరి వెళ్తారు. అక్కడ ఇద్దరూ ద్వేషిస్తున్నట్టు నటిస్తూనే మనసులో ప్రేమ పెంచుకుంటారు. ఇంట్లో వాళ్ళకి వీళ్ళిద్దరూ అసలు వారు కాదని తెలిసి కంగారుపడతారు. చివరికి మధుసూదనరావు -కీర్తన, సద్గుణరావు - వింధ్య ఒక్కటవుతారు.

కాస్తందుకో.... దరఖాస్తందుకో...
ప్రేమ దరఖాస్తందుకో
ముద్దులతోనే ముద్దరవేసి
ప్రేయసి కౌగిలి అందుకో...
కాస్తందుకో.... దరఖాస్తందుకో...
భామ దరఖాస్తందుకో
దగ్గర చేసి దస్కతు చేసి
ప్రేయసి కౌగిలి అందుకో... ॥కాస్తందుకో...॥
చిరుగాలి దరఖాస్తు... లేకుంటే కరిమబ్బు ॥2॥
మెరువంత నవ్వులో చినుకైన రాలునా
జడివాన దరఖాస్తు... పడకుంటే సెలయేరు ॥2॥
వరదల్లే పొంగునా... కడలింక చేరునా
శుభమస్తు అంటే దరఖాస్తు ......... ॥కాస్తందుకో...॥
చలిగాలి దరఖాస్తు... తొలి ఈడు వినకుంటే ॥2॥
చెలిజంట చేరునా చెలిమల్లె మారునా
నెలవంక దరఖాస్తు... లేకుంటే చెక్కిళ్ళు ॥2॥
ఎరుపెక్కి పోవునా ఎన్నెళ్ళు పండునా
దరిచేరి కూడా దరఖాస్తులేలా... ॥కాస్తందుకో...॥

పుచ్చా పూర్ణానందం తన అభిప్రాయం వెలిబుచ్చుతూ "తెలుగులో గల హాస్యరస చిత్రాలను, సాహిత్యాన్ని ఆంగ్లంలోకి తర్జుమా చేస్తే అంతర్జాతీయంగా తెలుగువారి హాస్యం ఏమిటో తెలుస్తుంది. ఆ బాధ్యతను జంధ్యాల చేపట్టాలి. ఆయన హాస్యరసంలో నోబుల్ పొందాలి" అని చెప్పారు.

ఈ చిత్ర శతదినోత్సవ వేడుకలు ఏప్రిల్ 22 సాయంత్రం మద్రాస్‌లోని హోటల్ పామ్‌గ్రోవ్ లో సరికొత్త పద్ధతిలో జరిగాయి. ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం ఈ ఫంక్షన్‌కి వ్యాఖ్యాతగా వ్యవహరించి ఆద్యంతం ఫంక్షన్‌ని రక్తి కట్టించారు. కొందరు మెమెంటోలు అందు కుంటున్న సమయంలో బాలసుబ్రహ్మణ్యం గొంతుమార్చి గ్రహీతల వల్లే మాట్లాడి సభికులను ఆశ్చర్యపరిచారు. ఫన్ డాక్టర్ చంద్రశేఖరం, జెవి సోమయాజులు ముఖ్య అతిధిలుగా పాల్గొని ఈ మెమెంటోల నందజేశారు. వీరభద్రరావు తన మెమెంటోను అందుకుంటూ చిత్రంలో వలెనే స్టేజిపై తలకొట్టుకుంటూ, చొక్కా చింపేసుకున్నారు. పొట్టి ప్రసాద్ కూడా పాత్రలో లీనమైనట్లు 'పీత' అంటూ బిగ్గరగా అరిచి సభికులను ఆనందోత్సాహాల్లో ముంచెత్తారు. ఆ తర్వాత బి.వి.పట్టాభిరామ్ మాయాజాల ప్రదర్శన చేశారు.

### పాటలు

కాస్తందుకో .. దరఖాస్తందుకో
రాజేంద్రప్రసాద్, ప్రీతి

జోహారు పెళ్ళామా
రజని ,చంద్రమోహన్

విరహవీణ
నిదురరాక వేగే వేళలో
రజని ,చంద్రమోహన్

ఈ 'రెండు రెళ్ళు ఆరు' చిత్రాన్ని నిర్మించిన విజయ కమర్షియల్స్ వాళ్ళే తర్వాత బాలకృష్ణ, జంధ్యాల కాంబినేషన్‌లో ఓ సినిమా ప్లాన్ చేశారు. ఆ సినిమా పేరు 'నటరత్న'. మార్చి 12, 1986 న జరిగిన ప్రెస్‌మీట్‌లో ఈ విషయం ప్రకటించారు. అయితే ఎందుకనో ఈ ప్రాజెక్టు కార్యరూపం దాల్చలేదు.

ప్రేక్షకుల్ని కేరింతలు కొట్టేలా చేసిన 'రెండు రెళ్ళు ఆరు' ఈ చిత్రాన్ని చూసేకొద్దీ ఇప్పటికీ మన మనసుల్లో నవ్వులు ఊరుతూనే వుంటాయి. లేకపోతే ఊరుకుంటారా జంధ్యాల!

**- పులగం చిన్నారాయణ**

రఫీ గానవైదుష్యాన్ని వివిధ కోణాలలో ప్రతిబింబింప చేసే వ్యాస పరంపర

# విషాద మాధుర్యం

## రఫీ ప్రేమగీతాలు-3



Our sweetest songs are those that tell of saddest thoughts" అన్నాడు ఇంగ్లీషు కవి.

హై సబ్ సే మధుర్ వో గీత్ జిన్హే హమ్ దర్ద్ కే సుర్ మే గాత్ హై అన్నాడు హిందీ కవి.

అంటే విషాద భావాలను ప్రకటించేవే అత్యంత మధురమైన పాటలని ఇద్దరి భావం. అందుకే హిందీ సినిమాల్లో కూడా విషాద గీతాలు అద్భుతంగా ఉంటాయి. రఫీ ప్రేమ గీతాల్లోనూ ఈవిషయం వాస్తవం. ప్రేమలో ఆనందం, విషాదం సహజం. ప్రేమిస్తున్నప్పుడు అన్ని అనుభూతులనూ, సాధారణ స్థితిలో కంటే కొంచెం ఎక్కువే ఫీలవుతాం; ప్రకటిస్తాం కూడా. ఈ విషాదం తాత్కాలికమూ కావచ్చు (ప్రేమించిన వ్యక్తి రాక కోసం నిరీక్షించడం), శాశ్వతమూ కావచ్చు, (ప్రేమించిన వ్యక్తి చనిపోవడం లేదా శాశ్వతంగా దూరం కావడం). ఇలాంటి అన్ని సందర్భాల్లోనూ ప్రేమ తాలూకు వేదనను రఫీ పలికించిన తీరు అద్భుతం. అసలు రఫీ కంఠస్వరంలోని లోతులు తెలియాలన్నా, ఒక గాయకుడు విషాదంలో ఎన్ని షేడ్స్ చూపించడానికి అవకాశం ఉందో తెలుసుకోవాలన్నా ఈ పాటల్ని మరోసారి వినాలి.

ప్రేయసి ఇంకా రాలేదు. ఆమె విరహం మనసును కలవరపరుస్తోంది. వికలం చేస్తోంది. రాత్రి కరిగిపోతోంది. నువ్వు ఎప్పుడొస్తావో తెలీదు అంటూ రఫీ ఆత్మతో పాడిన పాట అతన్ని సూపర్ స్టార్‌ని చేసింది.

**'సుహానీ రాత్ ఢల్ చుకీ - నా జానే తుమ్ కబ్ ఆవోగే**

**జహా భీ రుఖ్ బదల్ చుకీ - నా జానే తుమ్ కబ్ ఆవోగే '**

(అందమైన ఈ రాత్రి అస్తమిస్తోంది- నువ్వు ఎప్పుడొస్తావో తెలీదు ఈ విశ్వం తన చలనాన్ని మార్చుకుంటోంది- నువ్వు ఎప్పుడొస్తావో తెలీదు)- దిల్లగీ.

అతని విరహం ఒక్క రాత్రిది కాదు. జన్మ జన్మలది. ఆమె ఆకాంక్షలో ఎన్ని యుగాలుగా నశిస్తున్నాడో చెప్తాడు.

చిత్రం : గైడ్ | రచన : శైలేంద్ర
సంగీతం : సచిన్ దేవ్ బర్మన్ | గానం : రఫీ
అభినయం : దేవ్ ఆనంద్, వహీదా రెహమాన్

దిన్ ఢల్ జాయె హాయ్
రాత్ న జాయ్
తూ తోన ఆయే
తేరి యాద్ సతాయ్ ॥దిన్ ఢల్ జాయె॥
ప్యార్ మేఁ జిన్‌కే సబ్ జగ్ ఛోడా
ఔర్ హుయే బద్‌నామ్
ఉన్‌కే హి హాథోఁ హాల్ హువా యే
బైఠే హైఁ దిల్ కో థామ్
అప్నే కభీ థే
అబ్ హైఁ పరాయ్ ॥దిన్ ఢల్ జాయె॥
ఐసీ హి రిమ్‌ఝిమ్ ఐసీ ఫువారేఁ
ఐసీ హి థీ బర్సాత్
ఖుద్ సే జుదా ఔర్ జగ్ సే పరాయే
హమ్ దోనోఁ థే సాథ్
ఫిర్ సే వో సావన్
అబ్ క్యోఁ న ఆయ్ ॥దిన్ ఢల్ జాయె॥
దిల్‌కే మేరే పాస్ హెూ ఇత్నే
ఫిర్ భీ హెూ కిత్‌నీ దూర్
తుమ్ ముఝ్‌సే, మైఁ దిల్ సే పరేషాఁ
దోనోఁ హైఁ మజ్‌బూర్
ఐసే మేఁ కిస్‌కో
కౌన్ మనాయ్ ॥దిన్ ఢల్ జాయె॥



చిత్రం : ఉరన్ ఖటోలా                    రచన : షకీల్ బదాయూని
సంగీతం : నౌషద్                              గానం : రఫీ
అభినయం : దిలీప్‌కుమార్, నిమ్మి, తదితరులు

చలే ఆజ్ తుమ్ జహాసే హుయీ జిందగీ పరాయీ
తుమ్హే మిల్ గయా ఠికానా హమే మౌత్ భీ న ఆయీ
వో దూర్ కే ముసాఫిర్ - హమ్ కో భీ సాథ్ లే లే రే
హమ్ కో భీ సాథ్ లే లే - హమ్ రెహ్ గయే అకేలే ॥వో దూర్॥
తూ నే వో దేదియా గమ్ బే మౌత్ మర్‌గయే హమ్
దిల్ ఉఠ్‌గయా జహాసే లే చల్ హమే యహాసే
లే చల్ హమే యహాసే
కిస్ కామ్ కీ యే దునియా జో జిందగీ సే ఖేలే రే
హమ్ కో భీ సాథ్ లే లే - హమ్ రెహ్ గయే అకేలే ॥వో దూర్॥
తూ నీ హే దిల్ కి రాహే కామోషు హై నిగా హై
నా దాన్ హసరతోంకా ఉఠ్‌నే కో హై జనాకా ఉఠ్‌నే కో హై జనాకా
చారో తరఫ్ లగే హై బర్‌బాదీయోంకే మేలే రే
హమ్ కో భీ సాథ్ లే లే - హమ్ రెహ్ గయే అకేలే ॥వో దూర్॥



'తుఝ్ కో పుకారే మేరా ప్యార్ -అజా కబ్ సే మిటాహూ తేరీ చాహమే' (నీల్ కమల్)

(నిన్ను పిలుస్తోంది నా ప్రేమ - ఇంకా రావేం? నీ పై కోరికతో ఎంత కాలం నుంచీ కుమిలిపోతున్నానో)

ఆమె కోసం నిరీక్షణ ప్రళయాంతం వరకు సాగుతుంది. అలా నిరీక్షించడంలో అతనికి బాధా ఉంది. కానీ ఆనందమూ ఉంది.

**'హమ్ ఇంత్‌జార్ కరేంగే - హమ్ ఇంత్‌జార్ కరేంగే తేరా కయామత్ తక్ - ఖుదా కహే కీ కయామత్ హో ఔర్ తూ ఆయే' (బహూ బేగమ్)**

(నేను నిరీక్షిస్తాను నీ కోసం - ప్రళయకాలం వచ్చేవరకు
దేవుడు దయతలచి త్వరగా ప్రళయం సృష్టించి
నువ్వు వస్తే బాగుండు)

తన ప్రేయసిని తనతో కలపడం కోసం ప్రళయం వచ్చేయాలని కోరుకునే అసాధారణ ప్రేమికుడితను.

ఇలా తాత్కాలిక విరహంతో వేగిపోయే విషాదం కొంత కాలానికైనా ఆనందంగా మారవచ్చు. కానీ ప్రేయసి తనను కాదన్నపుడు, తిరస్కరించినపుడు లేదా అనివార్య కారణాల వల్ల దూరమైనపుడు పడే వేదన వర్ణనాతీతమైంది. ప్రేయసి వంచించిందని భావించినపుడు అతను పడే బాధ విని తీరాల్సిందే.

**'హమ్ నే జఫా న సీఖీ - ఉస్ కో వఫా న ఆయీ
పత్థర్ సే దిల్ లగాయా - ఔర్ దిల్ పే చోట్ ఖాయీ' (జిందగీ)**

(నేను నమ్మక ద్రోహం నేర్వలేదు - ఆమెకు విశ్వాసం తెలీదు
రాతి పై ప్రేమ పెంచుకున్నాను- హృదయం గాయపడింది)

ఇంకా కోపం వచ్చినపుడు ఆమెను రాయి వంటి ప్రియురాలా అనే సంబోధించాడు.

**'పత్థర్ కే సనమ్ - తుఝే హమ్ నే మొహబ్బత్ కా ఖుదా జానా
బడీ భూల్ హుయీ - అరే హమ్ నే యే క్యా సమ్‌ఝా యే క్యా జానా'
(పత్థర్ కే సనమ్)**

'రాయి వంటి దానా - నిన్ను నేను ప్రేమ దేవతవనుకున్నాను
ఎంత పొరపాటు జరిగింది - నేనెలా భావించాను ; ఏం తెలుసుకున్నాను')

ఆమె తిరస్కారం కలిగించిన బాధ కోపంగా మారి, పగగా కూడా మారింది. అసలు ప్రేమ పైనే ద్వేషం కలిగిందంటాడు.

**'గుజరే హై ఆజ్ ఇష్క్ మే హమ్ ఉస్ మకామ్ సే
నఫ్రత్ సీ హోగయీ హై మొహబ్బత్ కీ నామ్ సే'
(దిల్ దియా దర్ద్ లియా)**

(నేను ప్రేమలో ఒక దశని దాటాను. అదెలాంటిదంటే - ప్రేమ అనే పదం పైనే ద్వేషం ఏర్పడుతోంది) ఈ పాటలోనే అంటాడు **'వో బేవఫా తేరా భీ యూహీ టూట్ జాయే దిల్ -తూ భీ తడప్ తడప్ కే పుకారే కీ హాయ్ దిల్**(ఓ విశ్వాసఘాతకీ, నీ హృదయం కూడా ముక్కలైపోవాలి, నువ్వు కూడా కుమిలిపోతూ హా హా కారాలు చేయాలి)

ఆమె తనలా బాధాతప్తురాలై పోవాలను కోవడం ఒక రకమైతే, ఆమె తన స్నేహం కోసమే తపించిపోవాలని శపించడం మరో రకం.

**మేరే దుష్మన్ తూ మేరీ - దోస్తీ కో తర్ సే
ముఝే గమ్ దేనేవాలే - తూ ఖుషీ కో తర్ సే' (ఆయే దిన్ బహార్ కే)**

(ఓ నా శత్రువా - నువ్వు నా స్నేహం కోసం పరితపించిపోవాలి
నాకు ఇంత బాధనిచ్చిన దానివి
నువ్వు కూడా ఆనందం కోసం తల్లడిల్లిపోవాలి )

ప్రియురాలిని శపించే ఈ ప్రవృత్తిని రఫీ ఎంత గొప్పగా పాడాడో, ఆ విషాదంతో కూడిన కసిని ఎంత భావస్ఫోరకంగా పలికాడో పై పాటలు గుర్తు చేసుకుంటే తెలుస్తుంది. ఇక్కడ కనిపించేది కోపం, ఆగ్రహమే అయినా, దాని వెనుక ఉన్నది దుర్భర విషాదం. ఆమె తనను మరచిందన్న, లేదా వంచించిదన్న ఆవేదన, ఇన్ని రకాల భావాలు రఫీ స్వరంలో సునాయాసంగా పలికాయి.

ఒకోసారి ఈ విషాదాన్ని భరించలేక అసలు ఆమె తన జీవితంలో ప్రవేశించడం, నిష్క్రమించడం అంతా మోసమే అంటాడు.

**తేరా ఆనా భీ ధోకా థా - తేరా జానా భీ ధోకా హై
మేరా దిల్ తో న మానే గీ - జో ఇన్ ఆంఖోనే దేఖాహై**

(నువ్వు రావడం మోసమే - నువ్వు వెళ్ళిపోవడమూ మోసమే
నాకళ్ళతో చూసింది నా మనసు నమ్మడం లేదు)

ఈ పాటలో ధోకా అన్న పదం పలుకుతున్నప్పుడు రఫీ కంఠంలోని అనుభూతి అద్భుతం.

అయితే ఈ కోపాలు, ప్రతీకారాలు, నిందలు వెయ్యడాలూ అన్నీ పై పై భావ ప్రకటనలే. వీటి వెనక దాగి వున్న ఆరాటం, బాధ, అశాంతి, వేదన -ఇవే అసలైనవి. ఆ బాధను రఫీ ఎలా వ్యక్తం చేసాడు.

'హువే హమ్ జిన్ కే లియే బర్ బాద్
వో హమ్ కో యాద్ కరేనా ఆజ్ జీవన్ భర్
జీవన్ భర్ ఉన్ కీ యాద్ మే హమ్ గాయే జాయేంగే' (దీదార్)

(నేను ఎవరి కోసమైతే నాశనమయ్యానో -ఆమెకు నేను ఈనాడు గుర్తే రాను జీవితమంతా ఆమె జ్ఞాపకాలను పాడుకుంటూ గడిపేస్తాను)

ఆమెకు తనసలు లెక్కేలేదనీ, తన మనసును ఆమె ఒక మనసుగా గుర్తించనే లేదనీ చాలా సరదాగా, బాధను దిగమింగుకుంటూ కూడా చెప్తాడు.

'న జానే క్యూ హమారే దిల్ కో తుమ్ నే దిల్ నహీ సమ్ ఝా
నజానే క్యూ యే శీషా తోడ్ డాలా
ప్యార్ కే కాబిల్ నహీ సమ్ ఝా' (మొహబ్బత్ జిందగీ హై)

(ఎందుకో గానీ నా మనసును నువ్వసలు మనసే అనుకోలేదు .
ఈ గాజు ముక్కను పగల గొట్టేసావు
ప్రేమకు అర్హంగానే అనుకోలేదు)

ఆమె తనను ప్రేమించకపోవడం వల్ల కలిగే విషాదం కంటే, ఇతర కారణాలవల్ల ఆమెకు దూరమై, ఆమె జ్ఞాపకాల్లో బతకాల్సి రావడం మరీ దుర్భరం.

'జిందగీ భర్ గమ్ జుదాయి కా ముఝే తడపాయేగా
హర్ నయా మౌసమ్ సుహానీ యాద్ లేకర్ ఆయేగా' (మిస్ బాంబే)
'జీవితాంతం నీ వియోగ జ్ఞాపకాలు నన్ను కలిచివేస్తాయి.
ప్రతి కొత్త ఋతువూ నీ అందమైన జ్ఞాపకాలతో ప్రవేశిస్తుంది'

ఈ పాట చరణంలో, తనను వదిలి మరో జీవితాన్ని వెతుక్కున్న ప్రేయసీ కలకాలం సుఖంగా ఉండాలని కోరుకుంటాడు. కానీ తను మాత్రం 'మర్ తే మర్తే భీ తేరాహీ నామ్ లబ్ పే ఆయేగా' (చనిపోతూ చనిపోతూ, నీ పేరే పెదవులపై ఉచ్ఛరిస్తాను) అని తన ప్రేమ పరిపూర్ణతను ప్రకటించుకుంటాడు.

ప్రతి అక్షరంలోనూ బాధను పలికించే ఈ పాట రఫీ పాటల్లోనే గొప్పది.

'హాయీ శామ్ ఉన్ కా ఖయాల్ అగయా
వహీ జిందగీ కా సవాల్ ఆగయా' (మేరే హమ్ దమ్ మేరే దోస్త్)
(సాయంకాలమైంది; ఆమె జ్ఞాపకాలు తరుముకొచ్చాయి
జీవితం ఏమిటనే ప్రశ్న మళ్ళీ తలెత్తింది)
అలాంటివే
'జబ్ జబ్ బహార్ ఆయి, ఔర్ ఫూల్ ముస్కరాయీ,
ముఝే తుమ్ యాద్ ఆయే' (తక్‌దీర్)

(వసంతం వచ్చినప్పుడు, పూలు వికసించినప్పుడు, నువ్వే గుర్తొచ్చావు) ప్రియురాలి దర్శనం కోసం కన్నీళ్ళతో వేచివున్న భావానికి ప్రతి రూపం.

'ఆయేన బాలమ్ వాదా కర్‌కే
డస్ గయే నైనా ధీరజ్ ధర్ కే' (శబాబ్)
ప్రేయసి మాట ఇచ్చి కూడా రాలేదు; కళ్ళు కాయలు కాచాయి.
'యే ఆంసూ మేరే దిల్ కీ జుబాన్ హై
మై రోవూత్ రోదే ఆంసూ మై హస్‌దూతొ హస్ దే ఆంసూ'
(హమ్ రాహీ)

(నా కన్నీళ్ళే నా మనసుకు వాగ్రూపాలు - నేనేడిస్తె కన్నీళ్ళు ఏడుస్తాయి. నేను నవ్వితే, కన్నీళ్ళు నవ్వుతాయి) ఇక్కడ 'నవ్వినా ఏడ్చినా కన్నీళ్ళే వస్తాయి' అంటున్న ఘంటసాల గుర్తొస్తాడు.

'దేఖో బినా సావన్ బరస్ రహే బదలీ
పియా కే దరస్ కో తరస్ రహే బదలీ' (సావన్)
(వర్ష ఋతువు రాకుండానే మేఘం వర్షిస్తోంది చూడు
ప్రియురాలి దర్శనం కోసం అది కరిగి నీరవుతోంది)

అన్నిటి కంటే బాధాకరమైన సన్నివేశం, వెళ్ళిపోతున్న తనని ప్రేయసి ఆపకపోవడం. అతనిలో ఆశ చావలేదు, కానీ ఆమె పిలవలేదు. ఈ పాట, రఫీ పాటల్లోనూ, మదన్‌మోహన్ సంగీత దర్శకత్వంలోనూ కూడా మేటి అనిపించుకున్నదే.

'మై యే సోచ్ కర్ ఉస్ కీ దర్ సే ఉఠాథా
కి వో రోక్ లేగీ మనాలేగీ ముఝ్ కో......అని ప్రారంభమై
'మగర్ ఉస్‌నే రోకా న ఉస్ నే మనాయా
న దామన్ హీ పక్‌డా, నముఝ్ కో బిఠాయా
న అవాజ్ హీ దీ, న వాపస్ బులాయా
మై ఆహిస్తా ఆహిస్తా బఢతాహి ఆయా
యహా తక్ కి ఉస్‌సే జుదా హో గయా మై' అని ముగుస్తుంది (హకీకత్)

(ఆమె నన్ను ఆపుతుందని, నన్ను బుజ్జగిస్తుందని ఆశిస్తూ నేను ఆమె సముఖం నుంచి లేచాను. కానీ ఆమె నన్ను ఆపలేదు; బుజ్జగించలేదు; అసలు పిలవనే లేదు; నన్ను కూర్చోమనలేదు; వెనక్కి రమ్మనలేదు; నేను మెల్లి మెల్లిగా ముందుకు వెళ్తూనే వున్నాను; క్రమేపి ఆమె నుంచి విడిపోయాను)

రఫీ విషాద గీతాలకు పరాకాష్ఠ అనదగ్గ పాట ఇది. అడుగడుగునా ఆ కంఠంలో పలికిన, నిరాశ, నిస్పృహ, విషాదం, 'మై ఆహిస్తా ఆహిస్తా' అని

**చిత్రం : దులారీ** — **రచన : షకీల్ బదయూని**
**సంగీతం : నౌషద్** — **గానం : రఫీ**
**అభినయం : సురేష్, మధుబాల**

సుహానీ రాత్ ఢల్ చుకీ నా జానే తుమ్ కబ్ ఆవోగే ॥సుహానీ॥
జహాఁ కి ఋత్ బదల్ చుకీ.... నా జానే తుమ్ కబ్ ఆవోగే
నజారే... అప్ నీ మస్తీయా దిఖా దిఖాకె సోగయీ
సితారే... అప్ నీ రోష్‌నీ లుటా లుటాకే సోగయీ
హర్ ఏక్ షమ్మజల్‌చుకీ.... నా జానే తుమ్ కబ్ ఆవోగే ॥సుహానీ॥
తడప్ రహే హై హమ్ యహాఁ.. తడప్ రహే హై హమ్ యహాఁ
తుమ్హారే ఇంత్‌జార్‌మే.. తుమ్హారె ఇంతజార్ మె
ఫిజాకరంగ్ ఆ చలా హై.. మౌస్ మె బహార్ మే
ఫిజా కరంగ్ ఆ చలా హై
మౌస్ మె బహార్ మె మౌస్ మె బహార్ మె
హవా భీ రుఖ్ బదల్ చుకీ నా జానే తుమ్ కబ్ ఆవోగే ॥సుహానీ॥



పలకడంలోనే ఇంకా ఆశ చావని మమకారం, **జుదా హోగయా మై** అనేసరికి ధ్వనించే తీవ్రమైన బాధ -గాయపడ్డ మనసుకు ఇంతకంటే గొప్ప అభివ్యక్తి మరొకటి దొరకదు.

జ్ఞాపకాల గురించి వందలాది పాటలు రఫీ కంఠస్వరంలో ఒదిగిపోయాయి. ప్రేయసి వల్ల తనకు కలిగిన బాధను ప్రకటిస్తూనే, ఆమెను ఓదార్చే పాటలు కూడా.

**'దిల్ కే ఝరోంకో మే తుఝ్‌కో బిఠాకర్**
**యాదోంకో తేరీ మై దుల్హన్ బనాకర్ రఖూంగా మై దిల్ కే పాస్**
**మత్ హో మేరీ జాఁ ఉదాస్'** (బ్రహ్మచారి)
(మనసు పొరల్లో నిన్ను వసింపజేసి -
నీ జ్ఞాపకాలనే వధువును చేసి (అంటే తాజాగా ఉంచి)
నామనసు చెంతే ఉంచుకుంటాను - బాధ పడకు నా ప్రాణమా)
**'దిన్ ఢల్ జాయే హాయే రాత్ నజాయే**
**తూ తోన ఆయే తేరీ యాద్ సతాయే'** (గైడ్)
(పగలు ఎలాగో గడిచిపోయింది - రాత్రి గడవడం లేదు నువ్వొ రాలేదు; నీ జ్ఞాపకం బాధిస్తోంది)

గతంలో ఇద్దరూ కలిసిమెలిసి వున్న సన్నివేశాలను గుర్తు తెచ్చుకుంటూ, ఇప్పటి బాధను భరించలేక దుఃఖాతిశయంతో పాడిన విధం అపూర్వం.

వియోగాల్లో కెల్ల బాధాకరమైంది మరణం వల్ల కలిగే వియోగం. దాని నుంచి మాత్రం విముక్తి లేదు. ప్రేయసి మరణిస్తే, ప్రియుడు పడే వేదన అనంతం, దుర్భరం.

**'ఆప్ కే పెహలూంమే ఆకర్ రో దియే**
**దాస్తానే గమ్ సునాకర్ రోదియే' (మేరా సాయా)** అంటు, ఆమె చిత్రపటానికే తన వేదనను వ్యక్తం చేసుకున్నాడు ఓ ప్రియుడు. ఆమె చనిపోతే ఇక తను మాత్రం ఈ భూమిపై ఎందుకనుకున్నాడు మరో సహచరుడు. తనను తీసుకువెళ్ళమని ఆకాశంలో వున్న చంద్రుడితో అన్నాడు.

**'వో దూర్ కే ముసాఫిర్ -హమ్ కో భీ సాథ్ లేలే రే**
**హమ్ కో భీ సాథ్ లేలే - హమ్ రెహ్ గయే అకేలే' (ఉడన్ ఖటోలా)**
ఆమె లేని ఈ ఒంటరి జీవితాన్ని భరించలేనని మొరపెట్టుకున్నాడు.
**'హమ్ తుమ్ సే జుదా హోకే**
**మర్ జాయేంగే రోరో కే' (ఏక్ సఫేరా ఏక్ లుటేరా)**
'నీ నుంచి విడిపోయిన నేను దుఃఖ భారంతోనే మరణిస్తున్నాను'

ప్రియురాలు చనిపోవడం అతనికి కలిగించిన బాధకు, నిస్పృహకు తలమానికమని చెప్పదగ్గ పాట **'మహువా'** చిత్రంలోనిది.

**దోనోంనే కియా థా ప్యార్ మగర్**
**ముఝే యాద్ రహా తూ భూల్ గయా**
**మైనే తేరే లియే రే జగ్ ఛోడా తూ ముఝ్ కో ఛోడ్ చలీ**
(ఇద్దరం ప్రేమించుకున్నాం - నాకు గుర్తుంది- నువ్వు మరిచిపోయావు
నేను నీ కోసం ఈ లోకాన్నే వదిలాను- నువ్వునన్నే వదిలి వెళ్ళావు)
అని ప్రారంభమయ్యే ఈ పాట ఆద్యంతం విషాద స్థాయిని పెంచుతూ..

**'తూ ఆగర్ ఉస్ జహా సే న ఆయీ - ఇస్ జహా కో జలాకే రహూంగా'** అంటూ 'నువ్వు ఆ ప్రపంచం నుంచి రాకపోతే -నేను ఈ లోకాన్ని కాల్చేస్తాను.' అనే వరకూ వెళ్తుంది. పాట ప్రారంభంలోని బాధ చివరకు బెదిరింపుగా మార్చడం, దుఃఖం ఆగ్రహంగా మారడం, చివరకు ఆమె వియోగాన్ని భరించలేక తను కూడా చావును ఆశ్రయించాలనుకోవడం -అత్యంత నాటకీయంగా ఉండే ఈ పాట రఫీ పాడిన విధానం అద్వితీయం. చిన్న స్థాయి సంగీత దర్శకులు సోనిక్ ఓమి సంగీతం నిర్వహించినప్పటికీ (వారి పాటల్లో ఇదే గొప్పది కావచ్చు), నటుడు కూడా అనామకమైనప్పటికీ, రఫీ ఈ పాటలో ఎలా ప్రాణం పోశాడో చూస్తే అతనికి తన వృత్తి పట్ల,

చిత్రం : బ్రహ్మచారి
రచన : హస్రత్ జైపురి
సంగీతం : శంకర్-జైకిషన్
గానం : రఫీ
అభినయం : షమ్మీకపూర్, రాజశ్రీ, ప్రాణ్

దిల్ కే ఝరోంకే మే తుఝ్‌కో బిఠాకర్
యాదోఁకే తేరీ మై దుల్హన్ బనాకర్
రఖూంగా మై దిల్ కే పాస్
మత్‌హో మేరి జాఁ ఉదాస్ ॥దిల్ కే॥
కల్ తేరే జల్ మే పరాయే భీ హోగే
లేకిన్ జలక్ మేరి హాతో మే హోగి
పూలోఁకే డోలి మే హోగి తు రుక్‌సత్
లేకిన్ మై హత్ మేరి సాసో మే హోగీ ॥కల్ తేరే॥ ॥దిల్ కే॥
అబ్ భీ తేరే సుర్ఖ్ హోటోఁకే ప్యాలే
మేరే తసవ్వుర్ మే సాఖీ బనే హై
అబ్ భీ తేరే జుల్ఫ్ కే మస్త్ సాయే
గిర్‌హాకీ రూప్ మే సాఖీ బనే హై ॥అబ్ భీ॥ ॥దిల్ కే॥
మేరీ మొహబ్బత్ కో టుక్‌రాదే చాహే
మై కోయీ తుఝ్‌సే నా షిక్‌వా కరూంగా
ఆంఖో మే రహతీహై తస్‌వీర్ తేరీ
సారీ ఉమర్ తేరీ పూజా కరూంగా ॥మేరీ॥ ॥దిల్ కే॥



మౌలికంగా 'పాట' పట్ల ఉన్న అంకిత భావం స్పష్టమవుతుంది.

ప్రేమ వైఫల్యం వల్ల కలిగే విషాదంలో కూడా ఇంత వైవిధ్యం చూపడం, కవి హృదయానికి అనుగుణంగా, సన్నివేశానికి ప్రాణం పోసే విధంగా భావ ప్రకటన చేయడం, సంగీత దర్శకుడు ఒక బాణీ అందిస్తే, దాని సంగతులతో , అభినయాత్మక మైన గానంతో ఎంతో ఎత్తుకు ఎదిగేలా చేయడం రఫీ కేసాధ్యం. అందుకే రఫీ విషాదగీతాలు మనసును ద్రవింపజేస్తాయి. విషాద గీతాలతో మనల్ని ఏడిపిస్తూ రఫీ ఇలా పాడి వెళ్ళిపోయాడు.

**'ఆఖిరీ గీత్ మొహబ్బత్ కా సునావూ తో చలూ**
**మై చలా జావుంగా -దో అశ్క్ బహాలు తో చలూ' (నీలా ఆకాశ్)**
(చివరి పాట ప్రేమను గురించి వినిపించి వెళ్ళిపోతాను
నేను వెళ్తాను గానీ - రెండు కన్నీటి చుక్కలు రాల్చి మరీ వెళ్తాను)'

**- మృణాళిని**

# సరిగపదమని

**28**

కూర్పు : టి.నవీన్, హైదరాబాద్

దిగువ ఇవ్వబడిన క్లూలు ఆధారంగా ఈ పజిల్ నింపితే మనకు పరిచయమైన కొందరు గాయనీ గాయకుల పేర్లు జవాబులుగా వస్తాయి. ప్రయత్నించి చూడండి.



**అడ్డం:**

1. '......కావాలా బంతికావాలా' (2)
2. '..........రాగంలో పిలిచిందొక హృదయం'(4)
6. 'విరిసినది ..........గానం' (3)
7. 'రామ రామ ........ రామా అనిపాడుతున్న హనుమా' (2)
8. 'ఛాంగురే బంగారు......' (2)
10. '..........హర నాహృదయమునే'(2)
11. 'అనగనగా ఒకరాజు అనగనగా ఒక .......'(2)
13. 'నామది నిన్ను పిలిచింది గానమై ..... గానమై' (2)
14. '........ శివం సుందరం' (2)
15. 'సుఖీభవ సుఖీభవ సుమంగళి సుఖీభవ ........వై చిరాయువై సుఖీభవ '(3)

**నిలువు:**

1. '...................... మాకు బాల్య మిత్రుడే' (7)
3. '...........కే అందని ఒకేఒక అందానివో' (4)
4. 'ఇందుగలడందులేడని సందేహము వలదు ........ సర్వోపగతుడు' (2)
5. 'మదన మనోహర సుందరనారీ మధురదర....... నయనచకోరీ' (2)
9. '......... కలగనలేదు రాముని సతికాగలనని ఏనాడు ' (3)
10. 'రావమ్మా ..........రావమ్మా' (2)
11. 'పాడవేల ......... ప్రణయసుధా గీతికా'(4)
12. 'నీ.... పాడెద దేవా మనవి ఆలించ వేడెద దేవా' (2)

పంపినవారి పేరు :........................................................................

వయసు :........... వృత్తి:....................................................................

చిరునామా : .....................................................................................

..........................................................................................................

...................................................................ఫోన్:.................................

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ <u>నంబర్‌తోసహా</u> పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...



**పజిల్, కూపన్ 15-10-2004 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)



రెండవ బహుమతి (ఒక తప్పుతో)




మూడవ బహుమతి (రెండు తప్పులతో)



కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)








# యువత మదిని బల్లేసాగూ 'చురాలియా!'

'చురాలియా' రీ-మిక్స్‌తో యువత మనసును దొంగలించటమే కాదు 'మల్టీ కల్చరల్ ఐకాన్'గానూ బల్లేసాగూ నిలిచాడు. పశ్చిమ ఆసియాలో ప్రముఖ డిస్కొజాకీ (డిజె) గా గుర్తింపు పొందిన బల్లేసాగూ కు ఈ పాట ఎంత పేరు -ప్రఖ్యాతుల్ని తెచ్చిందో మాటల్లో చెప్పలేం. "సంగీతం మీద వున్న ప్రేమ చదువును నిర్లక్ష్యం చేయడానికి కారణమైంది. ఆ తర్వాత నంగీతమే ఓ వృత్తిగా మారిపోయింది" అంటాడు బల్లేసాగూ..

తనకు సంగీతం అబ్బడం గురించి చెబుతూ" 1966లో ఢిల్లీలో పుట్టాను. నా చిన్నతనంలోనే మా కుటుంబం యు.కె.లోని బర్మింగ్ హామ్‌కు వలస వెళ్ళింది. అక్కడో ఇండియన్ రికార్డ్ షాప్‌ను మా నాన్న నడుపుతుండేవాడు. దానితో పాటుగా యు.కె.లో ఓ సంగీత బృందంలో ఆయన సభ్యుడుగా వున్నారు. మా అమ్మకి మంచి గాత్రముంది. ఆమె గురుద్వారాలో భజన కీర్తనలు పాడుతుండేది. అందువల్ల నాకు పాటలు పాడడం చిన్నతనంలోనే అలవాటైంది. స్కూల్ మేట్స్ ముందు నా సంగీత పరిజ్ఞానం ప్రదర్శిస్తుండేవాడిని. భారతదేశపు సంప్రదాయ సంగీతం-కుటుంబం నుండి అలవడిన పంజాబీ భాంగ్రా- పెరిగిన వెస్టర్న్ కల్చర్ ఇవన్నీ నాలో ఓ కొత్త ఆలోచనలకు - అన్వేషణలకు మూలమైనాయి. స్నేహితుల కోసం సరదాగా పాటల్ని రికార్డ్ చేసి ఇస్తుండే వాడిని. ఒకే రకమైన బాణీలో కాకుండా నేపథ్యంలోని వైవిధ్యం వాళ్ళకు ఆకట్టుకునేది ఇదేదో బాగుందనిపించి- కొన్ని పాటల్ని రీమిక్స్ చేసి ఆడియో కంపెనీలను అప్రోచ్ అయ్యాను" అని చెప్పారు.

కాలేజీలో బిజినెస్ స్టడీస్ కోర్స్ చేసినా-బల్లే దృష్టి అంతా సంగీత ప్రపంచం మీదనే వుండేది. అందుకే అందరిలా అతను సాదాసీదా వుద్యోగాన్ని వెతుక్కోలేదు. స్నేహితులకి రీమిక్స్ ఆడియో రికార్డ్ చేసి ఇస్తూ- దానికి అవరోధం కాని ఉద్యోగాలు చేశాడు. బల్లేసాగూ 1989లో యు.కె.లోని ఓరియంటల్ స్టార్ రికార్డింగ్ కంపెనీని కలిశాడు. తాను చేసిన డెమో టేప్‌ని వినిపించాడు. వెంటనే ఆ సంస్థ బల్లేతో మల్కిత్ సింగ్ 'హై జమాలో తుతక్ ... తుతక్' పాటను రీ-మిక్స్ చేయించింది. దానితో బల్లేసాగూ ప్రతిభ ఏమిటన్నది సంగీత ప్రపంచానికి తెలిసింది. కేవలం బ్రిటన్‌లోనే కాకుండా అమెరికా, కెనడాలలో కూడా ఆ పాట సంచలనం సృష్టించింది.

ఆ వెంటనే ఓరియంటల్ స్టార్ బల్లేతో 'వమ్‌బమ్' పేరుతో పూర్తిస్థాయి రీ-మిక్స్ ఆల్బమ్ రూపొందించి విడుదల చేసింది. ఆ ఆల్బమ్‌లో బ్రిటన్‌లో భారతీయ సంగీతం పట్ల ఓ రకమైన క్రేజ్ ఏర్పడింది. భారతీయ పాశ్చాత్య సంగీతాలను మేళవించి బల్లేసాగూ ఇచ్చిన తనదైన నేపథ్యం ప్రవాసుల్ని విశేషంగా ఆకట్టుకుంది. దాంతో ఓరియంట్‌స్టార్‌కు బల్లే ఫుల్‌టైమ్ ప్రొడ్యూసర్ అయ్యాడు. ఆ తర్వాత నస్రత్ ఫతే అలీఖాన్‌తో కలిసి చేసిన 'మ్యూజిక్‌టచ్' ఆల్బమ్ కూడా ప్రపంచవ్యాప్తంగా పేరు తెచ్చిపెట్టింది.

ఇవన్నీ ఒక ఎత్తు అయితే దాదాపు ఆరునెలలు పాటు విశేష కృషి చేసి బల్లే తన కర్రీవుడ్ స్టూడియోస్ తరపున 'బాలీవుడ్ ఫ్లాష్‌బ్యాక్' పేరుతో హిందీ హిట్స్‌ను రీ-మిక్స్ చేసి ప్రజల ముందుకువచ్చాడు. ఇదీ పెద్దహిట్ అయ్యింది. దాంతో కొలంబియా రికార్డ్స్ సంస్థ బల్లేతో ఒప్పందం కుదుర్చుకుంది. బల్లే రూపొందించిన 'చురాలియా' ..రీ-మిక్స్ కూడా అతనికి ఎంతో పేరు తెచ్చిపెట్టడమే కాకుండా రేడియో వన్‌లో ప్రసారమైన తొలి భారతీయ గీతంగా రికార్డ్ సృష్టించింది. సోనీ మ్యూజిక్ ద్వారా విడుదలైన 'దిల్ చీజ్‌హై' కూడా కొత్త రికార్డులు తెచ్చిపెట్టింది. 1996 అక్టోబరులో యు.కె.టాప్ 40సాంగ్స్ లో 'దిల్ చీజ్ హై...' పాట 12వ స్థానాన్ని ఆక్రమించుకుంది. అలానే 'తుమ్ బిన్ జియా' గీతం 1997 జనవరిలో యు.కె.టాప్ 30 సాంగ్స్ లిస్ట్‌లోకి చేరింది. భారతీయ భాషలకు చెందిన ఓ పాట యు.కె. చార్ట్స్‌లోకి చేరటం అప్పటివరకూ జరగలేదు. ఆ ఖ్యాతి బల్లే సాగూకే దక్కింది. ఆ తర్వాత బల్లే 'బాలీవుడ్ ఫ్లాష్‌బ్యాక్ -2' ను విడుదల చేశాడు. ఆ తర్వాత 'హాంజీ' అల్బమ్ విడుదలైంది.

## కొత్తకి ఆహ్వానం

ప్రముఖ గాయకుడిగా, గాడ్‌ఫాదర్ ఆఫ్ భాంగ్రా గా బల్లేసాగూకి గుర్తింపు వున్నా- ఇకపై కొత్త తరాన్ని ప్రోత్సహించాలనే పని పెట్టుకున్నాడు. "నేను సంగీతానికి దూరంకాను. అదే నమయంలో వివిధ దేశాలలో వున్న యువతరంను ప్రోత్సహించాల్సిన అవసరం కూడా వుంది. మట్టిలో వున్న మాణిక్యాలను వెలికితీసే పనిలో వున్నాను ప్రస్తుతం. మా 'ఇష్కరికార్డ్స్' ద్వారా న్యూ టాలెంట్‌ను ప్రపంచానికి పరిచయం చేయాలి. కొత్త గాయనీ గాయకుల్ని వాళ్ళ బయోడేటాను పంపాల్సిందిగా కోరుతున్నాను" అని అన్నాడు.

తన జీవితంలో గొప్ప సంఘటనలు గురించి చెబుతూ " నస్రత్ ఫతే అలీఖాన్‌తో కలిసి ఆల్బమ్ తీసుకు రావటం మరువలేని సంఘటన . అలానే అమితాబ్‌తో కలిసి పనిచేయడం కూడా ! " అని అన్నాడు.

ఎ.ఆర్. రెహమాన్, లతామంగేష్కర్, ఆర్.డి.బర్మన్ తానెంతో ఇష్టపడే వ్యక్తులని చెబుతూ "చక్కటి సంగీతాన్ని అందిస్తున్నందుకు వాళ్ళకి నా ధన్యవాదాలు" అని చెబుతున్నాడు బల్లేసాగూ.

- వి.అరుణ సత్యవతి

..ంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్....ఊ...హా...ఊ...హ
..ంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్...ఊ...హా...ఊ...హ....హోయ్....
..ా...బేగంపేట బుల్లమ్మో....
అరె పంజాగుట్ట పిల్లమ్మో...
హే...బేగంపేట బుల్లమ్మో...
అరె పంజాగుట్ట పిల్లమ్మో
బాడీలోన వేడే చూసి గోలీ వేస్తనమ్మో
హే..చింతల్‌బస్తీ చిట్టమ్మో కుకట్‌పల్లి కిట్టమ్మో
బాధే నీకు లేకుండానే దూదె రాస్తనమ్మో
హే...హైదర్‌గూడా గున్నమ్మో...
కో: శంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్.
అరె దోమల్‌గూడా గుండమ్మో...
కో: శంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్.
అ: హే...హైదర్‌గూడా గున్నమ్మో...
దోమల్‌గూడా గుండమ్మో...
వాతంగానీ పైత్యంగానీ చెంతకొస్తే చాలు చిత్తు చిత్తమ్మో
ఆ: నీ పేరేందబ్బాయా....
అ: దా..దా...దా...దా..దా...దా...
కో: శంకర్‌దాదా....శంకర్‌దాదా .....శంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్.
హే...శంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్....శంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్....
బోలో...శంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్....
శంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్.....
అ: హే...బేగంపేట బుల్లమ్మో....
అరె పంజాగుట్ట పిల్లమ్మో...ఎహె..ఎహె...
హే....నడవలేని వాళ్లు ఉరికేలాగా
నే పెంచుకున్న కుక్కనొదులుతా...హె..హె....
అరె పలకలేని వాళ్లు అరిచేలాగా
నే రాసుకున్న కవితచదువుతా... హె..హె..హె...
అరె మోసపోయి వచ్చినోళ్ల కళ్లు మిటకరించేలా
మలయాళం ఫిల్ము చూపుతా....హెయ్..
అరె జంతర మంతర జాలీ
అరె ఛూ మంతర కాళీ నీ బతుకుల్లో బాధలెన్నున్నా
చిన్న చిరునవ్వే ఉంది ఓరన్న ..హోయ్...
ఆ: నిన్న హేసరనప్పా
అ: నన్న హేసరా..అహహహ.....
కో: శంకర్‌దాదా....శంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్.
శంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్....బోలో...
శంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్....శంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్....
అ: చేతకానితనము టీబీ అయితే
నే చూపు చూస్తే బాగుపడునులే
లంచగొండి తనము కలరా అయితే
నే చెయ్యి వేస్తే తిరిగిరాదులే...హె..హె..
అన్యాయాలు, అధర్మాలు అక్రమాలు కాన్సరైతే
అంతు తేల్చు ఆస్పరుందిలే ....
అరె మోసమన్న బీపీ. యమ స్వార్థమన్న షుగరు
ప్రతి జబ్బుకీ వైద్యముందిలే
మరి అన్నిటికీ ఒకే మందులే ....హే...
కో: ఏం మందు గురూ...?
అ: ఏం మందా...? అహహహ....
కో: శంకర్‌దాదా....శంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్.
శంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్....బోలో...
శంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్....శంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్....
శంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్ కో జై బోలో
శంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్....ఊ...హా...ఊ...హ ॥11॥
అరె... శంకర్ దాదా శంకర్‌దాదా శంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్..



ఆ : నా వయసే పాదరసం... నేనసలే చిన్న రసం
నా పెదవే ద్రాక్షరసం నా నడుమే నాగస్వరం
నా సోకు పూలవనం నా చూపు నీకు వరం
అందిట్లో ఆడతనం అందిస్తా మూలధనం..... ఓయ్...
హే...నా పేరే కాంచనమాల నా వయసే గరమ్ మసాలా
తందాన తాన అంటు మోగనీ తబలా
అ: హే...రావే నా రస రంగీలా నీ గుట్టే నా రసగుల్లా
తైతక్కలాడుకుంటూ తాకితే గుబులా
ఆ: కలిసొస్తా కాని వేళ కైపెక్కే కన్నులా
నీదేరా రాకుమారా దొరగా రా ఉడుకుల ఉయ్యాలా
ఊ...నన్ను అల్లుకో అల్లుకో
ఆ.... నన్ను గిల్లుకోరా
హే... నన్ను చంపుకో చంపుకో....ఓ.....ఓ...ఓహ్
అ: ఊ....నిన్ను తాకనా తాకనా
ఆ..నిన్ను చుట్టుకోనా
హే... ముద్దు పెట్టనా పెట్టనా..హోయ్...
కో: హొయ్యో... హొయ్యో.. హొయ్యో... హొయ్యో... హొయ్యో.. హొయ్యో...
హొయ్యో... హొయ్యో.. హొయ్యో... హొయ్యో... హొయ్యో.. హొయ్యో...
ఆ: ఆ....నీ రాకలో రాపిడుంది
నా సోకుల దోపిడుంది
నీ దొంగ చూపుకే నా బెంగ తీరనా
నీవుండిపో రాత్రికి
అ: నీ మీదనే మోజువుంది ఈ రోజునే రాజుకుంది
ఏ పోజు పెట్టినా ఈ పోరు తప్పునా తెల్లారిందీ ఆటకి
ఆ: మాయాబజార్ మల్లెపూలకి వేలాల వెర్రి నాకు రేగే
పారాహుషార్ పట్టుచిక్కెరో మామా... మామా...మామా
అ: కావాలిలే కజ్జికాయలే నీ గిల్లికజ్జికాయలే
ఆడాలిలే గచ్చకాయలే భామ ఓ భామ ఓ భామ
ఆ: ఊ...నన్ను అల్లుకో అల్లుకో
ఆ.... నన్ను గిల్లుకోరా
హే... నన్ను చంపుకో చంపుకో....ఓ.....ఓ...ఓహ్ ॥నా పేరే॥
ఆ: ఓలమ్మో...
అ: నీ నవ్వులో చిచ్చువుంది నా గుండెలో గుచ్చుకుంది
ఏ మాట చెప్పినా ఆ మంట తీరునా నన్నాపలే ఎప్పుడూ
ఆ: నీ సూపులో సూదివుంది సూదంటులా లాగుతుంది
నీవంటు తొక్కిన నావంటి చెక్కన నేమోయలేనిప్పుడు
అ: బస్తీ సవాల్ బాలీవుడ్‌లో చిత్రాంగి చీర కట్టదాయె
చారుమినార్ సెంటుబుడ్డివే భామ ఓ భామ ఓ భామ
ఆ: తాకించనా పూతరేకులే లేలేత కొత్త సోకులే
ఒడ్డించనా ముంజకాయలే మామా ఓ మామా ఓ మామా
ఊ...నన్ను అల్లుకో అల్లుకో
ఆ.... నన్ను గిల్లుకోరా
హే... నన్ను చంపుకో చంపుకో....ఓ.....ఓ...ఓహ్
హే...నా పేరే
హొయ్
అ: కాంచనమాల
ఆ: నా వయసే
అ: గరమ్ మసాలా
ఆ: తందాన తాన అంటు మోగే ఈ తబలా
అ: హే...రావే నా
కో: రస రంగీలా
అ: నీ బుగ్గే
కో: నా రసగుల్లా
అ: తైతక్కలాడుకుంటూ తాకితే గుబులా...లా...లా...హే...ఊయ్...
ఆ: ఆ...ఆహ..

**రచన: దేవీశ్రీప్రసాద్ (3) గానం: చిరంజీవి, కె.కె.**

కరెక్టే ప్రేమ గురించి నాకేం తెలుసు
లైలా మజ్నూలకు తెలుసు పారు దేవదాసులకు తెలుసు
ఆ తరువాత తమకే తెలుసు
ఇదిగో తమ్ముడూ... మనకీ ఓ లవ్‌స్టోరీ ఉందమ్మా... వింటావా....ఆ...
ఓ..యస్.. ఓ...యస్...
హేయ్...చైలా చైలా చైలా చైలా...
నేను వెంటపడ్డ పిల్ల పేరు లైలా ॥చైలా॥
హోయ్‌లా హోయ్‌లా హోయ్‌లే హోయ్‌లా
నడక చూస్తే చిక్కుబుక్కురైలా
గులాబిలాంటి లిప్పుచూసి నా పల్సురేటే పెరిగింది
జిలేబిలాంటి హిప్పుచూసి నా హార్టు బీటే అదిరింది
పాల మీగడంటి రంగుచూసి నా రక్తమంతా మరిగింది
నా ఏరియాలో ఎప్పుడూలేని లవ్వేరియా నాకు అంటుకుంది
ఓ మాయా ఓ మాయా ఈ ప్రేమ అంతే మాయా
అరె గోలా ఇది గోలా ఇది తియ్యనైన గోలా ॥ ఓ మాయా॥
చైలా చైలా చైలా.... చైలా నేను వెంటపడ్డ పిల్ల పేరు లైలా
తర్వాతేమయిందన్నా....
ఏమయిందా....
ఆ రోజువరకూ హాయిగా ఎలా పడితే అలా తిరుగుతూ గడిపేసేవాణ్ణి
కానీ ఆ రోజు నుంచి తిరుగుళ్లు.. నో ఛాన్స్....
దాదాగిరి... నో ఛాన్స్... ఓన్లీ రొమాన్స్.....
ఊ....తన్ని చూసినాకనే డ్రింకింగ్ మానేసా
తెల్లవారుజామునే జాగింగే చేశా
హే...వన్... దమ్ము కొట్టడం వదిలేశా
హే..టూ... దుమ్ము దులపటం ఆపేశా
హే...త్రీ... పీక కోసే కత్తితోనే పూలు కోసి తీసుకొచ్చా
హో...యా.... ఇంటి ముందరే టెంటువేశా
హో...యా... ఒంటికందిన సెంటు పూశా
హో...యా... మంచినీళ్ల లారీ దగ్గర బిందె కూడా బ్లాకుచేశా
ఆ దెబ్బతో చిన్న చిర్నవ్వుతో ఫేసు నా వైపు టర్నింగ్ ఇచ్చుకుంది
అదేమిటో మరి ఆ నవ్వుతో నా మనసంతా రఫ్ ఆడేసింది
ఓ మాయా ఓ మాయా ఈ ప్రేమ అంతే మాయా
అరె గోలా ఇది గోలా ఇది తియ్యనైన గోలా
చైలా చైలా చైలా....చైలా.....
జీవితంలో దేని మీదా ఆశపడని నేను
ఆ అమ్మాయి మీద ఆశలు పెంచుకున్నాను.
ఎన్నో కలలుకన్నాను. ఆ అమ్మాయి నాకే స్వంతం అనుకున్నాను. కానీ ఒక రోజు ఏం జరిగిందో ఏమో తెలీదు... ఆ అమ్మాయికి.... పెళ్లయిపోయింది...
కళ్లలోన కలలు అన్నీ కథలుగానే మిగిలెనే
కనులుదాటి రాను అంటూ కలిగిపోయెలే
మరి తర్వాత ఏమయింది...
హు... తర్వాత.....తర్వాత ఏమవుతుంది
ఆ మరుసటి రోజు.... మా ఏరియాలోకి ఐశ్వర్య వచ్చిందీ
ఓ మాయా ఓ మాయా ఈ ప్రేమ అంటే మాయా
అరె గోలా ఇది గోలా ఇది తియ్యనైన గోలా ॥ ఓ మాయా॥
చైలా చైలా చైలా చైలా.... ఇదర్ ఆ... ఏంటిరా మీ కుర్రవాళ్ల గోల
చూడు తమ్ముడూ ప్రేమ అనేది లైఫ్‌లో ఓ చిన్న పార్టే కానీ
ప్రేమే లైఫే కాదు. ఆ మాత్రం దానికి అమ్మాయికోసం ప్రాణాలు తీసుకోవటం లేదా ఆ అమ్మాయి ప్రాణాలే తీయటం నేరం... క్షమించరాని నేరం..... అండర్‌స్టాండ్
ఓడిపోవటం తప్పుకాదురా చచ్చిపోవడం తప్పు సోదరా
చావు ఒక్కటే దారంటే ఇక్కడుండే వాళ్లు ఎంతమందిరా
జీవితం అంటే జోక్ కాదురా దేవుడిచ్చిన గొప్పగిఫ్టురా
దాన్ని మధ్యలో కతమ్ చేసే హక్కు ఎవరికీ లేదురా
నవ్వెయ్యరా చిరు చిందెయ్యరా
అరె బాధ కూడా నిన్ను చూసి పారిపోద్దిరా
దాటేయరా అడ్డు దాటేయరా ఏ ఓటమీ నిన్ను ఇక ఆప లేదురా
ఓ మాయా ఓ మాయా ఈ లైఫ్ అంటే మాయా ॥4॥

**రచన: చంద్రబోస్ (4) గానం: అద్నాన్‌సామి, కల్పన**

అ: ఏ జిల్లా ఏ జిల్లా.... ఓ పిల్లా నీది ఏ జిల్లా ॥2॥
ఏ జిల్లా ఏ జిల్లా.... ఒంగోలా ఓరుగల్లా ॥ఏ జిల్లా॥
ఇరవై మూడు జిల్లాలలోన ఏదో ఒకటి నీది అయినా
ఇరవై నాలుగు నీ నడుము కొలత ఐతే చాలులే
ఇరవై ఐదు నిముషాలలోనే కవ్విస్తాను రావే మైనా
ఇరవై ఏడు ముద్దుల్నిపెట్టి తకిట తకిట తకిట తకిట తా॥ఏ జిల్లా॥
నువ్వట్టా జల్లాపూర్ జంక్షన్‌లోకొచ్చేస్తే
నేనట్టా సిగ్గాపూర్ సిగ్నల్‌నే దాటేస్తా
ఆ: నువ్వట్టా మనసాపూర్ సెంటర్‌లో మాటేస్తే
నేనట్టా సరసాపూర్ సెంటర్‌లో వాటేస్తా
అ: కమ్మేస్తాను కోకాకుళంలో రాజేస్తాను రాజమండ్రి
ఊరిస్తాను ఉపేశ్వరంలో ఉడికిస్తానులే
ఆ: మురిపిస్తాను ముద్దాపురంలో చేరుస్తాను సోకునాడ
సాగించాలి హింసాచలంలో తకిట తకిట తకిట తకిట తా
అ: ॥ఏ జిల్లా॥ కో: ఏ జిల్లా..... ఏ జిల్లా...
అ: ఓ....నీలోని అందం చందం అదిరేబాద్‌వుతుంటే
నాలోని ఆత్రం మొత్తం ముదిరేబాద్ అయిపోదా
ఆ: నువ్వట్టా కన్నేకొట్టి గిల్లూరు రమ్మంటే
నేనిట్టా మూటేకట్టి ఒళ్లూరు రాసేస్తా
అ: చంపాపేట సరిహద్దు దాటి పెదవుల పాడు చేరుకుంటా
ఆ పై నేను ఒడివాడలోనే ఒకటవు తానులే
ఆ: పగలే కానీ రాత్రైన గానీ నిదురానగరు వెళ్లనంటా
పక్కలపల్లి పొలిమేరలోనే తకిట తకిట తకిట తకిట తా ॥ఏ జిల్లా॥
ఆ: ఆ జిల్లా ఆ జిల్లా పిల్లోడా నాది ఆ జిల్లా
దాచెయ్‌నా దుప్పట్లోనా మరుమల్లెపూల జిల్లా

**రచన: సాహితి (5) గానం: మాణిక్య వినాయగం, సుమంగళి**

ఆ: పట్టు పట్టు చెయ్యేపట్టు చిన్నదాని చెంగేపట్టు ॥2॥
నన్ను నీలోదాచేటట్టు ఓ బుల్లోడా...హోయ్...
అ: హే.. కట్టుకట్టు చీరేకట్టు కొంటెచూపు దూరేటట్టు...
నోరుకాస్త ఊరేటట్టు... ఓ బుల్లెమ్మా...హే..
ఆ: ఓ...ముద్దుపెట్టి పోయేటట్టు ముక్కుమీద ముద్దేపెట్టు
లేకపోతే నామీదొట్టు ఓ బుల్లోడా
అ: కన్నెబొడ్డు తరిగేటట్టు కన్నె కోతకుంటే ఒట్టు
కోరికంత నా మీదెట్టు ఓ బుల్లెమ్మా
ఆ: మామా అబ్బబ్బా నా ఈడుని కోరేట్టు
అ: హేయ్.... రావె రావె రావె రావె రంగుల రవ్వట్టు
రాతిరొస్తే ఇస్తా నీకు బిస్తరు బొబ్బట్టు.... హోయ్...
ఆ: రయ్యో రయ్యో రయ్యో రయ్యో ఆకలి తీరేట్టు
ఆకులిస్తే పెడతా నీకు సోకుల తాకట్టు ॥పట్టు పట్టు ॥
అ: హే... జున్నుముక్కలా తెగ నున్నగ ఉన్న చెక్కిళ్లు
ఆకువక్కలా నాకు వచ్చెను ఎక్కిళ్లు
ఆ: అన్ని దిక్కులా నన్నుతాకేస్తుంటే నీ కళ్లు తెనే చుక్కలా తీపెక్కెను నాలుకలు
అ: ఒక్కసారి ఒళ్లో వాలమ్మా చందనాల ఓ ముద్దుగుమ్మా
గాలికైనా ఇద్దరిమధ్య చోటే వద్దమ్మా
ఆ: ఒంటరేల తుంటరి మామా జంటకట్టి ఓ చందమామా
గంటకొక కౌగిలిగంట కొట్టేసుకుందామా
అ: రావే రావే రావే రావే చైనా చిలకట్టు జంటకొస్తే ఇస్తా నీకు జపాన్ జాకెట్టు
ఆ: రయ్యో రయ్యో రయ్యో రయ్యో అత్తరు మస్కట్టు
పూసుకొస్తే ఇస్తా నీకు బందరు బిస్కెట్టు ॥పట్టుపట్టు॥
ఆ: వంగమొక్కలా తెగ వంచేస్తుంటే నువ్వట్టా
పొంగులే కదా నా పొంగల్ల వయసంతా
అ: కొంగరెక్కలా కొంగు జారేస్తుంటే నువ్వట్టా
గింగురెక్కదా నా పోకిళ్ల పొగరంతా
ఆ: ఆగడాలు చాలించమంట పొద్దువాలు సందేలపూట
మీగడంత వడ్డించుకుంటా అప్పుడే రమ్మంట
అ: కుందనాల గోరింక పిట్టా అంతదాక ఆగేది ఎట్టా
అందమంతా గిల్లేసుకుంటా ఇప్పుడే ఈ పూట
రావె రావె రావె రావె రావె రావె కన్నా క్యారెట్టు
లగ్గమెట్టి మెళ్లో వేస్తా లగ్గం లాకెట్టు
ఆ: రయ్యో రయ్యో రయ్యో రయ్యో బొమ్మా టీ షర్టు
వేసుకొస్తే విందే ఇస్తా గుమ్మా కట్లెట్టూ ॥పట్టుపట్టు॥

జెమిని ఫిల్మ్ సర్క్యూట్



# శంకర్ దాదా M.B.B.S.

**జయంత్ సి.పరాన్జీ** **దేవీశ్రీప్రసాద్**

## తారాగణం

చిరంజీవి, శ్రీకాంత్, సోనాలిబింద్రే, అంజలా జవేరి, గిరీష్ కర్నాడ్, పరేష్‌రావల్, వెన్నిరాడై నిర్మల, ఎం.ఎస్.నారాయణ, ఆహుతి ప్రసాద్, బెనర్జీ, సూర్య, రోహిత్, శివానంద్, వేణుమాధవ్, నర్సింహారావు, జి.వి., భూపేంద్రసింగ్, తదితరులు

## సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| మాటలు | : | పరుచూరిబ్రదర్స్ |
| పాటలు | : | వేటూరి, చంద్రబోస్, సాహితి, దేవీశ్రీప్రసాద్ |
| కెమెరా | : | కె.దత్తు |
| ఎడిటింగ్ | : | మార్తాండ్ కె.వెంకటేష్ |
| డ్యాన్స్ | : | రాజు సుందరం, హరీష్‌పాయి, చిన్నిప్రకాష్, అశోక్‌రాజ్ |
| ఫైట్స్ | : | విజయన్ |
| ఆర్ట్ | : | అశోక్ |
| పి.ఆర్.ఓ. | : | ఎల్.వేణుగోపాల్ |
| పబ్లిసిటి | : | కృష్ణ డిజిటల్స్ |
| సంగీతం | : | దేవిశ్రీప్రసాద్ |
| నిర్మాణం | : | జెమిని ఫిల్మ్ సర్క్యూట్ |
| దర్శకత్వం | : | జయంత్ సి.పరాన్జీ |



కిరణ్



జయంత్



దేవిశ్రీప్రసాద్



వేటూరి



చంద్రబోస్



సాహితి

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం



చిత్రం
**బ్లాక్ మెయిల్**

రచన
**రాజేంద్రకిషన్**

సంగీతం
**కళ్యాణ్ జీ - ఆనంద్‌జీ**

గానం
**కిశోర్‌కుమార్**

అభినయం
**ధర్మేంద్ర, రాఖీ**







కిశోర్ కుమార్ చాలా మంచి గాయకుడు. నటుడిగా, సంగీత దర్శకుడిగా, దర్శకుడిగా, నిర్మాతగా ఇలా అనేక అవతారాలెత్తినప్పటికీ, మౌలికంగా అతను గాయకుడు. అన్నిటి కంటే అతను బాగా చేసిన పని పాడడమే. అతని పాటలో ఒక పటుత్వం ఉంటుంది. సాధారణంగా వేగంగా నడిచే పాటలు, యాడ్లింగ్ చేసే హాస్య గీతాలు, సంక్లిష్టమైన స్థాయిలలో స్వరాన్ని ఇష్టం వచ్చినట్టు తిప్పాల్సిన గీతాలు (హాఫ్ టికెట్ సినిమాలో ఆడవేషంలో ఉన్న నాయకునికి విలన్‌కు మధ్య సాగే యుగళగీతంలో ఇద్దరికీ కిశోరే పాడిన అద్భుత విన్యాసం గుర్తు తెచ్చుకోండి )- ఇలాంటివి కిశోర్ గళానికి నప్పేవి. సాధారణంగా సుతిమెత్తని గీతాలకు, సున్నిత భావప్రకటనకు కిశోర్‌ని ఎక్కువమంది సంగీత దర్శకులు ఎంచుకునేవారు కారు. తండ్రీ కొడుకులు, ఎస్.డి. , ఆర్.డి.బర్మన్ లు మాత్రం కిశోర్ని సంపూర్ణంగా వినియోగించుకుని అతని సామర్థ్యానికి న్యాయం చేసారు. అలా కిశోర్ చేత సున్నితమైన పాట పాడించిన వారిలో కల్యాణ్ జీ, ఆనంద్ జీని కూడా చెప్పుకోవాలి. వారి సంగీత దర్శకత్వంలోనే గొప్ప పాట అని చెప్పదగిన 'పల్ పల్ దిల్ కే పాస్' కిశోర్ చేత పాడించి , వారు ధన్యులయ్యారు. శ్రోతలకూ మరుపురాని అనుభూతిని మిగిల్చారు. కిశోర్ వర్ధంతి సందర్భంగా ఆ పాటనే అర్థం చేసుకుందాం, ఆస్వాదిద్దాం.

ధరేంద్ర, శత్రుఘ్న సిన్హా, రాఖీలు నటించిన 'బ్లాక్ మెయిల్' చిత్రంలోనిది ఈ పాట. ధర్మేంద్ర, రాఖీకి ప్రేమలేఖ రాస్తాడు. ఆ ప్రేమలేఖను చదువుకుంటూ మానసిక ఉద్విగ్నతకు గురవుతూ, రాఖీ అభినయిస్తున్నపుడు, నేపథ్యంలో ఈ పాట వస్తుంది. అపుడపుడూ ధరేంద్ర ప్రత్యక్షమై పాట పాడుతున్నట్టు, తన సమీపంలో ఉన్నట్టు, రాఖీ భావించుకుని మురిసిపోతూ, సిగ్గుపడుతూ ఆనందిస్తూ ఉంటుంది. మొత్తం మీద ధర్మేంద్ర పాడుతున్నట్టుగా కొంత, కేవలం కిశోర్ నేపథ్యగానంలా, రాఖీ హావభావాల ప్రకటన మాత్రమే కనిపిస్తూ కొంత, ఈ పాట తెరపై అందమైన దృశ్యంగా మనకు కనుల విందు చేస్తుంది. ఇది మూడు చరణాల పాట. సాహిత్య పరంగానూ, సంగీత పరంగానూ, గానం పరంగానూ , ఉన్నత శ్రేణికి చెందిన గొప్ప గీతం.

**పల్ పల్ దిల్ కే పాస్ తుమ్ రెహతీ హో**
**జీవన్ మీఠీ ప్యాస్ యే కెహతీ హో ॥పల్॥**

1 వ చరణం.

**హర్ శామ్ ఆంఖోంపర్ తేరా ఆంచల్ లహరాయీ**
**హర్ రాత్ యాదోంకీ బారాత్ లే ఆయీ**
**మై సాంస్ లేతా హూ - తేరీ ఖుశ్‌బూ ఆతీ హై**
**ఎక్ మెహకా మెహకా సా - పైగామ్ లాతీ హై**
**మేరే దిల్ కి ధడ్‌కన్ భీ - తేరీ గీత్ గాతీ హై ॥పల్॥**

2వ చరణం

**కల్ తుఝుకో దేఖాథా - మైనే అప్‌నే ఆంగన్ మే**
**జైసే కెహ రహీ థీ తుమ్ - ముఝే బాంధో బంధన్ మే**
**యే కైసా రిశ్తా హై - యే కైసే సప్‌నే హై**

బేగానే హోకర్ భీ - క్యూ లగ్‌తే అప్‌నే హై
మై సోచ్ మే రెహతా హూ - డర్ డర్ కే కెహతా హూ ॥పల్॥

3వ చరణం :

తుమ్ సోచోగీ క్యూ ఇత్ నా - మై తుమ్ సే ప్యార్ కరూ
తుమ్ సమ్‌ఝోగీ దీవానా - మైభీ ఇక్‌రార్ కరూ
దీవానోంకి యే బాతే - దీవానే జాన్‌తేహై
జల్‌నే మే క్యా మజా హై - పర్‌వానే జాన్‌తేహై
తుమ్ యూహీ జలాతే రెహనా - ఆ ఆ కర్ ఖాబోంమే ॥పల్ పల్॥

పల్లవి :

పల్ పల్ అంటే అనుక్షణం, క్షణక్షణం. పాస్ అంటే సమీపం, దగ్గర. జీవన్ అంటే జీవితం. మీఠీ అంటే తీయని, ప్యాస్ అంటే దాహం.

అనుక్షణం నువ్వు నా దగ్గరే ఉంటావు
జీవితమంటే తీయని దాహం అని చెబుతూంటావు.

1వ చరణం :

హర్ అంటే ప్రతి. శామ్ అంటే సాయంత్రం; ఆంచల్ అంటే కొంగు . లెహరాయే అంటే ఎగరడం, రెపరెపలాడడం. యాదోంకీ అంటే జ్ఞాపకాల, బారాత్ అంటే ఊరేగింపు. సాంస్ అంటే ఊపిరి. ఖుష్‌బూ అంటే సువాసన. మెహకా అంటే పరిమళభరితమైన. పైగామ్ అంటే సందేశం. దిల్ కీ దఢకన్ అంటే గుండె సవ్వడి.

ప్రతి సాయంకాలం - నా కళ్ళపై నీ కొంగు రెపరెపలు
ప్రతి రేయి - జ్ఞాపకాల ఊరేగింపులు
నేను ఊపిరి పీలుస్తాను - నీ సుగంధం చుట్టుముట్టుతుంది
ఏదో పరిమళభరితమైన సందేశం అందిస్తుంది
నా గుండె చప్పుళ్ళు సైతం - నీ గానం ఆలపిస్తాయి ॥ అనుక్షణం॥

2వ చరణం :

ఆంగన్ అంటే ముంగిలి, ప్రాంగణం, బాంధో అంటే బంధించు, బంధన్ అంటే బంధం, కౌగిలి, రిశ్తా అంటే అనుబంధం; సప్‌నే అంటే కల; బేగానా అంటే పరాయి, అఫ్‌నే అంటే స్వంతం. సోచ్ అంటే ఆలోచన. డర్ అంటే భయం.

నిన్ను చూశాను - నా ముంగిలిలో
నువ్వు అంటున్నావు - నన్ను (బంధంలో) కౌగిలిలో బంధించు అని
ఇది ఎలాంటి అనుబంధం; ఇది ఎలాంటి స్వప్నం
పరాయివైనా స్వంతంలాగే ఎందుకున్నాయి
నేను ఆలోచనలో పడిపోతాను; భయపడుతూ అంటాను ॥అను॥

3వ చరణం :

సోచోగీ అంటే అనుకుంటావు; దీవానా అంటే పిచ్చివాడు, ఇత్‌నా అంటే ఇంతగా, ఇక్‌రార్ అంటే అంగీకారం. బాతే అంటే మాటలు. జల్‌నా అంటే దహించడం; పర్‌వానా దీపం పురుగు. మజా అంటే ఆనందం. యూహీ అంటే ఇలాగే. ఖాబోమే అంటే కలల్లో.

నువ్వు అనుకుంటావు - నేను ఇంతగా నిన్నెందుకు ప్రేమిస్తానని
నన్ను పిచ్చివాడిని అనుకుంటావు - నేనూ ఒప్పుకుంటాను
పిచ్చివాడి మాట - పిచ్చివాళ్లకే అర్థమవుతుంది
దగ్ధం కావడంలోని ఆనందం - దీపం పురుగుకే తెలుస్తుంది
నువ్విలాగే నా కలల్లోకి వస్తూండు- నన్ను దహిస్తూవుండు ॥అను॥

ప్రేయసికి ఒక పురుషుడు ఆత్మార్పణ చేసుకున్న రీతిలో ఎంతో అందంగా కవి ..రాసిన ఈ పాటను కిశోర్ అంతకంటే హృద్యంగా పాడాడు. కిశోర్ 'ఆల్ టైమ్ బెస్ట్' పాటల్లో విధిగా ఉంటే పాట ఇది. దీవానా, పర్‌వానా, బేగానా వంటి మాటలు హిందీ సినీగీతాల్లో, ముఖ్యంగా ప్రేమ ప్రకటించే పాటల్లో అనివార్యమైన శబ్దాలు. శమా పర్ వానా అంటే, దీపం, దీపం పురుగుల మధ్య అనుబంధం స్త్రీ , పురుషుల అనుబంధంగా వర్ణించడం ఉర్దూ కవి సమయాల్లో సర్వసాధారణం. ప్రేయసి సౌందర్య జ్వాలలో పురుషుడు, దీపం పురుగులా సమిధి అయిపోతాడన్నది ఉర్దూ, హిందీ కవులకు ఎంతో ఇష్టమైన అలంకారం. ఇక్కడ కవి ఆమెను నేరుగా శమా అనకుండా, అతన్ని మాత్రం పర్‌వానా అనడంలో కొంత విలక్షణతను చూపాడు. 'నువ్విలాగే దహిస్తూ ఉండు' అనడంలో ఆమె దీపం అన్న భావన సూచ్యమే. మొత్తం మీద అన్నీ పాత ఉపమానాలే, వర్ణనలే వాడినా, చెప్పే విధానంలో కవి నవ్యతను చూపాడు. సాధారణంగా తను ప్రయోగించే మేనరిజమ్స్ ఏవీ లేకుండా కిశోర్ కూడా చాలా చక్కగా గానం చేశాడు.

\- మృణాళిని





# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం



| తమిళం | | తెలుగు |
|---|---|---|
| చిత్రం | : మిన్నలే | చెలి |
| రచన | : తామరై | భువనచంద్ర |
| సంగీతం | : హేరిస్ జయరాజ్ | హేరిస్ జయరాజ్ |
| గానం | : బాంబే జయశ్రీ | బాంబే జయశ్రీ |

ఒకప్పుడు చలన చిత్రాలలో నటించడానికి పాడగలిగి ఉండడం కూడా ఒక అర్హతగా ఉండేది. ఆ తర్వాత నటీనటులకు సంగీతం రాకపోయినా మరెవరో పాడిన పాటలకు తగ్గట్టు పెదవులు కదిలిస్తే చాలనే స్థితి వచ్చింది. ఇటీవల అయితే కొన్ని పాటలు పాడుతున్నవారికీ ఆ పాటలను తెరమీద అభినయిస్తున్న వారికీ ఆ పాట భాష రాకపోవడం వల్ల -పాత్రలకు ఏ 'లాంగ్ షాట్' లోనో 'మిడ్‌లాంగ్‌షాట్' లోను చూపించి పాటల పాట్లనుంచి బయటపడుతున్నారు.



ఎంతో కొంత సంగీతపరిజ్ఞానం ఉన్నవాళ్లు చలనచిత్రాలలో నటించిన కాలంలోనే ఎంతో సంగీత పరిజ్ఞానం వల్ల వాళ్లుకూడా చలన చిత్రాలలో వేషధారణ చేశారు. శాస్త్రీయ సంగీత విద్వాంసులుగా ఎంతో పేరు గడించిన కొందరు నేపథ్యగానము చేస్తూవచ్చారు. బాలమురళీకృష్ణ, ఏసుదాసు, తమిళగాయకుడు శీర్కాళి గోవిందరాజన్ వంటివారు నేపథ్యగాయకులుగానూ ఎంతో పేరు గడించారు. తెలుగు చిత్రాలలో ఎప్పుడో ఒకప్పుడు తమ గళాలు వినిపించిన వారిలో ఓలేటి వేంకటేశ్వర్లు, శ్రీరంగం గోపాలరత్నం, నూకల చినసత్యనారాయణ, పూర్ణచందర్ వంటి శాస్త్రీయసంగీత కోవిదులూ ఉన్నారు.



ఈ తరానికి సంబంధించి శాస్త్రీయ సంగీతంలో విశేషకృషి చేసిన ఉన్నికృష్ణన్, బాంబేజయశ్రీ, నిత్యశ్రీ వంటివారు ఇటీవల కొన్నేళ్లుగా చలన చిత్రాలలో పాటలు పాడి మెప్పిస్తూ వస్తున్నారు.

2001 లో తమిళంలో విడుదలైన 'మిన్నలే' అనే తమిళచిత్రం కోసం బాంబే జయశ్రీ పాడిన 'వశీగరా' అనేపాట తమిళ చలనచిత్ర సంగీత ప్రపంచంలో అలజడిని సృష్టించింది. ఆ చిత్రానికి సంగీతం సమకూర్చిన హేరిస్ జయరాజ్‌కు అదే మొదటి చిత్రం. 'వశీగరా' పాటను రాసినవారు తమిళ కవయిత్రిగా పేరు గాంచిన 'తామరై'. 'వశీగరా' పాట గురించి పత్రికలలో, వెబ్‌సైట్లలో ఎంతో చర్చ కూడా సాగింది. పాట బాణీనీ, జయశ్రీ పాడిన తీరును మెచ్చుకున్నా కొందరు సాహిత్యం అభ్యంతరకరంగా ఉందని అభిప్రాయపడ్డారు.

ఇటీవల కొన్నేళ్లుగా తమిళంలో రచయిత్రుల సంఖ్య పెరుగుతూ వస్తున్నది. చాలామంది యువ కవయిత్రులు- స్త్రీల సమస్యల గురించే కాక స్త్రీత్వం గురించీ , స్త్రీల



శరీర వ్యవస్థగురించీ కూడా కవితలు రాస్తున్నారు. కాగా 'తామరై' రాసిన 'వశీగరా' పాట ఒక యువతి మనోభావాలను వర్ణిస్తున్నదని కొందరు ఆ పాట సాహిత్యాన్ని సమర్థించారు.

'మిన్నల్' అనే తమిళ పదానికి 'మెరుపు' అని అర్థం. 'మిన్నలే' అనే మాటకు సంబోధనపరంగా 'మెరుపా' అని అర్థం. చిత్ర కథానాయిక - కథానాయకుడి జీవితంలోకి ప్రవేశించిన మెరుపు.

తెలుగు, తమిళ చిత్రరంగాలలో గీతాలు రాసిన స్త్రీల సంఖ్య చాలా తక్కువ. అందులోను అనేక గీతాలు అంటే ఏక గీతం కంటే ఎక్కువ రాసిన వారూ మరీ తక్కువ. తెలుగు చిత్రాలకు కోసం కీ.శే.జ్యోతిర్మయి వంటి వారు పాటలు రాసినా, ఆ పాటలు తక్కువే. 'వశీగరా' పాట తర్వాత 'తామరై' అనేక గీతాలు రాశారు.

తామరై రాసిన తమిళగీతం ఇది :

వశీగరా ఎన్ నెంజినిక్క
ఉన్ పొన్ మడియల్ తూంగినాల్ పోదుం
అదే కణం ఎన్ కణ్ణుఱంగ
మున్ జన్మంగలిన్ ఏక్కంగళ్ తీరుం
నాన్ నేశిప్పదుం శ్వాసిప్పదుం
ఉన్ దయవాల్ తానే
ఏంగుగిఱేన్ ఏంగుగిఱేన్
ఉన్ నినైవాల్ నానే
అడై మళైవరుం అదిల్ ననైవోమే
కుళిర్ కాయ్చులోడు సిలనేరం
ఒరు పోర్వైక్కుళ్ ఇరు తూక్కం
కుళు కుళు పొయ్‌గళ్ శొల్లి
ఎనై వెల్వాయే
అదు తెరిందుంకూడ అన్బే
మనం అదైయేదాన్ ఎదిర్ పార్కుం
ఎంగేయుం పోగామల్ దినం వీట్టిలేయే నీ వేణ్డుం
శిలసమయం విళైయాట్టాయ్ ఉన్ ఆడైక్కుళ్ నాన్ వేణ్డుం ॥వశీ॥
దినం నీ కుళిత్తదుం ఎనైత్తేడి
ఎన్ శేలై నుణియాల్ ఉందన్ తలై తుడైప్పాయే
అదు కవిదై
తిరుడన్ పోల్ పదుంగియే దిడీర్ ఎంద్రు
పిన్నాలిరుందు ఎనై నీ అణైప్పాయే
అదుకవిదై
యారేనుం మణికేట్టాల్ అదై శొల్ల క్కూడత్తెరియాదే
కాదలెనుం ముడియినిలే గడిగార నేరం కిడైయాదే

'వశీకరణం' అంటే సమ్మోహన పరచి వశపరచుకోవడం అని అర్థం. తమిళభాషలో 'వశీకరన్' (వశీకరుడు) అంటే ఆకర్షణీయంగా ఉన్నవాడని, మోహింప చేసేవాడనీ అర్థాలు చెప్పుకోవాలి.

తమిళంలో పదం మధ్యలో వచ్చే పరుషాక్షరాన్ని సరళంగా పలికే సంప్రదాయం ప్రకారం 'వశీకరా' అనికాక పాట 'వశీగరా' అని మొదలయింది.

ఈ పాటలోని భావాలు ఇవి :

మనో మోహనా నా ఎద మురిసేలా
నీ బంగారు ఒడిలో పవళిస్తే చాలు
ఆ క్షణమే నేను కనులు మూస్తే (నిద్రిస్తే)
పూర్వ జన్మల కొరతలన్నీ తేలిపోతాయి
నేను ప్రేమించేది శ్వాసించేదీ
నీ దయవల్లనే కదా!
తపిస్తున్నా తపిస్తున్నా
నీ జ్ఞాపకంతో నేనే (నీ స్మరణతో నేనే)
జడివాన కురిస్తే అందులో తడిసిపోయేవాళ్లం
చలిజ్వరంతో కొన్ని సార్లు
ఒక దుప్పటిలో ఇద్దరి నిద్ర (ఇరు నిద్రలు)
చలచల్లని అబద్ధాలు చెప్పి
నన్ను గెలుస్తావు
అది తెలిసికూడా ప్రియా
మనసు దాన్నే ఆశిస్తుంటుంది
ఎక్కడికీ పోకుండా నిత్యము ఇంట్లోనే నీవుండాలి
కొన్ని వేళలలో ఆటగా నీ దుస్తుల్లో నే నుండాలి ॥మనోమోహనా॥
రోజూ నీవు స్నానం చేసి
నను వెదుక్కుంటూ వచ్చి
నా చీర కొసతో నీతల తుడుచుకొంటావుగా -
అది కవిత
దొంగలా నక్కి వచ్చి ఆకస్మికంగా
(నా) వెనుకనుంచి నను నీవు కౌగిలించు కొంటావుగా
అది కవిత
ఎవరయిన వేళ (గంట) ఏమిటని అడిగితే
చెప్పడం కూడా తెలియదే
ప్రేమ అనే ముడిలో గడియారం (చెప్పే) కాలం ఉండదుగా.. ॥మనో॥

నాయిక తనఎదుట ఉన్న నాయకుణ్ణి చూస్తూ ఊహల్లో తేలిపోతుండగా ఆమె మనసు పాడుకునే పాట ఇది. పాట చివర నాయిక ఒకటి రెండు పంక్తులు పాడుతున్నట్టు కనిపిస్తుంది.

'మిన్నలే' చిత్రం కేసెట్లు విడుదల కాగానే 'వశీగరా' పాట ఎంతో ప్రాచుర్యం పొందింది. చిత్రం విడుదలయ్యాక -పాటను చిత్రీకరించిన తీరు తాము ఆశించినట్టుగా లేదని కొందరు విమర్శించారు.

'మిన్నలే' చిత్రాన్ని తెలుగులోకి 'చెలి' పేరిట అనువదించారు. తమిళ చిత్రంలోని 'వశీగరా' గీతం తెలుగులో 'మనోహరా' అనే పల్లవితో వినిపిస్తుంది. తెలుగు పాటను రాసినవారు భువనచంద్ర.

ఆ తెలుగుపాట ఇది :

మనోహరా నా హృదయమునే
ఓ మధువనిగా మలచినానంట
రతీవరా ఆ తేనెలనే

ఓ తుమ్మెదనై తాగి పొమ్మంటా
నా యౌవనమే నీ పరమై పులకించే వేళ
నా ఎదలో ఒక సుఖమే ఊగేనుగా ఉయ్యాల
జడివానై ప్రియా నన్నే చేరుకొమ్మా
శ్రుతి మించుతోంది దాహం
ఒక పాన్పుపై పవళిద్దాం
కసీకసీ పందాలెన్నో ఎన్నో కాసి
నను జయించుకొంటే నేస్తం
నా సర్వస్వం అర్పిస్తా
ఎన్నటికీ మాయదుగా చివురాకు తొడిగే ఈ బంధం
ప్రతి ఉదయం నినుచూసి
చెలరేగి పోవాలీ దేహం
మనోహరా నా హృదయమునే
ఓ మధువనిగా మలచినానంట
సుధాకరా ఆ తేనెలనే
ఓ తుమ్మెదవై తాగిపొమ్మంటా
ఓ ప్రేమా ప్రేమా..
సందేవేళ స్నానం చేసే నన్ను చేరి
నా చీర కొంగుతో ఒళ్లు నువ్వు తుడుస్తావే
అదో కావ్యం
దొంగమల్లే ప్రియా ప్రియా సడిలేక
వెనకాల నుండి నన్ను హత్తుకొంటావే
అదో కావ్యం
నీ కోసం మదిలోన గుడికట్టినానని తెలియదా
ఓసారి ప్రియమార ఒడిచేర్చుకోవా నీ చెలినీ.... ॥మనోహరా॥

తమిళగీతం బాణీని అనుసరించిన ఈ తెలుగు పాట దాదాపుగా స్వతంత్ర గీతంగానే సాగింది. తమిళగీతంలోని భావాలను ఎంతో కొంత మాత్రమే అనుసరించడం ఈ పాట ప్రత్యేకత.

తమిళగీతం పల్లవిలోనే ఒడిలోన పవళించాలనే కోరిక వినవస్తే తెలుగుపాట చివర ప్రియమార ఒడి చేర్చుకోవాలనే వినతి ఉంది. తమిళంలో నాయిక తన ఉనికీ మనికీ అంతా నాయకుడి చలవే అంటున్నది. తెలుగు పాటలో ఇంత తన్మయత్వం లేదు.

తమిళగీతంలో ఉన్నట్టు జడివానలో తడవడం, చలి జ్వరం రావడం తెలుగు పాటలో లేవు. కాకుంటే తెలుగు పాటలో నాయిక నాయకుణ్ణి జడివానలా వచ్చి దాహం తీర్చమంటున్నది. తమిళగీతంలో నాయిక నిత్యమూ ఇంటిపట్టునే ఉండమని కోరినా - తెలుగు పాటలో ఉదయం ప్రస్తావన ఒకటీ, సందెవేళ ప్రస్తావన ఒకటీ కనిపిసున్నాయి.

తమిళగీతంలో నాయకుడు రోజూ స్నానం చేసి తల తుడుచుకోవడానికి చెలిచీర కొస కోసం వస్తాడని ఉండగా తెలుగుపాటలో నాయిక స్నానం ప్రస్తావన ఉంది. తమిళగీతం ఈ తల తుడుచుకోవడమూ, కౌగిలించుకోవడం కవితలు అని చెబితే తెలుగుపాట వాటిని కావ్యాలు అంటుంది. తమిళగీతంలో స్నానం నిత్యం. తెలుగు పాటలో అది సాయంకాలానికి పరిమితం!

తమిళగీతంలో పల్లవి ఎప్పుడూ వినిపించినా ఏ మార్పులేకుండానే వినిపించింది. తెలుగుపాటలో భువనచంద్ర ఒక తమాషా చేశారు. పల్లవి మొదటి సారీ చివరి సారీ 'రతీవరా' అనే సంబోధన ఉన్నా పాట మధ్య 'సుధాకరా' అని వాడడం ఆ తర్వాత తేనె ప్రస్తావన ఉండం.

పాట చిత్రీకరణ ఎట్లా ఉన్నా జయశ్రీ పాట పాడిన తీరు, పాట ఆద్యంతమూ వినిపించే శ్రావ్యమైన సంగీతమూ ఈ పాటకు ఆకర్షణలని చెప్పాలి. ఆ ఆకర్షణలవల్లే పాట తమిళంలోనే కాక తెలుగులోనూ ఎందరినో ఆకట్టుకోగలిగింది.

**- పి.ఎస్.గోపాలకృష్ణ**

# రాజా ఆడియో రివ్యూ

శేఖర్ కమ్ముల కమిట్‌మెంట్ ఉన్న దర్శకుడు. వాణిజ్య సూత్రాలకు కట్టుబడకుండా అనుకున్నది అనుకున్నట్టుగా సహజత్వంతో చిత్రాన్ని తీయాలనే తపన గల దర్శకుడు. ఇదివరకు ఆయన 'డాలర్ డ్రీమ్స్' అనే తెలుగు చిత్రాన్ని తీశాడు. ఆ చిత్రాన్నే గనక చూడవలసిన వాళ్ళందరూ చూసి వుంటే విదేశాల్లో ఉద్యోగాల కోసం వెంపర్లాడి పోవటం - వ్యక్తిలోని విజ్ఞానం పెరగడానికి కావలసిన సదుపాయాలన్నిటినీ సమకూర్చిన మాతృదేశానికి ఆ విజ్ఞానాన్ని తిరిగి ఉపయోగించాలన్న అవగాహన లేని సెల్ఫిష్ జనరేషన్ చేస్తున్న మేథోవలస -ఇవన్నీ కొంత మేరకైనా తగ్గివుండేవి. వాషింగ్టన్ లోని హేవర్డ్ యూనివర్శిటీలో 'మాస్టర్స్ డిగ్రీ ఇన్ ఫిలిం మేకింగ్'కి థీసిస్ కోసం 8సంవత్సరాల క్రితం తయారు చేసుకున్న కథతో శేఖర్ కమ్ముల ఇప్పుడు 'ఆనంద్' అనే సినిమా తీశాడు. గత చిత్రంలో పాటలకు అంతగా ప్రాధాన్యం ఇవ్వని శేఖర్ కమ్ముల ఈ చిత్రంలో పాటల స్వరకల్పనకు అత్యంత ప్రాధాన్యం ఇచ్చాడు. అందుకు కె.ఎం.రాధాకృష్ణన్ అనే యువకుణ్ణి సంగీత దర్శకుడిగా ఎన్నుకున్నాడు.

ఈ రాధాకృష్ణన్ లోగడ హీరో, మేఘం అనే చిత్రాలకు సంగీతాన్ని సమకూర్చాడు. దురదృష్టవశాత్తు ఆ రెండు ఆడియోలు శ్రోతలను చేరవలసిన పద్ధతిలో చేరలేకపోయాయి. అందుకు కారణాలు అనేకం. ఆ రెండు ఆడియోలు పరిశ్రమలోని కొందరు పెద్దల దృష్టికి వచ్చి వుంటే రాధాకృష్ణన్ ఇవాళ డిఫరెంట్ పొజిషన్‌లో ఉండేవాడు. అయితేనేం - ఓర్చిన పసరుకు తేటనీరు -అనే సామెత లాగ ఈ 'ఆనంద్' సినిమాకు సంగీతాన్ని సమకూర్చే అవకాశం అతనిలోని ప్రతిభను పూర్తిస్థాయిలో ఉపయోగించుకోగలిగిన స్వేచ్ఛతో సహా లభించింది. ఏ కళాకారుడికైనా ప్రాథమిక దశలో కావలసింది అదే..! రాధాకృష్ణన్‌లోని ప్రతిభ ప్రశంసార్హమైన స్థాయిలో ఉందని చెప్పడానికి సాక్ష్యం - ఈ చిత్రంలోని పాటలకు వేటూరి అందించిన సాహిత్యమే ! అన్ని పాటలనూ ఆయనే రాశారు.

ఆదిత్య మ్యూజిక్ ద్వారా విడుదలైన ఈ ఆడియో హరిహరన్, చిత్ర పాడిన 'యమునాతీరం సంధ్యారాగం' అనే పాటతో మొదలవుతుంది. ఈ పాటకు 'హంసనాదం' అనే రాగం ఆధారం. ఈ రాగంలో ఎమ్మెస్ విశ్వనాథన్, ఎమ్మెస్‌ను ఆరాధించే ఇళయరాజా, ఇళయరాజాలా చేయగల సామర్థ్యం కలిగిన విద్యాసాగర్ మొదలైన వారు చక్కని ప్రయోగాలు చేశారు. మహారథి కర్ణ (డబ్బింగ్ చిత్రం) లో బాలమురళి, సుశీల పాడిన 'నీవు నేను వలచితిమే నందనమే ఎదురుగా తోచినదే'




విడుదల : ఆదిత్య మ్యూజిక్
వెల : రూ. 38/-

అనే పాట ద్వారా ఎమ్మెస్ ఈ రాగాన్ని రవంత రుచి చూపితే ఇళయరాజా 'హంసనాదమో' అంటూ ఏకంగా ఓ పాటనే చేసేశారు. 'చిత్రం భళారే విచిత్రం' సినిమాలో విద్యాసాగర్ ఈ రాగంలో 'నవ్వుకునే మన యవ్వనమే ఓ పువ్వుల తోటంటా...' అనే ఓ యుగళగీతాన్ని స్వర పరిచారు. 'పెద్దరికం' సినిమాలోని 'ముద్దుల జానకి పెళ్ళికి మబ్బుల పల్లకి' పాటలో సంగీత దర్శకుడు కోటి ఈ రాగాన్ని రేఖామాత్రంగా స్పృశించారు. ఆ తర్వాత ఈ రాగాన్ని పెద్దగా పట్టించుకున్నవారు లేరనే చెప్పాలి. మళ్ళీ ఇన్నాళ్ళకి ఆ రాగంలో పాడుకోదగ్గట్టుగా, సాధన చేస్తే ఆ రాగం మీద పట్టు సంపాదించుకునే వీలుండే ఓ పాట వచ్చింది. హరిహరన్, చిత్ర ఇద్దరూ ప్రాణం పెట్టి పాడేరీ పాటని. ఈ పాటను పాడుకుంటూ ఆ గాయనీ గాయకులిద్దరూ ఎలాపాడారో గమనించ గలిగితే పాటలోని చిన్న చిన్న మలుపుల్ని సైతం ఎంత గొప్పగా వారు ఆవిష్కరించారో తెలుస్తుంది.

ఈపాట ఈపాటికే విజయం సాధించినదనటానికి నిదర్శనం -ఆల్రెడీ కొన్ని ఛానల్స్ వారు తమ ప్రోగ్రామ్స్‌లో టైటిల్ కార్డులు చూపిస్తున్నప్పుడు వాడేసుకోవడమే ! ఈ పాట స్వర రచనలోనూ, పాడించడంలోనూ మాత్రమే కాకుండా ఆర్కెస్ట్రెయిజేషన్ లో కూడా రాధాకృష్ణన్ చాలా శ్రద్ధ వహించాడు. చరణాల్లో -శిథిలంగా విధినైనా చేసేదే ప్రేమ - హృదయంగా తననైనా మలిచేదే ప్రేమ/ శిశిరంలో చలిమంటై రగిలేదే ప్రేమ - చిగురించే ఋతువల్లే విరబూసే ప్రేమ - అనే వాక్యాల దగ్గర ఫాలో అయ్యే తతంగాన్ని కీ బోర్డుకి, రిథమ్స్‌కి పరిమితం చెయ్యకుండా గ్రూప్ వయొలిన్స్‌తో, అనుసరించటం అందుకు నిదర్శనం.

ఈపాట అయిపోగానే ఆడియోని బి సైడ్‌కి తిప్పి వింటే ఇదే ట్యూన్‌లో 'ఎదలో గానం -పెదవే మౌనం' పాట వినిపిస్తుంది. ఈ పాటను కూడా హరిహరన్, చిత్ర పాడేరు. పల్లవిలోనూ, మొదటి చరరణంలోనూ ఈ పాట 'యమునా తీరం- సంధ్యారాగం' పాట కోవలో నడిచినా, రెండో చరణం పూర్తిగా మారిపోతుంది. అలాగే పల్లవి చివర్న మార్పు ఉంది. ఎదలో జరిగిన రసావిష్కరణను తుది బొట్టుదాకా పిండి శ్రోతలకు అందించాలనే తపన ఉంటేనే రిపీట్ సాంగ్‌లా ఉండే సెపరేట్ సాంగ్స్ పుడతాయి. ఇక ఈ 'ఎదలో గానం' పాట రెండో చరణం 'శ్రీగౌరి చిగురించే' పాటకు ముందు వచ్చే బిట్‌ని శాక్సఫోన్ (వాయించింది రాజు) తో, టవిల్ (దాన్ని మనం డోలు అంటాం. వాయించింది సుందర్) తో వెస్టర్న్ టచ్ తో క్లాసికల్‌గా నడిపిన విధానం కమనీయం, గమనీయం.

'వచ్చే వచ్చే నల్లమబ్బుల్లారా గిచ్చేగిచ్చే పిల్లగాలులులారా' పాటలో మెయిన్ ట్యూన్ ఒక్కటే. కాకపోతే సాహిత్యం మారుతుండటం వల్ల ఏక మొత్తంగా విన్నప్పుడు మొనాటనీ ఫీలవం. ఈపాటలో ట్యూన్ , రిథమ్స్ ఒక ఎత్తు అయితే గాయని శ్రేయాగోషాల్ పాడిన పద్ధతి ఒక్కటీ ఒక ఎత్తు. ఒక విధంగా ఈ పాటకు ఆమె ఎసెట్.

ఆడియోలో ఏ సైడు మూడవ పాటగా వచ్చే 'నువ్వేనా నా నువ్వేనా' పాట కంపోజిషన్ పరంగా, ఆర్కెస్ట్రయిజేషన్ పరంగా, గాయనీ గాయకుల పరంగా చాలా గొప్పగా చెప్పుకోదగ్గ పాట. వింటుంటే బాగుండే పాటలు కొన్ని ఉంటాయి. పాడుకుంటూ ఉంటే బాగున్నాయనిపించే పాటలు మరికొన్ని ఉంటాయి. వింటుండగా మనం కూడా పాడితే బావుణ్ణనిపించే పాటలు ఇంకొన్ని ఉంటాయి. ఈ లక్షణాలన్నిటినీ కలగలుపుకొంటూ శ్రోతను లీనం చేసేసుకొని

పాట సగంలోనే 'ఇక పాడకుండా ఉండటం అసంభవం' అనిపించేలా - వింటున్న ఆ శ్రోత చేత అప్రయత్నంగా పాడించే పాటలు అతి అరుదుగా వుంటాయి. అలాంటి పాటల్లో ఈ 'నువ్వేనా నా నువ్వేనా' పాట ఒకటి. శ్రేయాగోషాల్ ఈ పాటను ఎంత బాగా పాడిందో చెప్పటానికి మాటలు సరిపోవు. 'ఆనందమేనా' అంటూ ఆమె అంచెలంచెలుగా హైపిచ్‌కి చేరుకుంటూ ఉంటే గుండె నిజంగా ఆనందంతో ఉప్పొంగిపోతుంది. ఉత్తరాది గాయనీ గాయకులు తెలుగుపాటలు పాడడం పట్ల రకరకాల అభిప్రాయలున్నవారు సైతం 'ఈ అమ్మాయిని మాత్రం ఎల్లల చట్రంలో బిగించవద్దు' అనే ఏకాభిప్రాయానికి వచ్చేస్తారీ పాటను ఆమెను పాడిన విధం చూస్తే! ఆమెతో పాటు ఈ పాటను ఈ చిత్ర సంగీత దర్శకుడు కె.ఎం.రాధాకృష్ణన్ పాడేడు. పాట రెండవ చరణంలో 'గనగసాల కౌగిలింత' అనే పదప్రయోగం ఒకటుంది. పాడిన రాధాకృష్ణన్ గొంతు వింటే గొంతులో గల 'గస' ని గమనించి 'గసగసాల కౌగిలింత ' అనే పదాన్ని వేటూరి కావాలని రాశేరేమోననిపిస్తుంది. గొంతులో 'గస' ఉన్న రాధాకృష్ణన్ గాయకుడిగా 'ఆనందమేనా' అంటూ శ్రేయాగోషాల్ రేంజ్‌లో గొంతెత్తి పాడగలడా అని ఓ చిన్న సైజు అనుమానం లాంటి భావం కలుగుతుంది కూడా. కానీ అతి సునాయాసంగా ఆయన ఆ రేంజ్ కి చేరుకోవడం విన్నాక ఆనందంగా ఊపిరి పీల్చుకుంటాం. (ఇటీవల ఆయన 'హాసం' ఆఫీసుకి వచ్చినప్పుడు ఇదే అనుమానాన్ని వ్యక్తం చేస్తే 'నేను ఇంకా పైకి పాడగలను సార్'అంటూ పాడి వినిపిస్తుంటే చుట్టు పక్కన ఫ్లాట్స్‌లో ఉండేవాళ్లు, 'హాసం' స్టాఫ్‌తో సహా ఆశ్చర్యపోవడం జరిగింది).

లక్కీ ఆలీ పాడిన 'చారుమతీ ఐలవ్ యూ' అనే పాటతో బి సైడు మొదలవుతుంది. సాధారణంగా ఇటువంటి పాటలు - మాటలు వినబడని బీట్‌తో, ఒక వేళ కష్టపడి వినిపించుకోవాలని ప్రయత్నం చేసినా 'ఈ మాటలకు అర్థం వెతకటం వృధా శ్రమ' అని అనిపించే ఉచ్చారణతో మనలోని సహన గుణాన్ని పెంపొందించడానికి దోహదం చేసన్తాంటాయి. అటువంటి ఒత్తిళ్ళకు గురిచెయ్యకుండా మాట వినబడే బీట్ తో వెస్టర్న్ కార్డ్స్‌తో చక్కగా రూపొందిందీ పాట. 'అడిగా నిన్ను వరమిస్తావా - విడిగా నన్ను వదిలేస్తావా, క్షణమే నేను యగమౌతావా - సఖివై నాకు సగమౌతావా' దగ్గర లైట్‌గా యమన్ రాగాన్ని టచ్ చేసిన విధానం కూడా చాలా బావుంది. నేను క్షణం లాంటివాడిని నువ్వు యుగం అయితే ఎలా... దూరం భారం కాదూ... అనే అర్థంలో 'క్షణమే నేను యుగమౌతావా' అంటూ వేటూరి ఇచ్చిన ఎక్స్‌ప్రెషన్ ఇంకా బావుంది.

శ్రేయాగోషాల్, బృందం పాడిన 'తెలిసీ తెలిసీ వలలో పడెనే వయసు' పాట మరో మంచి కంపోజిషన్. మోహనరాగం స్వరాలపై ఎక్కువగా ఆధారపడిన ఈ పాట ఆర్కెష్ట్రయిజేషన్‌లో ఇళయరాజా స్ఫూర్తిని రాధాకృష్ణన్ కొంత తీసుకున్నాడేమోనని అనిపిస్తుంది. ముఖ్యంగా చరణాల మధ్య ఇంటర్లూడ్స్‌ని వింటూ (పాత) 'ఘర్షణ'(డబ్బింగ్) చిత్రంలోని 'నిన్ను కోరీ వర్ణం' పాటలోని ఇంటర్లూడ్స్‌ని గుర్తుకు తెచ్చుకోండి. లేదా రెండు పాటల్నీ పక్క పక్కన పెట్టుకొని వినండి. ఇళయరాజా ప్రభావం ఈ పాటలో అతని మీద ఉందని ఒప్పుకుని తీర్తారు. పాట మధ్యలో 'అది ఒక ఇదిలే ఇదిలే ఏదోలే' అంటూ రెండుసార్లు వస్తుంది. దాన్ని చరణం అనరాదు. అను పల్లవి అసలు కానే కాదు. రెండు చరణాల మధ్య, రెండు ఇంటర్లూడ్‌ల మధ్య ఇలా ఓ రెండు లైన్లు రావడం కొత్తగా, తమాషాగా ఉంది. అయినా బావుంది కూడా ! ఒక్కముక్కలో చెప్పాలంటే 'కొని' యాడదగ్గ, విని పాడదగ్గ ఆడియో ఇది.

# మార్కెట్లో ఉన్న ఆడియో క్యాసెట్లు




విడుదల : అశ్విని లైవ్ క్యాసెట్స్
వెల : రూ. 32/-




విడుదల : ఆదిత్య మ్యూజిక్
వెల : రూ. 36/-




విడుదల : ఆదిత్య మ్యూజిక్
వెల : రూ. 38/-




# ఆల్బమ్

ఆల్బమ్ తిరగేస్తుంటే ఎన్నో జ్ఞాపకాలు చుట్టుముడతాయి. పాఠకుల సేవలో గత ఏడాది ఎలా గడిచిందో సింహావలోకనం చేసుకుంటూ ఆ 24 సంచికలలో మేం అందించిన విషయాలను పాఠకుల సౌకర్యార్థం శీర్షికల పరంగా వర్గీకరించి ఇష్యూ నెంబర్లతో సహా ఇస్తున్నాం. 49 అంటే అక్టోబరు 1-15, 2003, 50 అంటే అక్టోబరు 16-30, 2003, 51 అంటే నవంబరు 1-15, 2003.... ఇలా సాగుతుంది. తొలి నుండి రెగ్యులర్‌గా 'హాసం' చూడనివారికి, తమకు నచ్చిన టాపిక్ ఉన్న పాత సంచికలను కొనగోరే వారికి ఇది ఒక కరదీపిక. 'హాసం' వైవిధ్యం, విస్తృతి అంచనా వేయగోరే వారికి ఒక రెడీ రిఫరెన్స్.

## కర్ణాటక శాస్త్రీయ సంగీతం



### తనికెళ్ళ భరణి



## లలిత సంగీతం

### చిత్తరంజన్ -



నవంబరు 2003



(ఇష్యూ నెం.51,52)



### లలిత సంగీత కారులు



అక్టోబరు 2003



(ఇష్యూ నెం.49,50)

డిసెంబరు 2003



(ఇష్యూ నెం.53,54)



## ఆపాత(ట) మధురం



జనవరి 2004 (ఇష్యూ నెం.55,56)



## తెలుగు సినిమా సంగీతం

### సంగీత దర్శకులు



### గేయరచయితలు



### గాయనీ గాయకులు



## హిందీ సినిమా సంగీతం

### సంగీత దర్శకులు



### గేయరచయితలు



### గాయనీ గాయకులు



## పాప్‌కార్నర్





ఫిబ్రవరి 2004 (ఇష్యూ నెం.57,58)



## అర్థం చేసుకుందాం (హిందీ)



## అర్థం చేసుకుందాం (తమిళం)





మార్చి 2004 (ఇష్యూ నెం.59,60)

ఏప్రిల్ 2004



([illegible] నెం.61,62)



## కొత్త సినిమా పాటల పుస్తకాలు



## పాత సినిమా పాటల పుస్తకాలు



మే 2004



([illegible] నెం.63,64)

## పాటల అనుబంధం



## సీరియల్స్



### క్లాసిక్ రీటోల్డ్
### నవ్వుటద్దాలు- ఆచార్య తిరుమల



### బాపూ రమణీయం



## హాస్యకథా రచయితలు



## హాస్య నాటికలు, స్కిట్‌లు



జూన్ 2004



([illegible] నెం.65,66)

జూలై 2004



(హాసం నెం.67,68)



## కార్టూన్ స్పెషల్స్



## హ్యూమరథం (తెలుగు)



## ఇంటర్వ్యూలు



## ప్రత్యేక వ్యాసాలు



ఆగస్టు 2004



(హాసం నెం.69,70)

## నిక్షిప్త చిత్రాలు



## శీర్షికలు



## 'క'రాజు కథలు

### సింగీతం శ్రీనివాసరావు-



## జంధ్యా మారుతం

### పులగం చిన్నారాయణ -



## సమీక్షణం



సెప్టెంబరు 2004



(హాసం నెం.71,72)



# నిదురమ్మకు నివాళులర్పించి శాశ్వతంగా నిదురపోయిన బి.గోపాలం

'చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా.... గతమెంతో ఘనకీర్తిగలవోడా..' పాట వినగానే మనకు ముందు గుర్తొచ్చేది ఆ పాట రాసిన ప్రముఖ కమ్యూనిస్టు యోధుడు వేములపల్లి శ్రీకృష్ణ. ప్రతి తెలుగువాడూ ఎంతో గర్వంగా చెప్పుకునే ఈ పాటకు ఇంతటి కీర్తి రావటానికి కారణమైన వారు - ఆ పాటను స్వరపరిచి, ప్రజానాట్యమండలి ద్వారా జనాల గుండెలలోకి చొచ్చుకుపోయేటట్లు గానం చేసిన వారు - బి.గోపాలం.

'నడిరేయి ఏ జాములో స్వామి నిను చేర దిగివచ్చునో తిరుమల శిఖరాలు దిగివచ్చునో.....'(రంగులరాట్నం), 'కదిలింది కరుణరథం' (కరుణామయుడు), 'అతడే నా జతగాడు'(పెద్దలుమారాలి), 'రామనీల మేఘశ్యామా' (రామాంజనేయ యుద్ధం) తదితర అజరామరమైన పాటలద్వారా ఆంధ్రప్రేక్షక శ్రోతల గుండెల్లో చిరస్థాయిగా వెలుగొందేలా తనకంటూ ఓ ముద్రను ఏర్పరచుకున్న సంగీత దర్శకుడు బి. గోపాలం. వయొలినిస్ట్‌గా, ఘంటసాల, టి.వి.రాజు ల సహాయకునిగా అందరికీ చిరపరిచితుడైన బి.గోపాలం సెప్టెంబరు 22న మరలిరాని లోకాలకు తరలిపోయారు. ఆయన స్మృత్యర్థం...

1927 వ సంవత్సరం గుంటూరు జిల్లా తుళ్లూరులో బి.గోపాలం జన్మించారు. వీరిది సంగీత కళాకారుల కుటుంబం. దానికితోడు గోపాలం తండ్రి రామదాసు మంచి హరికథా కళాకారుడు. అందువల్లే గోపాలం 12 సంవత్సరాల వయసులోనే వీరి నివాసాన్ని విజయవాడకు మార్పించి ప్రఖ్యాత వయొలిన్ విద్వాంసులు బ్రహ్మయ్య శాస్త్రిగారి వద్ద వయొలిన్, గాత్ర శిక్షణల నిప్పించారు.

1944 లో దుగ్గిరాలకు చెందిన కొండపనేని బలరామయ్యగారి ప్రోత్సాహంతో గుంటూరు జిల్లా ప్రజానాట్యమండలిలో చేరారు గోపాలం. ఆ సమయంలోనే వేములపల్లి శ్రీకృష్ణ రాసిన 'చెయ్యెత్తి జై కొట్టు తెలుగోడా....', 'పలనాడు వెలలేని మాగాణిరా...' పాటలను వయొలిన్ సహకారంతో అనేక సభల్లో పాడటం జరిగింది. తరువాత రోజుల్లో గోపాలం చేసిన ట్యూన్‌లోనే ఘంటసాల 'పల్లెటూరు' సినిమా కోసం'చెయ్యెత్తి జై కొట్టు తెలుగోడా...' పాట పాడగా ఎన్.టి.ఆర్.పై చిత్రీకరించటం విశేషం.

1948లో ప్రజానాట్యమండలి రాష్ట్ర దళంలో చేరిన గోపాలం అహ్మదాబాద్‌లో జరిగిన అఖిలభారత ప్రజానాట్యమండలి సమావేశాల్లో పాల్గొన్నారు. తెలంగాణా ఉద్యమం ప్రబలంగా ఉన్న ఆ రోజుల్లో తెన్నేటి సూరి రచించిన 'బ్రతుకంతా భారం, క్రూరం', సోమసుందరం రచించిన 'ఖబడ్దార్ నైజాం పాదుషా', శ్రీశ్రీ రచించిన 'పొలాలనన్ని హలాలు దున్ని...' మొదలైన గేయాలతో పాటు తాను స్వయంగా రచించిన ' లేవరా కార్మికా, లేవరా కర్షకా....' పాటలను మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, కర్నాటి లక్ష్మీనరసయ్య వంటి ప్రముఖులతో కలిసి పాడి ముఖ్యగాయకునిగా వెలుగొందారు.

ఆ సంవత్సరమే గోపాలం విజయవాడ ఆకాశవాణిలో గాయకునిగా ప్రవేశించారు. 'ఎంకి-నాయుడు బావ', 'భక్తరామదాసు', దేవులపల్లి కృష్ణశాస్త్రి 'ధనుర్దాసు' లతో పాటు విశ్వనాథ సత్యనారాయణ గారి సంగీతరూపకాలు, గేయాలెన్నింటినో ఆయన గానం చేశారు. ఇదే సమయంలో అక్కడ గాయనిగా పనిచేసే రేణుకతో పరిచయం అవటం, అది కాస్తా పరిణయానికి దారి తీయటం జరిగింది.



బి.ఎన్.రెడ్డి, పాలగుమ్మి పద్మరాజు, దేవులపల్లి కృష్ణశాస్త్రి ఎస్.రాజేశ్వరరావు, బి.గోపాలం

ప్రముఖ దర్శకుడు తాతినేని ప్రకాశరావు ఆహ్వానం మేరకు 1951, డిసెంబర్ 21న మద్రాస్ వెళ్లి, 1952 జనవరి1న ఘంటసాల వద్ద అసిస్టెంట్‌గా ఉద్యోగం సంపాదించిన గోపాలం 'పరోపకారం', 'పల్లెటూరు', 'బ్రతుకుతెరువు', ఆ తరువాత టి.వి.రాజు వద్ద 'తోడుదొంగలు', 'జయసింహ', 'నిరుపేదలు' తదితర చిత్రాలకు పనిచేశారు. ఆ సమయంలోనే విజయవాడ లిటిల్ థియేటర్ అధిపతి కొప్పరపు సుబ్బారావు ఓ పాట ఇచ్చి ట్యూన్ కట్టమనటం, అది ఓకే కావటంతో 'పేదరైతు' సినిమా ద్వారా సంగీత దర్శకునిగా పరిచయం అయ్యారు. తాను సంగీత దర్శకుడైన వైనాన్ని గుర్తుతెచ్చుకుంటూ "రాజరాజేశ్వరి ఫిలిం కంపెనీలో కవిగా పనిచేసే సుబ్బారావుగారు నాకు పాట ఇచ్చి ట్యూన్ కట్టమన్నారు. ఆ తరువాత రోజు ఆ పాటను నిర్మాత, దర్శకులు నాగభూషణం, కన్నాంబ, ఎస్.వరలక్ష్మి గార్ల ముందు పాడి వినిపించాను. అందరూ ఆ పాట బాగుందని, ఆ సినిమాకు తీసుకున్నారు. 'సత్యానికి జై అహింసకు జై.... పేద రైతుకు జైజై...' అంటూ సాగే ఆ పాటను జిక్కి, కృష్ణవేణిలు పాడారు'' అంటూ అదే సమయంలో తాను హెచ్.ఎం.వి.సంస్థ కోసం శ్రీశ్రీ రాసిన 'అంతేలే పేదల గుండెలు', కొనకళ్ల వెంకటరత్నం గారి 'చూపులో సిరి చిందువాడా' అనే గేయాలు పాడానని, వాటిని కె.వి.మహదేవన్ రికార్డు చేయటం జరిగిందని తెలిపారు.

సినీ సంగీత రంగంలో ప్రవేశించిన మూడు సంవత్సరాలలోనే సంగీత దర్శకుడయ్యే అరుదైన అవకాశం దక్కించుకున్న గోపాలం, కెంపరాజ్ ద్విభాషా చిత్రంగా నిర్మించిన 'నలదమయంతి' చిత్రం కోసం అద్భుతమైన వరుసల్ని చేశారు. ఈ చిత్రం ద్వారానే చిత్తూరు.వి.నాగయ్య గారికి తొలిసారిగా ఘంటసాల ప్లేబాక్ పాడారు. ఇదే చిత్రంలో గోపాలం నారద పాత్ర పోషించటం ఓ విశేషమైతే, భానుమతంటే సంగీత దర్శకులందరూ భయపడే రోజుల్లో గోపాలం చేసిన పాటల్ని మెచ్చుకుని ఆవిడ ప్రోత్సహించటం మరో విశేషంగానే చెప్పుకోవాలి. ఆ తరువాత మునసబుగారి అల్లుడు, విజయశంఖం, రౌడీరంగడు, పెద్దలు మారాలి, ఒక అమ్మాయి కథ, స్వాతంత్ర్యం మా జన్మహక్కు తదితర చిత్రాలతో పాటు పలు కన్నడ, హిందీ, తమిళ చిత్రాలకు కూడా సంగీతాన్నిందించారు.

సంగీత దర్శకత్వం వహిస్తూనే ప్లేబాక్ సింగర్‌గా కూడా గోపాలం మంచి పేరు సంపాదించారు. అనురాగం, కొల్లేటి కాపురం, ఈడుజోడు, పంతాలు-పట్టింపులు తదితర సినిమాలలోని పాటలతో పాటు 'శ్రీ కృష్ణార్జున యుద్ధం'లోని 'అంచెలంచెలు లేని మోక్షము చాలా కష్టమే భామిని...'(స్వర్ణలతతో కలిసి),

'రంగులరాట్నం'లో 'వెన్నెల రేయి చందమామ వెచ్చగనున్నది మామ...'(జానకితో కలిసి) పాటలు అత్యంత ప్రజాదరణ పొందాయి.

సంగీత దర్శకునిగా కేవలం సినిమాలకు మాత్రమే పరిమితం కాలేదు గోపాలం. నాగభూషణంకు నటునిగా చక్కటి గుర్తింపును తీసుకువచ్చిన 'రక్త కన్నీరు' నాటకానికి గోపాలం సంగీతం సమకూర్చటం, అదే గ్రామ్‌ఫోన్ రికార్డుగా వెలువడటం జరిగింది. ఆ తరువాత కలికాలం, పాపంపండింది, నాటకాల రాయుడు, బికారి రాముడు(దీనినే సినిమాగా తీశారు) తదితర నాటకాలకు చక్కటి సంగీతాన్నం దించారు. ముఖ్యంగా 'బికారి రాముడు' కోసం ఈయన అందించిన పాటలు ఎంత ప్రజాదరణ పొందాయో తెలిసిందే. శ్రీరంగం గోపాలరత్నం పాడిన 'నిదురమ్మా....' పాటను ఎవరైనా మరచిపోగలరా!

సినిమా రంగంలో కొంత గ్యాప్ ఏర్పడిన తర్వాత కూచిపూడి ఆర్ట్ అకాడమి ప్రిన్సిపాల్ వెంపటి సత్యం ఆధ్వర్యంలో దేశంలోని వివిధ పట్టణాలతో పాటు అమెరికా తదితర దేశాలలో సంగీత నృత్యరూపకాల్ని అందించారు గోపాలం. శ్రీనివాస కళ్యాణం, రుక్మిణీ కళ్యాణం, పారిజాతాపహరణం, చండాలిక లతో పాటు దక్షిణ భారత దేశంలోని అనేక పట్టణాలలో ప్రధాన ఆకర్షణగా నిలిచిన 'మేనక - విశ్వామిత్ర' నృత్య రూపకానికి సంగీతంతో పాటు నేపథ్యగాత్రం గోపాలమే సమకూర్చారు.

మంగళంపల్లి బాలమురళీకృష్ణ, ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, ఎన్.జానకి, వాణీ జయరాం, పి.సుశీల, బొంబై సిస్టర్స్ పాడిన భక్తి గీతాల క్యాసెట్లెన్నింటికో ఆయన సంగీతం సమకూర్చటమే కాదు వర్ధమాన గాయకుడు వందేమాతరం శ్రీనివాస్(ఇప్పుడు సంగీతదర్శకుడు) వంటివారినెందరినో ఆయన ప్రోత్సహించారు.

నాలుగు దశాబ్దాల పాటు సంగీత రంగానికి, ముఖ్యంగా సినీ సంగీత రంగానికి ఎనలేని సేవలను అందించిన గోపాలం మృతి తీరని లోటు. ■

**చిత్రం: బికారిరాముడు సంగీతం: బి. గోపాలం**
**రచన: పాలగుమ్మి పద్మరాజు గానం : శ్రీరంగం గోపాలరత్నం**

నిదురమ్మా నిదురమ్మా
కదలీ వేగమె రావమ్మా
నిదురమ్మా నిదురమ్మా
కదలీ వేగమె రావమ్మా
బ్రతుకున బాధల
బరువు తీర్చగా
మదిలో రగిలే మంటలార్పగా ॥నిదురమ్మా॥
పాలమబ్బుల పాన్పువేసి
నీలాల తెరపైన మూసి ॥పాల॥
గాలి వీవన పూని హాయిగా
జోలలు పాడి పోవమ్మా ॥నిదురమ్మా॥
కలతలతో నాకన్నతండ్రి ॥కలతతో॥
ఆకులపడి శాంతిసుఖాల నెరుగడు
అలసట తీర్చి తీయని కమ్మని
కలల తేల్చి కాపాడగరమ్మా ॥నిదురమ్మా॥

**చిత్రం: శ్రీకృష్ణార్జునయుద్ధము సంగీతం: పెండ్యాల నాగేశ్వరరావు**
**రచన: పింగళి నాగేంద్రరావు గానం : బి.గోపాలం, స్వర్ణలత**

బ్రహ్మచారి : అంచెలంచెలు లేని మోక్షము చాలా కష్టమె భామినీ
చంద్రిక : కష్టమైనను ఇష్టమేనని కోరి నిలచితి చినమునీ
బ్రహ్మచారి : అయిన కుదురుగ ఎదుట కూర్చుని గాలి గట్టిగ పీల్చుమా
చంద్రిక : స్వామీ - స్వామీ
బ్రహ్మచారి : ఏమి? ఏమి?
చంద్రిక : నేను పీల్చినగాలి నిలువక అకటా మీపై విసిరెనే
అకట మీపై విసిరెనే
బ్రహ్మచారి : అందుకేమరి ॥అంచెలంచెలు॥
బ్రహ్మచారి : అయిన కన్నులు మూసి చూపును
ముక్కుకొనపై నిలుపుమా
చంద్రిక : స్వామీ - స్వామీ
బ్రహ్మచారి : ఈ మారేమి?
చంద్రిక : అచట నిలువక చూపులన్నీ అయ్యో మీపై దూకెనే
అయ్యోమీపై దూకెనే
బ్రహ్మచారి : అదేమరి ॥అంచెలంచెలు॥

**చిత్రం : బికారిరాముడు సంగీతం : బి. గోపాలం**
**రచన : పాలగుమ్మి పద్మరాజు గానం : బి.గోపాలం**

నిదురమ్మా నిదురమ్మా
కదలీ వేగమె రావమ్మా
నిదురమ్మా నిదురమ్మా
కదలీ వేగమె రావమ్మా
ఒంటికి సుఖమే లేదు
కన కంటికి కునుకే రాదు
ఈ ఇంటికి దేవత మాయమ్మ
ఇటువంటిది జగమున లేదమ్మా ॥నిదురమ్మా॥
తమ్ముని మీదే అమ్మకు ధ్యానం
అమ్మంటే నాకెంతో ప్రాణం
నెమ్మది కూర్చే నిద్దురనిచ్చే
అమ్మలకమ్మవు నీవమ్మా ॥నిదురమ్మా॥
ఇన్నాళ్లకు ఈ కన్నతల్లి
నా పున్నెము పండగా దొరికినదీ ॥ఇన్నాళ్లకు॥
సున్నితమైన అమ్మ మనసులో
ఉన్న అశాంతిని బాపగదమ్మా ॥నిదురమ్మా॥

**చిత్రం : రంగుల రాట్నం సంగీతం: రాజేశ్వరరావు, గోపాలం**
**రచన: కొసరాజు గానం : జానకి & బి.గోపాలం**

జిమ్మీ: వెన్నెలరేయి చందమామ
వెచ్చగనున్నది మామ
మనసేదోలా గున్నది
నాకేదోలా గున్నది
వాసు: తీరిచి వెన్నెల కాయువేళ
దోరవయసులో పిల్లా
నీకాలాగే వుంటది
మనసాలాగే వుంటది
జిమ్మీ:చల్లనిగాలి తోడురాగా
సైగలతో నువు చూడగా
కనుసైగలతో వలవేయగా
గుండెలదరగా నీతో చాటుగా
గుసగుసలాడగ సిగ్గౌతున్నది ॥వెన్నెల॥
వాసు: నడకలతోటి వియ్యమంది
నవ్వులతో నను పిల్వగా
చిరునవ్వులతో పక్క నిల్వగా
చిన్ననాటి ఆ సిగ్గు ఎగ్గులు
చిన్నబుచ్చుకొని చిత్తైపోవటే ॥తీరిచివెన్నెల॥
జిమ్మీ:తీయ తీయగా సరసమాడి
చేయి చేయి కల్పుతూ
మన చేయి చేయి కల్పుతూ
మాటలతో నువు మత్తెక్కించితే
మనసే నాతో రాలేనన్నదోయ్ ॥వెన్నెల॥

# తాతా ధిత్తై తధిగిణతోం

సీరియల్ 21

- జీడిగుంట రామచంద్రమూర్తి

| పాత్రలు | నటీనటుల సజెషన్ |
|---|---|
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్విని | - శ్రియ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో తిలకించండి.



## జరిగిన కథ

**విష్ణుమూర్తి అనే బిజినెస్‌మెన్ కూతురు అశ్వని తనతోపాటు కాలేజీలో చదువుతున్న పల్లెటూరి యువకుడు శ్రీరామ్‌ను ప్రేమించింది. ఆమె ఇచ్చిన ధైర్యంతో చండశాసనుడైన తండ్రి వీరభద్రాన్ని ఎదిరిస్తాడు శ్రీరామ్. వీరభద్రం వల్ల గతంలో అవమానం పొందిన విష్ణుమూర్తి వేనల్లుడు గోపాలానికి కూతుర్ని ఇద్దామనుకున్నా అశ్విని ఆత్మహత్యాప్రయత్నంతో భయపడి శ్రీరామ్‌తోనే పెళ్లి జరిపిస్తాడు. వారి శోభనం జరగడానికి కొన్ని గంటల ముందు ఓ సాధువు ఎక్కడినుండో వచ్చి కోడలు గర్భం దాలిస్తే నీకు చావు తప్పదని వీరభద్రాన్ని హడలగొడతాడు. దాంతో కొత్తదంపతులు కలవకూడదని ఆంక్షలు విధిస్తాడు వీరభద్రం!**

**- ఇక చదవండి**

రోజులు ఎప్పటిలాగానే గడుస్తున్నాయి...! శ్రీరామ్, అశ్వినిలకు మాత్రం చాలా దుర్భరంగా గడుస్తున్నాయి..ఆకలి దంచేస్తుంటే, అన్నానికి ఆహ్వానించి -అరిటాకులో అన్నీ వడ్డించి -తినటానికి వీల్లేదంటూ మూతికి 'ప్లాస్టరు' అతికిస్తే ఎలా వుంటుంది?... కళ్ళముందు 'కుప్పగా' -అందాన్ని ఆరబోసి.. చూసేందుకు వీల్లేదంటూ- కళ్ళకు గంతలు కడితే ఎలా వుంటుంది?..

రవీంద్రభారతిలో జరుగుతున్న బాలమురళీకృష్ణ కచేరీకి తీసుకెళ్లి - వినటానికి వీల్లేదు పొమ్మంటూ చెవుల్లో సీసం కరిగించి పోస్తే ఎలా వుంటుందీ...? సరిగ్గా వాళ్ళిద్దరి పరిస్థితీ అలాగే వుంటోంది.

పెళ్లయి మూడు నెలలు గడిచిపోతున్నా -ఆ 'మూడురాత్రుల ముచ్చట' ఇంకా తీరక పోయేసరికి - వాళ్ళింకా 'కొత్త దంపతుల్లాగానే మిగిలిపోయారు. 'మూడ్' వచ్చినపుడు భార్యను ముద్దు పెట్టుకునేందుకైనా వీలు కల్పించకుండా శ్రీరామ్‌ని హద్దుల్లో వుంచే ప్రయత్నాలు చేస్తున్నాడు వీరభద్రం.

'వాసం' ఒక్కటే అయినా -సహవాసానికి ఆస్కారం లేకుండా - ఇద్దరికీ వేర్వేరు గదుల్లో నివాసాలు ఏర్పాటు చేశాడు.. దాంతో వాళ్ల 'వియోగబాధ'ను భరించలేక విలవిల్లాడి పోతున్నారు...

'విరహంలో సుఖం వుందని' చెప్పిన 'కవివాక్కును' -'అందని పళ్లు పులుపు' అనే సామెతను ముడిపెట్టి - విరహంలో కేవలం విషాదం మాత్రమే వుంటుందని బాత్‌రూంలో స్నానం చేస్తున్నప్పుడల్లా.. బయటెక్కడో వున్న అశ్వినికి వినిపించేలా పాడుకుంటున్నాడు శ్రీరామ్.

'అంతా భ్రాంతియేనా - పెళ్ళంటే ఏడాది ఎడబాటేనా- ఆశా నిరాశేనా - మిగిలిందీ ఒంటరి పడకేనా ?' -అంటూ అశ్విని కూడా ప్రతిరాత్రీ తన 'బెడ్రూ'ం లో సింగిల్ కాట్ మీద పడుకుంటూ, హాల్లో వుండే శ్రీరామ్‌కి వినిపించేలా వరసకట్టి -పాడే ప్రయత్నం చేస్తోంది.. పాటలో అపశ్రుతులు ధ్వనించినా -అందులో భావానికి శ్రీరామ్ ఆవేశపడిపోయి, అప్పటికప్పుడు అశ్విని దగ్గరకు వెళ్లిపోయి- ఆమె కౌగిలిలో వాలిపోయి- సేదతీరాలనుకునేవాడు !. ... కానీ 'సెన్సార్ ఆఫీసరు' లాగా పక్కనే తండ్రి కనిపించేసరికి తన 'అడల్ట్ ఆలోచనలకి' - 'యు' సర్టిఫికేట్ ఇచ్చేసుకుని -తండ్రి మూర్ఖత్వాన్నీ -తన అసమర్థతనీ జాయింటుగా తిట్టుకుంటూ -నిద్రలోకి జారుకునేవాడు....

వాళ్ళ దురవస్థను గమనించిన పార్వతమ్మ - 'కరవమంటే కప్పకు కోపం- విడవమంటే పాముకి కోపం' -అనే తరహాలో, అటు భర్తకు నచ్చచెప్పలేక- ఇటు నూతన దంపతుల విరహవేదన చూడలేక- దిక్కుతోచని పరిస్థితిలో పడిపోయింది..

ఆఖరికి ఆ ఇంట్లో పనిచేస్తున్న నారాయణ కూడా శ్రీరామ్ పరిస్థితిని చూసి జాలిపడేవాడు... ఏడాది కాలం ఎప్పుడు పూర్తవుతుందా, భార్యభర్తల మధ్య ఆంక్షలు ఎప్పుడు తొలిగిపోతాయా, వీరభద్రం ఎప్పుడు తాతవుతాడా, మనవడు పుట్టుకొచ్చి 'ధిత్తై-తదిగిణతోం' అంటూ - తాతగారి వీపుమీద ఎప్పుడు మోతమోగిస్తాడా అనుకుంటూ అసహనంగా ఆలోచిస్తున్నాడు.

ఆ రోజు ఉదయం తొమ్మిది గంటలవేళ - రేడియోలో,'హలో ఎఫ్.ఎమ్.' కార్యక్రమాన్ని వింటోంది అశ్విని.. అందులో ఎవరో శ్రోతలు కోరిన మీదట - అనౌన్సర్లు- 'ఒంటరిగా వున్నావంటే ఒంటికి మంచిది కాదు' అనే పాట వినిపిస్తున్నారు.

ఖర్మం చాలక ఆ పాట వీరభద్రం చెవినకూడా పడింది...పనీపాటూ లేకుండా, శ్రీరామ్ ఇంట్లోనే ఒంటరిగా కూర్చుంటే -అతని ఒంటి మీదున్న తుంటరి వయసు-మనసును అల్లరి పెట్టి -ఆలోచనల్ని అడ్డదారి పట్టిస్తాయేమోనన్న భయంకలిగింది.. వెంటనే ఓ నిర్ణయానికొచ్చాడు..

స్కూలుకి వెళ్ళగానే 'మేనేజింగ్ కమిటీని సమావేశపరిచాడు... తనకు వయసు పైబడిందని కనుక, వారసత్వపు హోదాలో, శ్రీరామ్‌ని ఆ స్కూలుకి మేనేజరుగా నియమిస్తూ, ఓ తీర్మానాన్ని ప్రవేశపెట్టాడు... కమిటీ సభ్యులంతా దాన్ని ఆమోదించారు... సాయంత్రం స్కూలు నించి ఇంటికి తిరిగిరాగానే -'అప్పాయింటుమెంటు ఆర్డరు' శ్రీరామ్ చేతికి అందించాడు..

''రేపటినించీ పాఠశాలకు వచ్చి అఘోరించండి! అక్కడి వ్యవహారాలన్నీ ఇకమీదట తమరే పర్యవేక్షించాలి'' అన్నాడు.

శ్రీరామ్ గొంతులో పచ్చివెలక్కాయ పడినట్టయింది...ఎదిరించి బదులు చెప్పే సందర్భం కాకపోవటంతో- వచ్చిన కోపాన్ని అణచుకునే మార్గంలేక, కసిగా గోళ్లు కొరుక్కున్నాడు.. 'ఒంటి సుఖాన్ని' ఎలాగూ దూరం చేశాడు... ఇప్పుడు స్కూల్లో ఉద్యోగం ఇచ్చి, కంటిచూపు'కి కూడా దూరం చేసినందుకు -తండ్రిని మనసులోనే కసిగా తిట్టుకున్నాడు..

మర్నాడు పొద్దున్న -టవల్ అందించే వంకతో, పెరట్లో నుయ్యి దగ్గర స్నానం చేస్తున్న శ్రీరామ్ దగ్గరకు వెళ్లింది అశ్విని...

"పెళ్ళవగానే... ఎంచక్కా నువ్వు టౌనుకొచ్చి, మా ఇంట్లోనే వుంటూ, మా డాడీ బిజినెస్ వ్యవహారాలన్నీ చూసుకుంటావని నేనెంతో ఆశపడితే - మావయ్యగారు ఇలా చేశారేమిటి శ్రీరామ్"? అంటూ దీనంగా అడిగింది.

"బాధపడకు అశ్వినీ! మా నాన్న సంగతి నీకు తెలుసు కదా!... ఇప్పటికే ఆయన్ని ఎదిరించి -నిన్ను పెళ్లిచేసుకున్నాను. ఇప్పుడు, ఈ పరిస్థితుల్లో ఆయన్ని మళ్లీ ఎదిరించి - మకాం మారుస్తానంటే మండిపడతారు!... ఆయనసలే గుండె జబ్బుమనిషి.... ఓపిక పట్టాలి.. తప్పదు!" అన్నాడు శ్రీరాం గాఢంగా నిట్టూర్చి....

ఆ రోజునుంచీ తను కూడా తండ్రితో పొద్దున్న



నక్కలుకి వెళ్లి మళ్లీ సాయంత్రానికి తిరిగివస్తున్నాడు...

మావగారి పోకడల్ని చూస్తున్న అశ్వినికి ఒళ్లు మండిపోతోంది... అయినా కొత్తకోడలుగా - ఆయనకు ఎదురు చెప్పే సాహసం చేయలేక - ఓసారి పార్వతమ్మ దగ్గర ఆ ప్రస్తావన తెచ్చింది..

"మావయ్యగారితో మీరెలా వేగుతున్నారో అర్థం కావటం లేదు !" -అంది

"ఏం చేస్తాం తల్లీ ?.. అలవాటైపోయింది!.. పెళ్ళయిన ఆర్నెల్లవరకూ -నేనసలు.. పడగ్గదిలో తప్ప -వేరే సమయాల్లో ఆయన కంటపడేందుకు భయపడిపోయేదాన్ని .. ఆ తర్వాత పిల్లలు పుట్టుకొచ్చాక- వాళ్ల పెంపకం ధ్యాసలో పడి, ఆయనగార్ని పట్టించుకోవటం మానేశాను...!"

"పెళ్లయ్యాక, మిమ్మల్ని కూడా ఇలాగే, ఏడాదో, రెండేళ్లో మావయ్యగారికి దూరంగా వుండమని ఆంక్షలు పెట్టుంటే-మీరేం చేసుండేవారు?" సూటిగా అడిగింది అశ్విని.

పార్వతమ్మ జవాబు చెప్పలేక తలవంచుకుంది.

అపుడే పొలంనించి ధాన్యం బస్తాలు తీసుకొచ్చిన నారాయణ అటు వెడుతూ ఆ మాటలు విన్నాడు-

"బలేగా అడిగేరు సిన్నమ్మగోరూ!.. దానికి జవాబు నే సెప్తా ఇనండి... ఆరోజుల్లో మొగుడు ఇంట్లో తిరుగుతావుంటే - పెళ్లాం అసలు వంటింటి గడపదాటి బయటకు వచ్చేది కాదంట.... ! అయ్యగోరు సెప్తూంటారు,.. కానీ ఇపుడు రోజులు మారిపోయాయి తల్లీ.. ఈ రోజుల్లో పెళ్లాలు, మొగుళ్ళని కొంగున ముడేసి తిప్పుకుంటున్నారు.. ఏకంగా పేరెట్టి పిలుస్తున్నారు.. అమెరికాలో అయితే మొగుణ్ణి 'అరే,ఒరే' అని కూడా అంటారంట... మొన్నామధ్యేన ఓ'టీవీ సీరియల్'లో చూశా!.. కనక, అయ్యగోరి చాదస్తం మాటల్ని పట్టించుకోమాకండి!... ఓ మంచిరోజు సూసుకుని -అబ్బాయిగోరూ, తమరూ 'హనీమూన్' కి ఎల్లిపొండి!" అన్నాడు.

ఆ మాటలు విన్న పార్వతమ్మకు అరికాలి మంట నెత్తికెక్కింది..

"ఒరేయ్ నారిగా... ! నువ్ నోర్ముయ్... ! నువ్వు కూడా సలహాలివ్వటమేనా?.. వెనకటికి నీలాంటివాడే, చనువిస్తే చంకనెక్కి కూచున్నాట్ట.!.. నా ముందు వాగేవ్ కనక సరిపోయింది.. నీ మాటలు అయ్యగారే వినివుంటే - నాలిక తెగ్గోసేవారు!" అంటూ విసుక్కుంది.

"అయ్యగారు లేరు కనుకే మనసులో మాట సెప్పానమ్మగోరూ..! ఆరు ఇంట్లో వుంటే నేనీ సాయలకు వచ్చే వోణ్ణా ఏంటి .. అయినా.. ఎవరో ఈదిన పోయే సోములోరెవరో వచ్చి- ఎదో నోటికొచ్చింది చెప్తే నమ్మేయటమేనా?.. అసలు ఇదివరకోసారి అయ్యగోరి సేతిలో గీతలు సూసిన ఓ కోయదొర ఏం చెప్పాడో తమరికి గుర్తులేదా?" అడిగేడు నారాయణ.

"ఏం చెప్పాడయ్యా?" అంతవరకూ అతని మాటలు ఆసక్తిగా విన్న అశ్విని ప్రశ్నించింది.

"అబ్బాయిగోరి సదువు పూర్తయిన వెంటనే ఆరికి పెళ్ళయి పోతుందని సెప్పాడు!.. మరి అట్టాగే అయిపోయింది కదా!.. పెళ్ళయిన ఏడాదికల్లా మా ఈరబద్రం అయ్యగోరు మనవణ్ణి ఎత్తుకుంటారని కూడా సెప్పాడు ఆ దొర.. ! మరి అది కూడా జరిగిపోవాలి కదా?"

అశ్విని కళ్లు ఆనందంతో మెరిశాయి.. ఇంతలో నారాయణ మరో అడుగు ముందుకొచ్చాడు..

"అసలు ఆ 'బెమ్మరాత'ను కరెక్టుగా ఎవ్వరూ సెప్పలేరమ్మా!.. జాతకాలెప్పుడూ నిజం కావంటా!.. అట్టా నిజం కాకూడదని, సాచ్చాత్తూ -ఆ పార్వతీదేవి శాపం ఇచ్చినాదంట..! కనక, పెద్దాయన మాటలు పట్టించుకోమాకండి!"- అంటూనే - తన దారిన తాను పెరట్లోకి వెళ్లిపోయాడు.

'పనివాళ్లనునెత్తికెక్కించుకుంటే -పనికిరాని సలహాలు ఇలాగే ఇస్తారు'-అనుకుంటూ పార్వతమ్మ వంటింటివైపు నడిచింది...

హాల్లో వున్న సోఫాలో ఆలోచిస్తూ కూలబడిపోయింది అశ్విని.. నారాయణ మాటలు ఆమె చెవుల్లో మోగుతున్నాయి..




* * *

తన ఆఫీసురూంలో కూర్చుని పేపరు తిరగేస్తున్నాడు విష్ణుమూర్తి..

అంతలో టేబుల్ మీది టెలిఫోన్ రింగైంది. రిసీవర్ తీసుకుని 'హలో' అన్నాడు.

"రాజు పాలెంనించి 'కాల్' సార్ !.. మీ 'డాటర్' లైన్‌లో వున్నారు- మాట్లాడండి!" ఇంటర్ కమ్‌లో చెప్పింది స్టెనో..

వెంటనే పేపరు పక్కన పారేసి .. ఉత్సాహంగా 'హలో బేబీ' -అనీ ఫోన్లోనే పిలిచాడు విష్ణుమూర్తి...

"బాగున్నారా డాడీ ?" అవతల్నించి అశ్విని అడిగింది.

"నేను క్వయిట్ బేబీ!.. నువ్వెలా వున్నావ్"?

"బానే వున్నాను!"

ఆమె గొంతులో ఏదో అసంతృప్తి ధ్వనించినట్టుగా అనిపించింది విష్ణుమూర్తికి.

"బా..'నే' వున్నానూ -అంటే , నాకేదో అనుమానంగా వుంది !.. నిజం చెప్పుతల్లీ.. అక్కడ నీకు అన్నీ సౌకర్యంగా వుంటున్నాయా?... శ్రీరామ్ నిన్ను ప్రేమగా చూసుకుంటున్నాడా?"

"ఎలా చూసుకునేందుకైనా - మావయ్యగారు, ఆయనకసలు అవకాశం ఇస్తేకదా !"

"అంటే!! .." ఆదుర్దాగా అడిగేడు విష్ణుమూర్తి.

"రోజురోజుకీ మా మధ్య మావయ్యగారి ఆంక్షలు ఎక్కువైపోతున్నాయి డాడీ !"

"ఆంక్షలా!.. అంటే ఏం చేస్తున్నారూ?" -అడిగేడు విష్ణుమూర్తి.

"మే మిద్దరం.. కనీసం ఒకరినొకరు చూసుకునేందుకు కూడా వీల్లేకుండా కట్టడి చేస్తున్నారు !.. శ్రీరామ్‌కి వాళ్ల స్కూల్లోనే ఏదో చిన్న ఉద్యోగం ఇచ్చారు.. రోజూ పొద్దునే వెళ్ళి -సాయంత్రం దాకా రావటానికి వీల్లేకుండా చేశారు..

"ఉద్యోగం ఇవ్వటం ఏమిటీ. .. అల్లుణ్ణి మన కంపెనీ ఎమ్.డి.ని చేసి - బిజినెస్ వ్యవహారాలన్నీ అప్పగించాలనుకున్నాం కదా ?"

"ఆ మాటే నేను శ్రీరామ్‌కి చెప్పాను డాడీ?"

"ఏవన్నాడూ"?

"ఎప్పుడూ మానాన్నముందు నిలబడి, ఆయన వైపు సూటిగా చూసి మాట్లాడలేనివాణ్ణి - ఏకంగా నిన్ను పెళ్ళిచేసుకున్నాను కదా -మళ్లీ మరోసారి ఎదిరిస్తే ఆయన బాధపడతారూ' అన్నాడు.. పైగా మావయ్యగారు గుండెజబ్బు మనిషిట..! అందుకని శ్రీరామ్ భయపడుతున్నాడు!"

"పోనీ ..నువ్ మనూర్ వచ్చేయకూడదూ?... ఆ మూర్ఖశిఖామణి, అదే మీ మావగారు ....పెట్టిన గడువు తీరేదాకా ఇక్కడే వుందువుగాని!"

"లాభం లేదు డాడీ !...మొన్న రాత్రి ఆ ప్రస్తావన కూడా తేవటం జరిగింది- " అంటూ అశ్విని -జరిగిన విషయాన్ని ఫోన్లో వివరిస్తూంటే

-ఆ దృశ్యం విష్ణుమూర్తి కళ్ళముందే కదుల్తోంది.. ఫ్లాష్‌బ్యాక్...

"కలిసి కాపురం చేసే అవకాశం ఇప్పట్లో ఎలాగా లేకుండా పోయింది... కనీసం కళ్ళముందు కూడా నువ్వు కనిపించకపోతే -ఇక ఈ పల్లెటూళ్లో నాకేం తోస్తుందీ? .. మా ఊరెళ్లి పోతాను శ్రీరామ్ !" ఆ రాత్రి భోజనం చేశాక టీవీ ముందు కూర్చుని, 'నామొగుడు నాకే సొంతం", సీరియల్ చూస్తున్న శ్రీరామ్ దగ్గర కొచ్చి కూర్చొంటూ చెప్పింది అశ్విని.

ఆమె వైపు శ్రీరామ్ దిగ్భ్రాంతిగా చూశాడు.. "అదేమిటీ అశ్వినీ! ...ఇపుడు నీ కళ్ళముందే వున్నానుగా?" -అన్నాడు , టీవీ వాల్యూం కొంచెం తగ్గించి.

"కళ్ళముందుండి ఏం లాభం ?... ఓ ముద్దూ ముచ్చటకి వీల్లేకుండా -మీ నాన్నగారు 'పహారా' కాస్తుంటారుగా?" -నిష్టూరంగా అడిగిందామె.

సరిగ్గా అదేసమయంలో హాల్లోకి వచ్చిన వీరభద్రానికి ఆమాటలు వినిపించాయి.

"ఏమిటీ ?... నేను పహారా కాస్తుంటినా?.. అనగా నేను ఒక సిపాయివలె కన్పించు చున్నానా?" అడిగాడు తీవ్రమైన స్వరంతో.

"సిపాయిలు కూడా తమ కొడుకులు హాయిగా కాపురం చేసుకోవాలని కోరుకుంటారు!" ఉక్రోషం అణుచుకుంటూ చెప్పింది అశ్విని..

'టీవీ' ఆఫ్ చేసి మావా -కోడళ్ళ మధ్యకు వచ్చాడు శ్రీరామ్...

"అశ్వినీ!.. పెద్దా చిన్నాలేకుండా ఏమిటీ ఆవాదన?" -భార్యను మందలించబోయాడు- " ఇది వాదన కాదు !.. యదార్థం.!... అయినా పూట గడవని వాడెవడో గడ్డాలూ, మీసాలు తగిలించుకుని, కాషాయం చుట్టుకుని వస్తే - ఆయన్నో పెద్ద 'స్వామిజీ' గా భావించి, మర్యాదలు చేయటం, ఆయన మాటల్ని మూర్ఖంగా నమ్మేసి మనిద్దర్నీ వేరు చేయటం - ఇవన్నీ నీకు బాగానే వున్నాయి !.." కళ్ల నీళ్లు పెట్టుకుంది అశ్విని..

భార్యను మరి ఏమీ అనలేక శ్రీరామ్ తలవంచుకున్నాడు.

తనను మూర్ఖుడిగా జమకట్టినందుకూ, మొగుణ్ణి 'నీకు ' 'నువ్వు' అంటూ ఏకవచన ప్రయోగం చేస్తున్నందుకూ- వీరభద్రం కోపంతో ఊగిపోయాడు..

"ఆహా !... ఏమి కాలవైపరీత్యం?.. భర్తను పేరుపెట్టి సంబోధించుటయే చాలకా - మామగారన్న గౌరము కూడా లేకుండా పోతున్నది!" అన్నాడు కోపాన్ని నిగ్రహించుకుంటూ.

"ప్రేమా గౌరవాలు, మనం ఒకళ్ళకిచ్చినప్పుడే - మనికిస్తారు మావయ్యగారూ! పెద్దవారిగా, మావగారిగా - మీరంటే నాకు గౌరవమే !.. కానీ మీ మూఢ నామ్మకాల్నీ చాదస్తాల్నీ నేను వ్యతిరేకిస్తున్నాను ..మి కట్టు బాట్ల మధ్య- ఇక్కడ 'పంజరంలో పక్షి'లాగా పడివుండటం కంటే - మా ఊరు వెళ్లి పోవటమే మంచిదనిపిస్తోంది..రేపే నేను వెళ్లిపోతాను!.. ఆ స్వామిజీ ఎవరో మళ్లీవచ్చి మీ అబ్బాయి నేనూ, ఎపుడు కలిసికాపురం చెయచ్చునంటాడో చెప్తే - అపుడే కబురు పెట్టండి!.. వస్తాను!" - అంటూ విసవిసా తన గది వైపు వెళ్ళబోయింది.

"ఆగండి !".. అన్నాడు వీరభద్రం కోపంగా.

ఆగిపోయి , వెనక్కి తిరిగి చూసిందామె.

"నువ్వు -మీ ఊరు వెళ్ళుటకు నేనంగీకరించను" తీవ్రంగా చూస్తూ చెప్పాడు.

"పోనీ వెళ్ళనివ్వండి!.. కొన్నాళ్ళపాటు అక్కడ వుండి వస్తుంది!" - ఈ గొడవంతా విని వంటింట్లోంచి హాల్లోకి వచ్చిన పార్వతమ్మ సలహా ఇచ్చింది.

"తమరి సలహాలు మేం కోరలేదు.. అయినా, అత్తవారింటికి వచ్చిన ఆడపిల్ల నాలుగు మాసాల్లోనే పుట్టింటికి వెళ్లిపోతే -ఊరిప్రజలు వున్నవీ లేనివీ ఊహించుకుని మన పరువు ప్రతిష్టల్ని మంటలో కలిపెదరు.. తెలుసా?"

ఇప్పుడు శ్రీరామ్ కల్పించుకుంటూ అన్నాడు-

"మీరు అనవసరంగా లేనిపోని ఊహించుకుంటున్నారు నాన్నా !... అత్తారింటికి వచ్చిన కొత్తకోడళ్లు పండగలకీ పబ్బాలకీ, నోములకీ వ్రతాలకీ, పుట్టింటికి వెళ్లటం సహజమే !... ఇందులో ఊరి ప్రజలు ఊహించుకోవటానికీ, మన పరువు ప్రతిష్టలు పోవటానికీ ఏముందనీ?"

"అవును ..ఏమీ ఉండదు.. ! పుట్టింటికి వెళ్లి పట్టుచీర పెట్టించుకుని - పదిరోజుల్లో పదిహేనురోజుల్లో తిరగి వస్తే -ఫర్వాలేదు ..కానీ నీ భార్యామణి మాటలు ఆ భావమును స్ఫురింపచేయటంలేదే ?" మండిపడుతూ అడిగేడు వీరభద్రం.

"అవును ! నేను ఆ భావం తో మాట్లాడలేదు!" అశ్విని దృఢంగా శ్రీరామ్ వైపు చూస్తూ చెప్పింది మళ్లీ-

"నీకు అర్థం కావటం కోసం -సిగ్గు విడిచి మళ్లీ చెప్తున్నాను.. మన శోభనానికి మీ నాన్నగారు ముహూర్తం పెట్టించినపుడే మళ్లీవస్తాను.. అంతవరకూ మా ఇంట్లోనే వుంటాను!"

శ్రీరామ్ పరిస్థితి - 'ముందు చూస్తే, నుయ్యి, వెనుక చూస్తే గొయ్యి' అన్నట్టుగా వుంది.

ఇంతలో వీరభద్రం కల్పించుకున్నాడు-

"చూడండి కోడలుగారూ... మా మాట మన్నించకుండా తమరు ఈ ఇంటి గడప దాటితే - మరుక్షణంలో మా లాయరు చిదంబరాన్ని కబురెడతాను.. నెలరోజులు తిరిగేలోగా -మా సుపుత్రుడి చేత నీకు విడాకులు ఇప్పించి- నా చెల్లెలి కుమార్తె మెడలో తాళికట్టిస్తాను.. జాగ్రత్త.. !" అంటూ హెచ్చరించి-విసురుగా తన గదిలోకి వెళ్ళిపోయాడు..

ఫ్లాష్ బ్యాక్ సమాప్తి...

అంతవరకూ అశ్విని చెప్పిన విషయమంతా-సినీమాలో 'ఫ్లాష్‌బ్యాక్' దృశ్యంగా విష్ణుమూర్తికి -కళ్ళముందే కదిలినట్టుయింది.. రెండు క్షణాలు ఆలోచించి ఆ తర్వాత ఆమెతో చెప్పాడు.

-"నువ్వు అనవసరంగా ఆవేశపడకుబేబీ !.. నువ్ నా ఆస్థికి వారసురాలివే అయినా ఆ ఇంటికి కోడలివి!... పుట్టినింటికీ మెట్టినింటికీ కూడా పేరు ప్రఖ్యాతులు తీసుకురావాలి!.

.మీ అమ్మే బ్రతికుంటే ఇలాంటి సమయాల్లో నీకు తగిన సలహా ఇచ్చేదేమో?.. ఏది ఏమైనా ముల్లును ముల్లుతోనే తీయాలంటారు.. సమయస్ఫూర్తితో వ్యవహారాన్ని చక్కబెట్టుకోవాలి.. శ్రీరామ్‌ని నువ్వెంతో గాఢంగా ప్రేమించి పెళ్ళిచేసుకున్న దానివి....అతను కూడా నీ కోసం తండ్రిని ఎదిరించి తన దారికి తెచ్చుకున్నాడు.. అందుకని నువ్వు మీ ప్రేమని కాపాడుకోవాలి.. అర్థమైందా?"..

"ఒకే డాడీ!" -అంటూ సెల్‌ఫోన్ ఆఫ్ చేసింది అశ్విని.. విష్ణుమూర్తి కూడా రిసీవర్ని బల్లమీద పెట్టేసి -కుర్చీలో వెనక్కివాలి కళ్ళుమూసుకుని ఆలోచిస్తూండిపోయాడు..

-(ఇంకావుంది)



# 'హాసం' క్లబ్ కార్యక్రమ విశేషాలు

## విశాఖపట్నం

హాసంక్లబ్ నిర్వహించే హాస్య సంగీత వినోద కార్యక్రమం సెప్టెంబరు 19 ఆదివారం విశాఖపట్నంలోని ప్రేమసమాజం ఆడిటోరియంలో ఆహ్లాదకరంగా జరిగింది. ఈ హాస్యవల్లరికి న్యాయనిర్ణేతగా వ్యవహరించిన, ప్రముఖ రంగస్థల నటుడు, మిమిక్రి కళాకారుడు, నాటక 'నంది' గ్రహీత కె.వి.శివరామకృష్ణ మాట్లాడుతూ 'ఈరోజు టీవీలో ప్రత్యక్షప్రసారమవుతున్న ఇండియా -పాకిస్థాన్ క్రికెట్‌మ్యాచ్‌కి కూడా ప్రాధాన్యం ఇవ్వకుండా అధికసంఖ్యలో విచ్చేసిన హాస్యప్రియులను చూస్తూంటే 'రోజులుమారాయా' అనే సందేహం కలుగుతోంది" అని సంతోషం వ్యక్తం చేసారు. 'సత్యం' కన్‌స్ట్రక్షన్స్ సౌజన్యంతో జరిగిన ఈ కార్యక్రమానికి ప్రియ అతిథులుగా టూ టవున్ పోలీస్ స్టేషన్ ఇన్‌స్పెక్టర్ షేక్ హుస్సేన్, విశాఖ హ్యూమర్ క్లబ్ అధ్యక్షులు గోపీకృష్ణ, కార్యదర్శి నండూరి ప్రభాకర్ తదితరులు పాల్గొన్నారు. టి.ఎల్. ప్రసాద్ ప్రార్థనాగీతం, సి.వి.రాజేశ్వరి భక్తిగీతం, మధురాపంతుల లక్ష్మి 'మగనాలి-ఎగతాళి' చిలిపి కవిత, బాటా రామారావు 'అమృంతాజనం' హాస్యగీతం, పంతుల చక్రంధర్ 'వాడి పేరు ఎగవేతల ఎల్లాజీ' హాస్యకవిత, యం.కె.యస్.శయన జోక్స్, టి.ఎల్.ప్రసాద్ "ఎ.వి.యన్.కాలేజీ దౌనులో' లాంటి పాటలతో కార్యక్రమం ఆద్యంతమూ రసవత్తరంగా సాగింది.

వింజమూరి రామ్‌కుమార్ కిషోర్ కుమార్, మహమ్మద్ రఫీల హమ్మింగ్ సాంగ్స్‌లోని వైవిధ్యాన్ని ఘంటసాల పాటలతో జతచేసి పాడి శ్రోతలను మంత్రముగ్ధుల్ని చేసి బహుమతి గెల్చుకున్నారు. మధ్యమధ్యలో మస్తాన్‌రెడ్డి చెప్పిన జోకులు సభను రక్తి కట్టించాయి. పాతిక మందికిపైగా ప్రేక్షకులు చెప్పిన జోకులు,పేరడీపాటలు,చిలిపికవితల నుండి అయిదుగురిని ఎంపికచేసి బహుమతు లీయడం జరిగింది. బహుమతులలో కొన్నిటిని కళాభిమానులు స్పాన్సర్ చేయడం జరిగింది. ఉత్తమజోక్‌కు కళ్లు చిదంబరం ఏర్పాటు చేసిన 116/-రూ నగదు బహుమతిని గరిమెళ్ళ నాగేశ్వరరావు అందుకున్నారు.

వచ్చే కార్యక్రమం 17-10-2004 మూడో ఆదివారం సాయంత్రం 6 గం॥లకు, ప్రేమసమాజంలో జరుగుతుంది.

## విశాఖపట్నం హాసం క్లబ్‌లో అందర్నీ అలరించిన పిసినారి పుల్లయ్య

### స్కిట్

**వ్యాఖ్యాత :** అది నరకం. యమధర్మరాజు ఎదుట నిలబడ్డది పిసినారి పుల్లయ్య!

**యమ :** ఈ పుల్లయ్య ఒళ్లంతా సూదులతో గుచ్చి చిత్రవధ చేయండి. కానీ ఇతని ఎడమచేతికి మాత్రం స్వర్గం నుంచి రంభను పిలిపించి సుగంధలేపనం చేయించండి.

**పి.పు :** ప్రభూ ! నావల్లంతా చేసిన పాపమేమిటి ? నా ఎడమ చెయ్యి మాత్రమే చేసుకున్న పుణ్యమేమిటి?

**యమ :** పిల్లికి కూడా భిక్షం పెట్టని నువ్వు ఓరోజు భోజనం చేస్తుండగా ఆకలితో వచ్చిన భిక్షగాడికి నీ ఎడమ చేత్తో ఎదురింటిని చూపించి పొమ్మని కసిరావు. ఎదురింట్లో అతనికి భిక్ష లభించింది. అదన్న మాట సంగతి.. అందుకే ఆ చేతికి ఆ సద్గతి.

**పి.పు :** (ప్రాధేయపడుతూ) స్వామీ! బుద్ధిగడ్డితిని అలా చేశాను ! ఆ గడ్డితిని బుద్ధివచ్చింది. ఇక ముందు ఇలా చేసి కష్టాలు కోరి తెచ్చుకోను. నన్ను బతికించి ఒక అవకాశం ఇస్తే ప్రాయశ్చిత్తం చేసుకుంటాను.



స్కిట్ ప్రదర్శిస్తున్న మస్తాన్‌రెడ్డి, చక్రంధర్

**వ్యాఖ్యాత :** పుల్లయ్య ప్రార్థనకు కరిగిపోయి. అతని మృతదేహానికి ఇంకా అంత్యక్రియలు జరగలేదని, అమెరికా అల్లుడూ, కూతురూ వచ్చేంతవరకూ వేచి ఉందని, దివ్యదృష్టితో గ్రహించిన యముడు 'హైకమాండ్ ' అనుమతి తీసుకుని పుల్లయ్యను బతికిస్తాడు. చచ్చి బతికిన పుల్లయ్యకు ఆదినుంచీ పరమపిసినారి అన్న బిరుదు ఉంది గనక భిక్షగాళ్లెవరూ ఆ ఇంటి ఛాయలకు వెళ్లలేదు. చివరకు ఓ రోజు ఓ అర్భకుడు ఆకలితో వచ్చాడు.

**అర్భకుడు :** అయ్యా! బాబూ! ఆకలితో అల్లాడిపోతున్నాను. నాలుగు రోజులుగా తిండిలేదు ఇంత అన్నం పెట్టండి బాబూ .

**పి.పు :** వచ్చావా నాయనా ! నీలాంటి అర్భకుడి కోసం ఎన్నాళ్లనుంచో ఎదురు చూస్తున్నాను. నాలుగు రోజులుగా తిండిలేదా... ఆకలితో అలమటించి పోతున్నావా ? ఇలారా, బంగారు తండ్రీ (అంటూ దగ్గరగా తీసుకుని అక్కున చేర్చుకుని ఎదురిల్లు చూపిస్తూ)

ఆ ఇంటికి వెళ్లు - అని ఎడమచేత్తో
ఆ ఇంటికి వెళ్లు - అని కుడిచేత్తో
ఆ ఇంటికి వెళ్లు - అని కుడికాలితో
ఆ ఇంటికి వెళ్లు - అని ఎడమకాలితో
ఆ ఇంటికి వెళ్లు - అని తలతో
ఆ ఇంటికి వెళ్లు - అని వెనక్కి తిరిగి నడ్డితో

చూపించి వాణ్ని బయటకు నెట్టేసి గట్టిగా గాలిపీల్చి

'హమ్మయ్య' ఇక నేను చచ్చి నరకానికి వెళ్లినా రంభతో పాటు, ఊర్వశి, మేనక, తిలోత్తమ వచ్చి ఒళ్లంతా సుగంధలేపనం చేస్తారు! అని ఆనందించాడు.

## రాజమండ్రి

హాస్యప్రియుడు, తొలిపూజల దేముడు అయిన వినాయకునికి ఆ నెలలో పుట్టినరోజు జరుపుకుంటున్న సందర్భంగా - ముందుగా శుభాభినందనాలు 'హాసం' క్లబ్ తన 19 09 04 సమావేశంలో తెలిపింది!

జిత్ మోహనమిత్ర తనదైన శైలిలో సభికులను నవ్విస్తూ చక్కటి ప్రసంగం చేయగా పెరుమాళ్ల రఘునాథ్ వారి తాతగారైన చిలకమర్తి జన్మదిన సందర్భంగా వారి జీవితం నుంచి, రచనల నుంచి ఆసక్తికర విషయాలు తెలుపుతూ చక్కటి ప్రసంగం చేశారు.

బేబి మాధురి పాడిన పారడీ సాంగు శ్రోతల చేత 'ఒన్స్‌మోర్' పల్కించింది. శ్రీసుబ్బరాజు(సాయిబాబా వేషధారణతో పౌరులకు సుపరిచితం) పేరడీపాట, డాక్టర్ చల్లా సత్యవాణి (ప్రిన్సిపాల్ -రాజమహేంద్ర డిగ్రీ కాలేజి) పెళ్ళిపాట, ఖాదర్ ఖాన్ (పోస్టుమాస్టర్) హాస్యకవితలకు ప్రేక్షక శ్రోతలనుంచి విశేష స్పందన లభించింది. డా.ప్రభల సుబ్రహ్మణ్యశర్మ (రీడరు,గౌతమీ విద్యాపీఠం) 'సాహిత్యంలో హాస్యం' పై ప్రసంగించారు.

శ్రీవిద్య (సినీగేయ రచయిత భాస్కరభట్ల సోదరి), యన్.యన్.యన్.శర్మ , ఎ. శివప్రసాద్, మన్సూర్ ఆషీష్, సూర్యపద్మకుమారి, ఎ.కె.శర్మ లలితగీతాలు పాడగా బేబి బాల సమీక్ష అన్నమాచార్య కీర్తన, బి.రామకృష్ణ పేరడీ పాటలకు శ్రోతలు కరతాళధ్వనులతో ఆనందం వ్యక్తపరిచారు. సముద్రాల కృష్ణమాచార్యులు పాతపాటలలోని మాధుర్యాన్ని వివరించారు.

గమిని రంగయ్య, జివిఎస్ఎన్ మూర్తి ,శ్రీరామమూర్తి, ఫణి నాగేశ్వరరావు, అంజనేయులు, చక్రధారి, లక్ష్మి, రమణశ్రీ చక్కటి జోకులు చెప్పి నవ్వించారు. అయ్యగారి వెంకట్రామయ్య తన గంభీర స్వరంతో మధ్య మధ్య పద్యాలు పాడుతూ - హాస్య సంభాషణతో ప్రేక్షకులను ఐదునిమిషాలు మంత్ర ముగ్ధుల్ని చేసారు.

అక్కినేని నాగేశ్వర్రావు,నాగేష్, ధర్మవరపు, భానుమతి, యం.యస్.సుబ్బులక్ష్మి, లతామంగేష్కర్‌లకు వారిజన్మదినము ఈనెలలో జరుగుతున్న సందర్భంగా 'హాసం' క్లబ్బు నిండు మనస్సుతో శుభాకాంక్షలు ప్రకటించింది.

డి.వి. హనుమంతురావు రాసిన స్కిట్స్ "ఒకరిని మించి ఒకరు" (శ్రీ హనుమంతురావు, కె.వి.వి.యస్. అవధాని) "రామేశ్వరం వెళ్ళినా" (శారదా, శ్రీపాదపద్మ) "వేస్టు ఫ్రమ్ వెల్తు" (హనుమంతురావు, విజయలక్ష్మి) ప్రేక్షక రంజకంగా ప్రదర్శించి ప్రశంసలు పొందారు.

ఉత్తమమైన జోకులు చెప్పినందుకు అయ్యగారి వెంకట్రామయ్య, ఖాదర్‌ఖాన్, ఉత్తమగానం విన్పించిన సూర్య పద్మకుమారి, సుబ్బరాజు, బేబిమాధురి బహుమతులు గెల్చుకున్నారు. డా॥సత్యవాణి న్యాయనిర్ణేతగా వ్యవహరించారు.

**వచ్చే కార్యక్రమం 17.10.2004న జరుగనుంది.**

## శ్రీకాకుళంలో హాసం క్లబ్ ప్రారంభం

శ్రీకాకుళం పట్టణంలో రామలక్ష్మణ జంక్షన్ వద్దనున్న గాయత్రి స్కూల్ ఆవరణలో సెప్టెంబర్ 12వ తేది ఆదివారం సాయంత్రం 6 గంటలకు "హాసంక్లబ్" ప్రారంభమైంది. గురజాడ ఎడ్యుకేషనల్ సొసైటీ (శ్రీకాకుళం) వారి సౌజన్యంతో సంస్థ కరస్పాండెంట్ జి. చిన్నంనాయుడు జ్యోతి ప్రజ్వలనం చేసి క్లబ్‌ను ప్రారంభించారు. పరిచయవ్యాక్యాలు పలుకుతూ డా॥ వులఖండం శ్రీనివాసరావు క్లబ్‌కు కన్వీనర్లుగా ఓరుగంటి రామారావు (ఫోన్ - 220341), సనపల వెంకటేశ్వర రావు (ఫోన్ - 9440629179) వ్యవహరిస్తారని, సమన్వయకర్తగా ఓ. లోకనాథం వ్యవహరిస్తారని తెలిపారు.



సభికులలో శ్రీ చిన్నంనాయుడు తదితరులు

ఆనంద్ కుమార్ ప్రార్థనా గీతం, పురిజాల సుధాకర్ "వింతకాపురం" హాస్య కవిత, ప్రముఖ మిమిక్రీ కళాకారుడు నందికేశ్వరరావు "మా వూరు బస్సు" శ్రీకాకుళం జిల్లా యాసలో చెప్పిన జోక్, జగదీశ్వర రావు 'స్టార్ హోటల్‌లో సూపు' జోకు, శాంతిప్రియ-"భారతీయ రసాల సారస" దేశభక్తి గీతం సభను అలరించాయి. డి. విష్ణుమూర్తి, మంత్రిప్రగడ నర్సింగరావు పేరడీసాంగ్సు పాడగా అశువుగా నెలరాజు హాసం క్లబ్ పై కవితను చెప్పి నవ్వించారు. డి.వి.వి. పద్మనాభం, కృష్ణబాబు స్కిట్ ప్రదర్శించారు. ప్రముఖ కవి దూసి ధర్మారావు చిన్న కవితను, ఇంద్రసేన - ఒక తెలుగు గజల్‌ను పాడి వినిపించారు. ఈ కార్యక్రమంలో గురజాడ ఎడ్యుకేషనల్ సొసైటి డైరెక్టర్ రాజేష్‌ఖన్నా, ఎ.రంగారావు పాల్గొన్నారు. న్యాయనిర్ణేతగా వ్యవహరించిన ప్రముఖ రంగస్థల నటులు - రచయిత భార్గవి ప్రసాద్ ఎ.కె.విజయలక్ష్మి పాడిన తమిళపాటకు బహుమతిని ప్రకటించారు. ఎ.వి.రెడ్డిశాస్త్రి, నందికేశ్వరరావులు బహుమతిని అందజేసారు. తొలికార్యక్రమమే అయినా సుమారు 300మంది ప్రేక్షకులు హాజరయ్యారు. స్థానిక దినపత్రికల అన్నింటిలోనూ ఈ కార్యక్రమవివరాలు ప్రచురించారు.

**వచ్చే కార్యక్రమం 10-10-04 సాయంత్రం 6 గం॥లకు ఇదే ఆవరణలో జరుగుతుంది.**

## ఏలూరు

హాసంక్లబ్ సెప్టెంబరు కార్యక్రమం 19-9-04న జిల్లా కేంద్ర గ్రంథాలయంలో సాయంత్రం జరిగింది. డాక్టర్లు గొడవర్తి నాగభూషణం, జి.రాజేశ్వర్రావు, రిటైర్డ్ డిప్యూటి కలక్టర్ కోకా రామారావు, వి.బందా ఇతరులు హాజరు అయ్యారు. పెద్దవర్షం పడినా సుమారు 30మంది కొత్తవారు హాజరయి ప్రోగ్రాం విజయవంతం చేశారు. పాటలతో, జోకులతో సభ రక్తి కట్టింది. కొత్తగా హాజరయిన 6 సం॥ల భారతి పాడిన అన్నమాచార్య కీర్తన అందరి మన్ననలు పొందినది. వి.ప్రవల్లిక పాట, అనుపోజు భాస్కర్రావు పేరడీ సాంగ్ అందరి మన్ననలు పొందినది.



'హాసం క్లబ్'ను ప్రారంభించదలచిన వారు సంప్రదించవలసినది -
శ్రీ ఎస్.వి.రామారావు,
040-24160279,
98491 39030

# కొమ్మా కొమ్మా కోకిలమ్మా 13



- ఇంద్రగంటి జానకీబాల

ముక్కు
మీద కోపం నీ
ముఖానికే
అందం నా
బుంగమూతి చందం నీ
ముందరి కాళ్ళ బంధం..
వూ...వూ... వూ...వూ...

ఈపాట విన్నవారెవరూ అటూ యిటూ వూగుతూ ఆనందించకుండా వుండరు. ఇది కె.వి.మహదేవన్ సంగీత సారథ్యంలో 'మూగమనసులు' సినిమాలో కె. జమునారాణి పాడిన హుషారైన పాట. హీరో నాగేశ్వరరావుని ముక్కుపట్టి ఆడిస్తూ అల్లరి చేస్తూ జమున నటిస్తే, దానికి రెండింతల హుషారుతో, కొంటెతనంతో జమునారాణి పాడి, ఆ సన్నివేశానికే వెలుగు తెచ్చారు.

కె. జమునారాణికి నేపథ్య గాయనిగా తెలుగు సినిమా రంగంలో ఒక ప్రత్యేకత వుంది. సముచిత స్థానముంది. విచిత్రమైన గమకంతో, హుషారుగొలిపే చిన్న ముక్కు స్వరంతో విసురుగా వెళ్తూ మధ్యలో ఒక 'కట్' పలికిస్తూ, మత్తుగొలిపే మంచి బిగువైన కంఠం జమునారాణిది.

విసురుగా ఓ పల్లె పడుచు జానపద రీతిలో పాట పాడాలంటే అందులో కొంటెతనం తొంగి చూడాలంటే, పాట గంతులు వేయాలంటే జమునారాణి గొంతు చక్కగా కుదురుతుందని అందరూ అనుకునే విషయమే.

చక్కని సంగీత జ్ఞానం, వినిపించిన బాణీని తన సొంతం చేసుకుని, సంగీత దర్శకుడు సంతృప్తిపడే విధంగా పాడి మెప్పించగల శక్తి ఆమెకు వెన్నతో పెట్టిన విద్య. చాలా చిన్న పిల్లగానే నాగయ్యగారి 'త్యాగయ్య'లో 'మధురానగరిలో'పాటను బాలనటులకి నేపథ్యం పాడి తన ప్రతిభను చాటుకున్నప్పటికీ, పూర్తి స్థాయిలో హీరోయిన్‌కి పాడే అవకాశం రాకపోవడానికి ఆమె పసితనమే కారమణమని ఆమె చెప్తారు. వరదరాజుల నాయడు, ద్రౌపది దంపతులకు జమునారాణి మే 17న 1938 సంవత్సరంలో పుట్టారు. చిన్నతనం నుండి సంగీత మంటే యిష్టం, పాటలు పాడుతూనే పెరిగారు. ఆమె తల్లి చక్కగా పాడేవారు.

"మా అమ్మగారు బాగా పాడేవారు కనుక నాకు సంగీతం నాకు నేర్పించారు. అయితే నేను ఎక్కువగా శాస్త్రీయ సంగీతం యిష్టపడేదాన్ని




కాదు. నాకు లైట్ మ్యూజిక్ మీదనే ఎక్కువ మక్కువ వుండేది- అది గ్రహించిన మా అమ్మ నా ప్లేబ్యాక్ పాటకు అంగీకరించారు. పెద్దగా నా కోసం ప్రయత్నాలు చేసి వాళ్ళనీ వీళ్ళనీ పాడించమని అడగకపోయినా నేను పాడితే ఎంతో ఆనంద పడేవారు. అలాగే మా నాన్నగారికి నా పాటంటే మహాయిష్టం" అని తన తల్లిదండ్రులు గూర్చి ఎంతో ప్రేమగా, అభిమానంగా చెప్తారు జమునారాణి.

"మొదట్లో పి.రామకృష్ణ (భానుమతిగారి భర్త) డి.ఎల్. నారాయణగారూ నాకెంతో ప్రోత్సాహం యిచ్చారు. నేను మొదట్లో 'దేవదాసు'లో డ్యూయట్ పాడాను. అది చిన్నప్పటి దేవదాసు -పార్వతి పాడే. 'ఓ...దేవదా' అనే పాట, అందులో నేను దేవదాసుకి పాడాను. దానికెంతో పేరొచ్చింది; గుర్తింపువచ్చింది" అంటారామె. కానీ ఆమె 'కులదైవం' లో పాడిన 'పద పదవె ఒయ్యారి గాలి పటమా' పాట ఎంతో ప్రజాదరణ పొందింది. జమునారాణి గొంతును ఇట్టే పోల్చుకునే పరిస్థితి వచ్చింది. అదే 'కులదైవం'లో "కోటు బూటు వేసిన బావ- వచ్చాడయ్యా" కూడా బాగా పాప్యులరయింది. ఆ సినిమాకి మాస్టర్ వేణు సంగీతం వహించారు. ఈ సినిమా హిందీ సినిమాకి అనువాదం కావడం వల్ల, పాటలు కూడా యథాతథంగా వచ్చినా తెలుగుతనానికి లోటు రాకుండా వాటిని మలచారు. లతామంగేష్కర్ -రఫీ పాడిన 'చలీచలీరే పతంగ్ చలీచలీరే' -అనే పాటకు తెలుగు రూపమే 'పద పదవె వయ్యారి గాలిపటమా.' జమునారాణికి నెమ్మదిగా వాటంతటవే అవకాశాలు రావడం మొదలైంది.

1952లో 'అత్తింటి కాపురం' అనే చిత్రంలో లక్ష్మీరాజ్యం మొదటిసారిగా జమునారాణి చేత కథానాయికకి పాడించారు. కానీ ఆమె గొంతులో ఇంకా పసితనం పలికిందనుకున్నారంతా. క్రమంగా 'సవితిపోరు, భాగ్యదేవత' లాంటి

సినిమాల్లో చక్కని అవకాశాలొచ్చాయి. కానీ హీరోయిన్స్ ముఖాలకి జమునారాణి గొంతు నప్పకపోవడం వల్ల, 'భాగ్యదేవత'లో రాజసులోచనకి పాడిన పాటలు రాణించలేదు. 'చివరికి మిగిలేది' చిత్రంలో (1960) పాడిన పాటలు అనుకున్నంత పాప్యులర్ కాలేదు. 'చివరికి మిగిలేది' చిత్రంలో 'అందానికి అందం నేనే, జీవన మకరందము నేనే' అనేపాట, ఎంతో ఆదరణ పొందింది.

'శభాష్‌రాజా' (1961)లో 'ఓ వన్నెలా వయారీ' పాటతో జమునారాణికి హుషారు పాటలు పాడే గాయనిగా గుర్తింపు వచ్చింది. అలాగే 'మంచి మనసులు' (1962) , 'ఆత్మబంధువు', 'భీష్మ', 'మూగమనసులు' సినిమాల్లో పాడి ఆమె ఒక ప్రత్యేక స్థానాన్ని పొందారు.

'బంగారు తిమ్మరాజు' (1964) లో ఆమె 'నాగమల్లి కోనలోన' పాట ఎంతో పాప్యులరయింది. దానికి ఎస్.పి. కోదండపాణి సంగీతం.

"ఆపాటకి నాకెంతో పేరొచ్చింది. కోదండపాణిగారు పాట నేర్పుతూ మేము ఓ బొమ్మని చేసి మీకిస్తాం. దానికి చెవులకి ముక్కులకి మెడలోకి ఆభరణాలు తగిలించి, దాన్ని అందంగా తయారు చెయ్యాల్సిన పని మీది. మేమెంత బాగా బాణీ కూర్చినా, దాన్ని బాగా పాడి ప్రాణం పొయ్యవలసింది గాయకులే' అనేవారు. ఈ పాటలో కొన్ని చోట్ల 'మావాఁ -మావాఁ' అంటూ మధ్యలో వస్తుంది. అవన్నీ నేనే ఒకలాగ అనుకుని ఆయనకి పాడి వినిపించి, ఆయన సరేనన్నాక పాడాను.

ముక్కుమీద కోపం (మూగమనసులు) , మావాఁ -మావాఁ మావాఁ (మంచి మనసులు) హైలో హైలెస్సా హంసకదా నా పడవా (భీష్మ), 'ఆత్మబంధువు'లో దక్కెనులే నాకు నీ సొగసు -నీ టక్కులెందుకో తెలుసూ (పి.బి.శ్రీనివాస్‌తో డ్యూయట్), 'కులగోత్రాలు'లో రావె రావె బాల, 'రాముడు -భీముడు'లో సరదా సరదా సిగిరెట్టు, 'కుటుంబగౌరవం'లో రాయుడోరింటి కాడ ఆమెకి ఎంతో పేరు ప్రఖ్యాతుల్ని తెచ్చిపెట్టడమే కాకుండా, ఆమెకు నేపథ్యగాయనిగా ఒక ప్రత్యేకతను తెచ్చిపెట్టాయి.

"మీరు పాడగలిగినన్ని పాటలు పాడారా" అని అడిగితే "లేదు. నేనింకా ఎక్కువ పాటలు పాడేదాన్ని కానీ ఎందుకో కొన్ని అవకాశాలు వచ్చినట్టే వచ్చి వెనక్కి వెళ్ళిపోయేవి. చూడండీ, 'మూగమనసు'ల్లో జమునకి నేను పాడతానని అనుకున్నారు. నేను ఒక్కపాట, 'ముక్కుమీద కోపం' పాడాను. -మాములుగా అయితే 'గౌరమ్మా నీ మొగుడెవరమ్మా', 'గోదారీ గట్టుందీ' కూడా నేనే పాడాలి. సుశీల బాగా పాడలేదని కాదు. ఆమె గొప్పగానే పాడారు. కానీ ఏమైందంటే ఆ పిక్చర్‌లో సావిత్రికి పాటలు లేకుండా పోయాయి. ఆమెకి సుశీల కదా ప్లేబ్యాక్- అక్కడ వచ్చింది చిక్కు. సుశీలకి తక్కువ పాటెలెలా అనే మాట వచ్చింది. అందుచేత నేను పాడాల్సిన పాటలు తప్పిపోయాయి. నాకు ఒక్కపాటే వచ్చింది. అయినా అదెంతో పాప్యులరయి, నాకెంతో పేరు తెచ్చింది" అంటారు జమునారాణి.

కథానాయికకి ప్లేబ్యాక్ పాడకపోవడం వల్ల, సినిమాకి ఒకటీ అరా పాటలే వస్తాయి. అందులోనూ కొంత పోటీ తప్పదు. అవకాశమూ తప్పదు. ఒక తరహా పాటల్ని జమునారాణీ, స్వర్ణలత మార్పుగా పాడుతూండగా, ఒక్కొక్కసారి, అదేరకమైన పాటలు జిక్కీ పాడిన సందర్భాలు వున్నాయి-, ఈ కారణాల వల్ల పాడగలగినన్ని పాటలు పాడే అవకాశం లేకుండా పోతుంది.

ఆమె కంఠంలో ఒకరకమైన వగరు, ఒక మత్తుని పలికించేతనం వున్నాయి. కొంచెంగా పోల్చాలంటే బొంబాయి గాయనులు గీతాదత్, శమ్షాద్ బేగం లాంటి ఒక విలక్షణమైన గొంతు. అందుచేత వ్యాంపు పాత్రలకి, క్లబ్ డ్యాన్సర్లకి జమునారాణి పాటను ప్లేబ్యాక్‌గా వాడటం మొదలైంది. ప్రతీ సినిమాలోనూ ఈవిధమైన పాట వుంటుందనే భరోసా కూడావుండదు. ఇలాంటి పాటలు పాడదగ్గ కంఠాలు రెండు మూడు వుండటంతో వారి మధ్య ఆ పాటలు పంచబడుతూ వుంటాయి.

కొంటె పాత్రకీ, వేళాకోళం పట్టించే పాత్రలకీ, బావలను ఏడిపించే మరదళ్ళ పాత్రలకీ మాత్రమే తెలుగు సినిమాల్లో ఆమె కంఠం వుపయోగించుకున్నారు.

సినిమాల కథలు, తీసే విధానం, పాటల స్వభావం క్రమంగా మారిపోయాయి. జమునారాణీ పాడేలాంటి పాటలు పాడేందుకు ఎల్లారీశ్వరి రంగప్రవేశం చేయడంతో జమునారాణికి కాస్త వెనుకబడి పోయారు. ఆమెకెంతో విలక్షణమైన గొంతు వున్నప్పటికీ కొత్త గొంతులకు ఒక వ్యామోహం, ఆహ్వానం సినీ పరిశ్రమలో సహజం.

ఈ విషయంలో ఆమె తన అభిప్రాయం నిక్కచ్చిగా చెప్తారు. "పూర్వం సంగీత దర్శకులు ఒక పాటను కంపోజ్ చేసేటప్పుడు ఫలానా ఆరిస్టు చేత పాడిద్దామన్నట్లు శ్రుతి, పాట పద్ధతి, అందులో వచ్చే సంగతులు,నిర్ణయించేవారని పిస్తుంది. అందువల్ల జమునారాణి శ్రుతి యిది, జానకి శ్రుతిఇది, సుశీల ఈ శ్రుతిలో పాడతారు అని భావించి దానిప్రకారం చేసేవారు. మేం చాల ఫ్రీగా హాయిగా భావయుక్తంగా పాడేవాళ్ళం. అంతేగాని అక్కడికెళ్ళాక హెచ్చుశ్రుతి చూసి, పాడలేమని చెప్పేందుకు బిడియపడి, పాడలేక అవస్థపడి, బాధపడటం వుండేది కాదు. ఒకవేళ అక్కడికెళ్ళాక శ్రుతి ఎక్కువైతే తగ్గించేవారు. అప్పట్లో ఆర్టిస్టు సౌకర్యంగా పాడటానికి వీలుకల్పించి సహకరించేవారు -అదీ కాక, వాళ్ళు కంపోజ్ చేసిన పాట మేము ఇంప్రవైజ్ చేసి, లైవ్‌తో పాడితే అభినందించేవారు- అంగీకరించేవారు - మేము వేసుకునే ఎఫెక్ట్స్ వారు చూసి, బాగుంటే పాడమని స్వేచ్ఛ యిచ్చేవారు" అంటారు.

ఇప్పుడూ సినిమా పాటల కచ్చేరీలకెళ్ళినప్పుడు రెండు కొత్త పాటల తర్వాత ఒక పాత పాట పాడుతుంటే ప్రేక్షకులు చప్పట్లు కొట్టి వన్స్‌మోర్‌లతో హోరెత్తించేస్తారు. పాత పాటలకీ, పాత గాయనులకీ ఇంత మోజు వుందే అనిపించినప్పుడు ఆనందంగా వుంటుంది".

"మీరు అవివాహితులుగానే వుండిపోయారు. అలా వుండిపోవటానికి ప్రత్యేకమైన కారణాలేమైనా వున్నాయా?"

"ప్రత్యేకమైన కారణాలంటూ ఏమి లేవు గానీ నేను సినిమాల్లో పాటలు పాడుతూ బిజీగా కాలం గడిపేస్తున్నప్పుడు నాకు ముప్పై సంవత్సరాల వయస్సు దాటి పోయింది. -అదీ కాక నా సాటి గాయనులు కొందరు పెళ్ళిచేసుకుని ఫీల్డులో వుంటూ పడుతున్న హింస, అవస్థ, అవమానం చూస్తున్నప్పుడు పెళ్ళి అంటే 'వద్దు' అనిపించింది. ఇక్కడొక మాట చెప్పాలి, మా టైములో డ్యూయట్ పాడాలంటే ఒకే మైకు దగ్గర నిలబడి పాడాల్సి వచ్చేది. ఒక ఆర్టిస్టు అత్తగారు, భర్తా కూడా ఆమెనా విషయం గుచ్చి గుచ్చి అడిగి బాధించటం చూశాను. అతను నీకు తగులుతాడా, పక్కకి తప్పుకుంటాడా అంటూ అవమానపరుస్తూ మాట్లాడటం చూసినప్పుడు, పాడగలిగి, గొంతు మంచి స్థితిలో వున్నప్పుడు పాడనివ్వకుండా ఆమెనొక పిల్లలు కనే యంత్రంగా చూడటం నేను గమనించాను. నాకు ఇవన్నీ చూసి పెళ్ళి అంటే 'ఛీ' అనిపించింది. నేనూ మా అన్నగారూ చాలా ప్రేమగా వుంటాం. 'రక్తసంబంధం'లో అన్నాచెల్లెళ్ళ మాదిరిగా వుంటాము. ఆయన పిల్లల్నే నా పిల్లలుగా చూసుకున్నాను" అంటారు జమునారాణి తృప్తిగా.

ఆమె సుమారు ఆరువేల పాటలు పాడారు. అందులో ఎక్కువ తమిళం. ఒక ఇరవై శాతం తెలుగు పాడారు. మిగిలినవి కన్నడం, మలయాళం, సింహళం.

ఇప్పటికీ మలేషియా, సింహలం లాంటి దేశాలకు వెళ్ళి సినిమా పాటల ప్రోగ్రాములు చేస్తుంటారు. ఆమె గొంతులో మార్పులేదు- గొంతు బాగానే వున్నప్పటికీ, ఆమె నేటి సినిమా పరిశ్రమకి దూరంగా వున్నారు.

"మునుపు ఒక పాత్రకి ఒక గాయని అని నిర్ణయించేవారు. ఇప్పుడలా లేదు కదా! అన్నీ పాత్రలకీ ఒకరే పాడినా పాడచ్చు. దాన్ని ఎవరు ప్రశ్నిస్తారు".

"మీరు పాడిన పాటలు మీ దగ్గర

వున్నాయా" అంటే

"లేవండీ చాలా వరకు లేవు. మా అన్న పిల్లలు ఎక్కువ వినడం వల్ల రికార్డులు అరిగిపోయాయి. అలాంటివి కొన్ని వున్నాయి"

"అప్పట్లో మీ గాయనులందరూ ఎలా వుండేవారు?"

"ఆనాడు పాటలు పాడే అందరం అంటే ఆరుగురం అక్కచెల్లెళ్ళ మాదిరి వుండేవాళ్ళం. సుశీల, జానకి, బాలసరస్వతి, జిక్కి,లీల,నేను ఎప్పుడూ ప్రేమగా అప్యాయంగా వుండేవాళ్ళం, మామధ్య ఈర్ష్యలు, అసూయలు లేవు"అన్నారామె ధీమాగా.

జమునారాణి సినిమాల్లోకి గాయనిగా ప్రవేశించిన నాటికి అతిరథ మహారథులైన గాయనీమణులు పరిశ్రమలో వున్నారు. పి.లీల, సుశీల,జానకి, జిక్కి (కొంతకాలం) తరువాత ఎల్. ఆర్.ఈశ్వరి కూడా వచ్చారు. వీరందరిలో ఎవ్వరూ తక్కువ వారు కాదు. అందరిలోనూ వుండి తనదైన శైలితో తనకంటూ ఒక ముద్ర వేసుకున్న గాయని జమునారాణి.

ఎల్.ఆర్.ఈశ్వరి సినీ పరిశ్రమలోకి 'సోలో సింగర్'గా ఎదిగాక జమునారాణి తగ్గిపోయారు. ఆమె గొంతులో ఈమె గొంతు పోలిక వుండటం మరికాస్త ఎక్కువ విసురు, పరుగెత్తే జోరు, జమునారాణిని వెనక్కి నెట్టాయేమోనపిస్తుంది. జీవనదిలా ఎప్పుడూ ప్రవహించే సినీ పరిశ్రమలోకి కొత్తవారు వస్తూనే వుంటారు. పాత వాళ్ళు పాడకపోయినా పరిశ్రమకి మూలస్థంభాలై నిలుస్తూ వుంటారు. పాత కొత్తల మేలు కలయిక ఈ పరిశ్రమ. దేని విలువ దానిదే - ఎవరి ప్రతిభ వారిదే.

ఆమెతో మాట్లాడితే ఆమె ఎంతో తృప్తిగా ప్రసన్నంగా వున్నారనిపిస్తుంది.

సినిమా పరిశ్రమలే ఏది సక్సెస్ అవుతుందో. ఏది ఫెయిల్ అవుతుందో ముందుగా ఎవ్వరూ చెప్పలేరంటారామె. ఒక సక్సెస్ చూసి, అలాగే తీసిన సినిమా ఫ్లాప్ కావడం చూస్తూంటారు. అందుకే వాళ్ళు చేయగలిగిందిచేసి , దేవుడిమీద భారం వేస్తారు. అదేవిధంగా ఒక ఆర్టిస్టు పైకి రావడానికి ఎన్నో కారణాలు వుంటాయి. రాలేకపోవడానికి ఎన్నో అవరోధాలూ వుంటాయి. అలాగే వచ్చినా నిలద్రొక్కుకోవడానికి, నిలబడలేక పోవడానికీ స్పష్టంగా ఏమీ కనిపించకుండానూ పోతాయి. ఒక ఆర్టిస్టు ఎంత కాలం వున్నా వారి ముద్ర వారు వేసుకోగలిగితే అది చాలా గొప్ప.

జమునారాణి తను చేయగలిగింది చేశాననే తృప్తి కనబరుస్తారు.

ఆమె పెద్దగా చదువుకోలేదు. పుస్తకాలు చదవడం లాంటి అలవాటామెకేమీ లేదు. ప్రోగ్రాము వుంటే వాళ్ళు పంపిన పాటలు(తనవే) క్యాసెట్ లో మరొక్కసారి వింటారు. ఖాళీగా వున్నప్పుడు టి.వి. ఒక్కటే ఆమెకి కాలక్షేపం అని ఆమె చెప్తారు. ■

# జమునారాణి హిట్స్

**చిత్రం : చివరకు మిగిలేది**   **రచన : మల్లాది రామకృష్ణశాస్త్రి**
**సంగీతం : అశ్వత్థామ**   **గానం : జమునారాణి**

ప: అందానికి అందం నేనే జీవన మకరందం నేనే
తీగకు పూవుని నేనే పూవుకు తావిని నేనే ॥తీగకు॥
ధరణి అమరధామమె ఆనందము నేనే ॥అందానికి॥
చ: వాలుకనుల చూపులే చెంగల్వ తోరణాలు
అలారు చిరునవ్వులే మల్లెవిరుల హారాలు
నా మేనే మెరుపుతీవ నగుమోమే చందమామ ॥నామేనే॥
నవరసాల సమ్మోహ సమ్మేళన నేనే ॥అందానికి॥
చ: మలయానిల లాలనలో పదేపదే పరవశమై ॥2॥
గానమేలు ఎలకోయిల గళ మధురిమ నేనే ॥2॥
మాయని తీయందనాలు మన వరాలై
అవలీలగా జగమేలగా ॥అవ॥
నవచైతన్య సమ్మోహ సమ్మేళన నేనే ॥అందానికి॥

**చిత్రం : భీష్మ**   **రచన : ఆరుద్ర**
**సంగీతం : యస్.రాజేశ్వరరావు**   **గానం : జమునారాణి**

ప: హైలో హైలేసా హంస కదా నా పడవ ॥హైలో॥
ఉయ్యాల లూగినది ఊగీస లాడినది
హైలో హైలేసా హంస కదా నా పడవ
ఓహోహై - ఓహోహై
నదిలో నా రూపు నవనవలాడినది
మెరిసే అందములు మిలమిలలాడినది
వయసూ వయారమూ పాడినవి పదే పదే ॥హైలో॥
ఎవరో మా రాజూ ఎదుట నిలిచాడు
ఏవో చూపులతో సరసకు చేరాడు
మనసే చలించునే మాయదారి మగాళ్ళకి ॥హైలో॥

**చిత్రం : బంగారు తిమ్మరాజు**
**సంగీతం : కోదండపాణి**   **గానం : జమునారాణి**

నాగమల్లి కోనలోన నక్కింది లేడికూన
ఎరవేసి... హా... గురిచూసి... హా... పట్టాలి మావా పట్టాలి మావా
చూపుల్లో కైపుంది... మావ సొగసైన రూపుంది... మావ
వయ్యారం ఒలికిస్తుంది
వన్నెల చిన్నెలు నేర్చింది మావా
ఓ ఉడుకుమీద ఉరికావంటే జడుసుకుంటుంది మావా ॥ఉడుకు॥
దాన్ని ఒడుపుచూసి మచ్చిక చేస్తే
వదలనంటుంది మావోయ్ ॥దాన్ని॥ ॥నాగమల్లి॥
నడకల్లో హొయలుంది... మావా
నాట్యంలో నేర్పుంది... మావా ॥నడకల్లో॥
మలిసందె సీకట్లోన
నీటికి ఏటికి వస్తుంది (2)
ఓ జాడ చూసి కాసావంటే దారికొస్తది మావా ॥జాడ॥
దాని జాలి చూపునమ్మావంటే
దగా చేస్తది మావోయ్ ॥దాని॥ ॥నాగమల్లి॥

**చిత్రం : కులదైవం**   **రచన : కొసరాజు**
**సంగీతం : మాస్టర్ వేణు**   **గానం : ఘంటసాల,జమునారాణి**

అతడు : పదపదవె వయ్యారి గాలిపటమా ॥పద॥
పైన పక్షిలాగ ఎగిరిపోయి
పక్క చూపు చూసుకుంటు
తిరిగెదవే గాలిపటమా ॥పద॥
ప్రేమగోల లోన చిక్కిపోయినావా
నీ ప్రియుడున్న చోటుకై పోదువా ॥ప్రేమ॥
ఆమె : నీ తళుకంతా నీ కులుకంతా
అది ఎందుకొ తెలుసును అంతా ॥పద॥
నీకు ఎవరిచ్చారే బిరుదు తోక
కొని తెచ్చావేమో అంతెగాక ॥నీకు॥
అతడు : రాజులెందరూడినా మోజు లెంతమారినా
తెగిపోక నిలిచెనీ తోక ॥పద॥
ఆమె : నీలిమబ్బుల్లో ఆడుకుందువేమో
మింట చుక్కల్తో నవ్వుకుందువేమో ॥నీలి॥
అతడు : వగలాడివిలే జగడంతవులే
దిగిరాకుండ ఎటులుందువులే ॥పద॥



మహాసహస్రావధాని
డా॥ గరికపాటి నరసింహారావు

# పలకరిస్తే పద్యం...

పద్యం తెలుగుజాతి స్థిరాస్తి
అయితే ఆ పద్యాన్ని ఈ నాటికీ
నిలబెడుతూ రసజ్ఞుల హృదయాలను
ఉర్రూతలూపే డా॥గరికపాటి నరసింహారావు గారి
వంటివారిని చరాస్తిగా చెప్పవచ్చు. ఎం.ఏ, ఎం.ఫిల్,
పి.హెచ్.డి. చేసిన నరసింహారావుగారు 1978నుండి
అధ్యాపక వృత్తిలో వున్నారు. 1992 విజయదశమి రోజున
అవధానరంగంలో అడుగుపెట్టి -అనతికాలంలోనే
అష్టావధానాలు, శతావధానాలు, ద్విశతావధానాలు చేశారు.
1996 మేలో కాకినాడలో 1116 పృచ్ఛకులతో 750 పద్యాలను
ఏకధాటిగా ధారణ చేసి 'మహాసహస్రావధాని'గా కీర్తి
ప్రతిష్ఠలనందుకున్నారు. శతవధాన గీష్పతి, సహస్రభారతి, ధారణ
బ్రహ్మారాక్షసుడు వంటి బిరుదులందుకున్న డా॥ గరికపాటి
నరసింహారావుగారి ప్రతి రక్తకణం పద్యం, హృదయం పద్యం,
ప్రాణంపద్యం, మాట పద్యం, మనసు పద్యం, ఆత్మ పద్యం.
ఈ కాలానికి తగినట్టుగా - ఏ కాలానికైనా నిలిచేట్టుగా
ప్రత్యేకమైన భావనా తీవ్రతతో పద్యం ఆశువుగా చెప్పడం
ఆయన ప్రత్యేకత. ఆయన సాగించిన
అవధానయజ్ఞాలలో చమత్కారంగా దొర్లిన ఆశు పద్యాలివి.
ఈ పద్యాలకు పృచ్ఛకులుగా వ్యవహరించినవారు శ్రీకాంత్
మంజుల, కుమార్, జ్యోతి, సాయి...
చిత్తగించండి....

◆ **అవధాని గారూ... ఈ రోజుల్లో భార్యాభర్తలిద్దరూ కలిసి సంపాదిస్తే గానీ కనీసం ఓ చిన్న అపార్ట్‌మెంట్ కూడా కొనుక్కోలేక పోతున్నారు. తీరా కొనుక్కున్న తర్వాత వాటిలో ఉంటే సౌకర్యాలు అంతంతమాత్రంగానే ఉంటున్నాయి కదా ... ఈ అపార్ట్‌మెంట్ బ్రతుకుల్ని కొంచెం వర్ణిస్తారా....!?**

అపార్ట్‌మెంట్ గురించి చెప్పాలంటే నాకు శ్రీనాథుని చాటు పద్యశైలి గుర్తొస్తుంది..




**చిన్న చిన్న ఇళ్లు చింతాకు వాకిళ్లు**
**చిన్న చిన్న ఇళ్లు చింతాకు వాకిళ్లు**
**మేడమీది గూళ్లు మేడి పళ్లు**

అపార్ట్‌మెంట్ కాంప్లెక్స్ ఉన్న చోట దూరం నుండి చూస్తే అన్ని నేలమీద చిన్న చిన్న గూళ్లలాగా ఉంటాయి. ఒక్కో అపార్ట్‌మెంట్ ఒక్కో గూడులా కనిపిస్తుంది. పైగా అన్నీ మేడిపళ్లే! కట్టిచ్చేటప్పుడు మనకు చాలా కబుర్లు చెపుతారు. అంత అందంగా ఉంటుంది, ఇంతందంగా ఉంటుంది, అతి తక్కువ ధరకు వస్తుందని. తీరా అందులోకి ప్రవేశించిన తర్వాత తెలుస్తాయన్నీ అందుకే అవి - మేడిపండు చూడ మేలిమైయుండ అన్నట్టుండే - మేడిపళ్లు.

**చిన్న చిన్న ఇళ్లు చింతాకు వాకిళ్లు**
**మేడమీది గూళ్లు మేడి పళ్లు**
**చాపలేని కాళ్లు సర్వమ్ము కంబైండ్లు**

గట్టిగా కాళ్లు జాపుకుందామా అని ఏ ముసలమ్మ అయినా ప్రయత్నం చేస్తే అది పక్కింట్లోకి వెళ్లే ప్రమాదం ఉంది. అందుకని కాళ్లు జాపుకునేందుకు వీలు లేదు - ముడుచుకోవటమే తప్ప ! సర్వమ్ము కంబైండ్లు..... అది కంబైండు ఇది కంబైండు. దేనికీ ఓ ప్రత్యేకమైన గది అంటూ ఉండే అవకాశం లేదు. అన్నీ కంబైండే.

**చాపలేని కాళ్లు సర్వమ్ము కంబైండ్లు**
**ఈ అపార్ట్‌మెంట్లు ఇరుకు టెంట్లు**

ఏదో విశాలంగా ఉండే టెంట్ అనుకుంటాం తప్ప ఇది ఇరుకు టెంట్ అనుకోవాలి. లక్షల్లో మాత్రం వసూలు చేస్తారు. లక్షణంగా ఉండే అవకాశం మాత్రం లేదు.

**చిన్న చిన్న ఇళ్లు చింతాకు వాకిళ్లు**
**మేడమీది గూళ్లు మేడి పళ్లు**
**చాపలేని కాళ్లు సర్వమ్ము కంబైండ్లు**
**ఈ అపార్ట్‌మెంట్లు ఇరుకు టెంట్లు**

◆ **అవధానిగారూ.... ఈ అపార్ట్‌మెంట్లు అనేవి ఆధునిక జీవితంలో విడదీయలేని భాగమైపోయాయి. అవి లేకుండా ఆధునిక జీవనం లేదు కదా. ఈ ఆధునిక జీవనం గురించి చెప్పండి.**

**ఆదౌ రామ తపోవనాది గమనం**
**హత్వా మృగం కాంచనం**

మీరు ఆధునిక జీవనాన్ని వర్ణించమని అడుగుతూ ఉంటే అతి ప్రాచీనమైన రామాయణాన్ని గురించి చెప్తున్నానేమిటీ అనుకోకండి. ఇది రామకర్ణామృతంలో ప్రసిద్ధమైనటువంటి శ్లోకం. మొత్తం రామాయణాన్ని సంక్షిప్తంగా చెప్పేసినటువంటి శ్లోకం.

**ఆదౌ రామ తపోవనాది గమనం**
**హత్వా మృగం కాంచనం**
**వైదేహీ హరణం**
**జటాయువు మరణం**
**సుగ్రీవ సంభాషణం**
**వాలీ నిగ్రహణం**
**సముద్ర తరణం**
**లంకాపురీ నాశనం**
**పశ్చాత్ రావణ కుంభకర్ణగణనం**
**చైతత్వి రామాయణం**

అని రామాయణ సంఘటల్ని చెప్పినట్టే..... అంత పవిత్రమైన రామాయణంతో మన ఆధునిక జీవనాన్ని పోల్చి వర్ణించాలని నా ఉద్దేశ్యం. మన జీవితంలో ఇంత పవిత్రమైనవి లేవుగానీ ఉండవలసిన జగడాలన్నీ ఉన్నాయి.

**ఆదౌ దుప్పటీ తీయకుండా జగడం**
**ఆదౌ దుప్పటీ తీయకుండా జగడం**
**కాల్గేట్ కాల్ మొక్కటం**

నిద్ర లేవడానికే మనం బద్ధకిస్తాం కాబట్టి దుప్పటి తీయకుండానే అమ్మతో దెబ్బలాట. దానితోనే మొదలవుతుంది.

**ఆదౌ దుప్పటీ తీయకుండా జగడం**
**కాల్గేట్ కాల్ మొక్కటం**
**కాఫీ త్రాగుట దుష్ట వార్త పఠనం**
**కంగారు బస్సెక్కటం**

పొద్దున్నే కాఫీ తాగటం హడావుడిగా. అలాగే దుష్టవార్త పఠనం. లేవగానే పేపరు చూడకుండా ఉండలేం. ఏ పేపరు చూసినా ఏమున్నది గర్వకారణం అని రోజూ రక్తపాతాలు, గొడవలు, బాంబులు, పేలుళ్లే కదా. అందుకని ఈ దుష్టవార్తలన్నిటినీ పవిత్రమైన రామాయణం లాగా పఠనం చేయటం. ఆ పైన హడావుడిగా భార్యకు భార్య, భర్తకు భర్త తయారై కంగారు బస్సెక్కటం ... కంగారు అని పేరు గల బస్సు... వీళ్లూ కంగారుగానే వెళ్తారు. అందుకని ఈ రకమైన బస్సెక్కి తయారై వెళ్లటం.

**ఆఫీ'స్లో' పనిమాని బయటపడటం -**
ఆఫీసులో చేసే పని కూడా బాగా స్లో.
అందుకే **ఆఫీ'స్లో'పని మాని బయటపడటం**
**అన్నింటిలో వేలెట్టడం**
**సాయంత్రమ్ములు స్టారు టీవీ గనటం**
**ఏతత్వ మా జీవితం....**

వానపాటలు చూస్తున్నానోయ్...!



సాయంత్రం ఇంటికొచ్చి స్టారు టీవీ చూడటం... ఆ కల్చర్‌తో పడుకోవటం... మేమంతా భారతీయులం అని గొప్పగా చెప్పుకోవటం. నిజానికి కాల్గేట్ కాళ్లు నొక్కటంలోనే ఉన్నది విశేషమంతా.

పొద్దున్నే లేవగానే మనం ఇతర దేశాల వారికే పాదాభివందనం చేస్తున్నాం. మొహం కడుక్కోవటం దగ్గర్నుంచీ. మన దేశపు వస్తువులు మనం వాడటం లేదు. అందుకనే అంత పవిత్రమైన రామాయణం వరుసలో దీన్ని చెప్పటంలో ఉద్దేశ్యం ఏమిటంటే ఒక్కసారి మీ ప్రాచీనమైన సంస్కృతిని గుర్తుచేసుకోండి. భారతీయమైన వస్తువులను వాడి బాగుపడండి నాయనా అని సారాంశం. నిజానికి మన భారతీయ

జీవన విధానంలో మార్పులు ఇప్పుడు కాదు, ఇంగ్లీషువాళ్లు మన దేశంలో ప్రవేశించినప్పుడే అనూహ్యమైన మార్పులు వచ్చాయి. అప్పటినుండీ ఆచారాలు, సంప్రదాయాలు.... మొత్తం నాగరికత, సంస్కృతి విచిత్రంగా మారిపోవటం మనం చూస్తున్నాం, ఇప్పటికీ చూస్తూ బాధపడుతున్నాం.

**గుమ్మపాలను త్రాగు కమ్మందనముపోయి**
**కాఫీగతప్రాణ ఖర్మమొచ్చె**

పొద్దున్నే తులసి మొక్కకి దోసెడు నీళ్లు పోసి, పూజ చేసుకుని ఆ పైన ఏమైనా స్వీకరించే మనం... గుమ్మపాలను స్వీకరించే మనం... ఇవాళ లేవగానే మొహం కడిగామో, లేదో కూడా చూడకుండా కాఫీ తాగే పరిస్థితికొచ్చాం.

**గుమ్మపాలను త్రాగు కమ్మందనముపోయి**
**కాఫీగతప్రాణ ఖర్మమొచ్చె**
**ముక్తినిచ్చెడు విద్య ముష్టిచెంబైపోయె**
**చూచిరాతల విద్య సోకుమీరె**

స విద్య యా విముక్తయే అన్నారు. అటువంటి విముక్తినిచ్చే వేద విద్య ఇవాళ ముష్టి చెంబైంది. వేదం చదువుకున్నవాడికి ఆదరణలేని పరిస్థితి వచ్చింది. ఏ రకమైన విద్యలు సోకుమీరాయంటే చూచిరాతల విద్యలివి. ఒక ప్రశ్నకు నాలుగు సమాధానాలు. అందులో ఏదో ఒకటి టిక్కు పెడితే వాడికి మార్కులివ్వడం. అందులో కూడా 35 మార్కులొస్తే చాలు 65 మార్కులు రాకపోయినా పర్వాలేదు.ఇందులోనూ మనం విఫలమవుతున్నామంటే ఇక మన ప్రజ్ఞ ఎంతగా పెరిగిందో మనం ఆలోచించుకోవాలి.

**ముక్తినిచ్చెడి విద్య ముష్టిచెంబైపోయె**
**చూచిరాతల విద్య సోకుమీరె**

ఇక మన వేషధారణ

**పంచెకట్టుటయన్న పరమ ఛాందసమయ్యె**
**గొట్టాలలో కాళ్లు గొప్పవయ్యె**

పంచె కట్టుకున్నవాడు పరమ చాదస్తుడుగా కనిపిస్తాడు. ఈ గొట్టాలలో కాళ్లేసుకుని తిరిగేవాళ్లు మాత్రం గొప్పవాళ్లక్రింద చెలామణి అవుతారు. వీళ్లు స్కాలర్సట. వాళ్లు పండితులట. నిజానికి స్కాలర్స్ అంటే పండితులే కదా. కానీ వేషాన్ని బట్టి అంచనావేసే పరిస్థితి ఒకటుంది మనదగ్గర.

**పంచెకట్టుటయన్న పరమ ఛాందసమయ్యె**
**గొట్టాలలో కాళ్లు గొప్పవయ్యె**
**యజ్ఞధూమమ్ముల ఆస్వాదనముపోయె**
**సిగరెట్ల రింగుల పొగలు హెచ్చె**

మనవాళ్లు యజ్ఞధూమాన్ని మానివేశారు కానీ పొగత్రాగడం మాత్రం మానలేదు. ఏ యజ్ఞాలవల్ల వచ్చిన ధూమం(పొగ) ఈ ఆవరణ అంతా ఆక్రమించి పర్యావరణాన్ని పవిత్రావరణం చేసిందో అటువంటి యజ్ఞాలు, ధూమాలు ఆపేశాం. సిగరెట్టు ధూమాలతో మాత్రం బ్రతుకుతున్నాం. గుండెలు పిండేసే పొగ ఇవాళ ప్రజల గుండెల నిండా ఆవరించింది. దేశమంతా ఆవరించింది.

**యజ్ఞధూమమ్ముల ఆస్వాదనముపోయె**
**సిగరెట్ల రింగుల పొగలు హెచ్చె**
**ఆత్మవిశ్వాస ఖని అయిన ఆర్ష జాతి**
**తనను తాను అవమానించుకొనుట నేర్చె**
**ఒక్కమాటలో చెప్పనా ఓ కవీంద్రా**
**జాతికంతకు ఇంగ్లీషు జ్వరమువచ్చే**

దిసీజ్ ఇంగ్లీష్ ఫీవర్ అని చెప్పాలి. అటువంటి ఫీవర్ ఇప్పటికి రెండువందల ఏళ్ల క్రితం నుండి వచ్చింది. ఇంకా వ్యాప్తి చెందుతుంది. ఇది వదిలిపోయేందుకే మన సంకల్పం. మన ప్రయత్నం.

**ఆడో దుప్పటి తీయకుండా జగడం**
**కాల్గేట్ కాల్ మొక్కటం**
**కాఫీ త్రాగుట దుష్ట వార్త పఠనం**
**కంగారు బస్సెక్కటం**
**ఆఫీస్లో పనిమాని బయటపడటం**
**అన్నింటిలో వేలెట్టడం**
**సాయంత్రమ్ములు స్టారు టీవీ గనటం**
**ఏతత్వమా జీవితం....**
**గుమ్మపాలను త్రాగు కమ్మందనముపోయి**
**కాఫీగతప్రాణ ఖర్మమొచ్చె**
**ముక్తినిచ్చెడు విద్య ముష్టిచెంబైపోయె**
**చూచిరాతల విద్య సోకుమీరె**
**పంచెకట్టుటయన్న పరమ ఛాందసమయ్యె**
**గొట్టాలలో కాళ్లు గొప్పవయ్యె**
**యజ్ఞధూమమ్ముల ఆస్వాదనముపోయె**
**సిగరెట్ల రింగుల పొగలు హెచ్చె**
**ఆత్మవిశ్వాస ఖనిఅయిన ఆర్ష జాతి**
**తనను తాను అవమానించుకొనుట నేర్చె**
**ఒక్కమాటలో చెప్పనా ఓ కవీంద్రా**
**జాతికంతకు ఇంగ్లీషు జ్వరము వచ్చె**

**◆ అవధాని గారూ... భారతీయ వస్తువులు మాని విదేశీ వస్తువులు వాడటాన్ని మీరు ఆక్షేపించారు కదా. ఈ రోజుల్లో విదేశీ వస్తువులు వాడందే పొద్దు గడవదు. చివరకు మనం బట్టలు ఆరేసుకునేటప్పుడు పెట్టే క్లిప్పు కూడా విదేశాలనుండీ వచ్చిందే కదా. దీనికి మీరేమంటారు...?**

క్లిప్పు గురించి, మరికొన్ని సమకాలీన వస్తువుల గురించి, పదార్థాల గురించి, విశేషాల గురించి అవధాని గారు పద్య రూపంలో ఏం చెప్పారో వచ్చే సంచికలలో...

రసజ్ఞులైన పాఠకులు కూడా ఈ 'పలకరిస్తే పద్యం' శీర్షికలో పాల్గొనవచ్చు. సంచికకు రెండు ప్రశ్నల చొప్పున పద్యాలు చెప్పడానికి మహాసహస్రావధాని గరికపాటి నరసింహారావు గారు అంగీకరించారు. 'హాసం' పాఠకులకే పరిమితమైన ఈ అమూల్య అవకాశాన్ని రసజ్ఞులందరూ వినియోగించుకుంటారని ఆశిస్తున్నాం. పద్యాన్ని కోరే పాఠకులు తాము ఇవ్వాలనుకుంటున్న సమస్యను ఈక్రింది చిరునామాకు పంపాలి.

**పలకరిస్తే పద్యం**
**హాసం, హాస్య - సంగీత పత్రిక,**
**502, శ్రీ బాలాజీ నిలయం,**
**బి.యస్.పి.కాలనీ, మోతీనగర్,**
**హైదరాబాద్ -500 018**

అవధాని గారి పద్యాలకు ఎంపికైన సమస్యలను పంపే పాఠకులకు తగిన బహుమతి ఉంటుంది.

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు



**వి. మంజురాణి, హైద్రాబాద్.**

ప్ర॥ ఎందుకు తాగుతున్నావురా అని అంటే చమత్కారి నిరుద్యోగి ఏం అంటాడు?

జ॥ ఏజ్ 'బార్' అయిపోయింది కనుక అని అంటాడు.

**బి.చంద్రశేఖరయ్య, రామసముద్రం.**

ప్ర॥ ఉన్నత ప్రమాణాలంటే... ?

జ॥ హైకోర్టు, సుప్రీంకోర్టులో చేసే ప్రమాణాలు.

**కూర్మాన వెంకట సుబ్బారావు, విశాఖపట్నం.**

ప్ర॥ చీరలు....కామెంట్ ప్లీజ్.....?

జ॥ భార్యలు కొనుక్కొస్తే బెనారస్ క్వాలిటీ. భర్తలు తెస్తే బేవార్స్ క్వాలిటీ.

## డబుల్ రోల్




భోజనం లో అన్నీ వడ్డించి **చారు** పోయడం మరిచారు
**గోధుమ** రొట్టెలు తయారు చేయమంటే ఎందుకంత **ధుమ ధుమ**
వరుస లో రమ్మంటే ఆ **రుస రుస**లేంట్రా!
అరే పదరా.. ఆ వ**సారా** లో కూర్చోని మన**సారా** తాగుదాం.
కథానాయకుడి కి డబ్బింగ్ ఆర్టిస్ట్ **కుడి** భుజం.

**- దేవులపల్లి రామమూర్తి, విజయవాడ.**

## ఈ రూటే వేరు




Chest air - ఎదగాలి
That air - ఆగాలి
ఐతే - కన్ను తీసుకురా

**-వై. ధీరజ్‌కుమార్, నందిగామ.**



## చిలిపి లిపి




Though Say - దోసె
Though P D - దోపిడి
Your Come People - నీరాజనం
Tail Dot - తోకచుక్క

**-వరదా సాయికుమార్, పర్లాకిమిడి.**

## పేరు - రిపేరు




దొంగ - దొంగది - ఘర్షణ - కేడి నెం 1 - శాంతిసందేశం
దొంగోడు -స్వామి - ఐతే - దేవుడు - మాయం.
నేను....సీతామహాలక్ష్మి - తొలిచూపులోనే -ఒకరికి ఒకరు-
ఐతే - ఎంత బావుందో!

**- దేవులపల్లి పార్వతి రామమూర్తి, విజయవాడ.**

## చిలిపి కవిత




**చి**లిపి తనపు చేష్టలతో
**లి**మిటన్నది లేకుండా
**పి**ల్ల వెంటపడుతుంటే
**క**న్నేసిన నా ఆలి
**వి**షయమంత పసిగట్టి
**త**రిమి తరిమి తన్నంగా వాచింది నా తనువంత.

**-తెలికిచెర్ల రామకృష్ణ, విజయనగరం.**

## పేరడీ పెరేడ్



బూచాడమ్మా బూచాడు
బుల్లిపెట్టిలో ఉన్నాడు
కళ్లకెపుడు కనబడడూ
కళ్లు బైర్లు కమ్మిస్తాడు ॥బూచాడమ్మా॥
నెలకోసారి బిల్లంటాడు
నెత్తిమీదేమో బరువేస్తాడు
ఎక్కడ ఉన్నా ఎవ్వరినైనా
వదలకుండ ఏడ్పిస్తాడు ॥బూచాడమ్మా॥
సెల్లూ బిల్లూ, ల్యాండ్ లైనంటూ
ఛార్జీల మోత మ్రోగిస్తాడూ
కేటగిరీ ఏదైనా గానీ ॥కేట॥
జేబుకు చిల్లులు పెట్టేస్తాడు ॥బూచాడమ్మా॥
టాటా -హచ్ - ఎయిర్‌టెల్ -మొబీటెల్
బియ్యెస్సెన్నెల్ - వియ్యెస్సెన్నల్
ప్రీపెయిడ్ - పోస్ట్‌పెయిడ్
ఎస్టీడీ రేట్లు చవకంటారు
ఎల్లలు మాకిక లేవంటారు
ఒకే మాటపై నిలబడతారూ
ఒకే రకంగా దోచేస్తారూ ॥బూచాడమ్మా॥
(బడిపంతులు చిత్రంలోని "బూచాడమ్మా బూచాడు"
పాటకు పేరడీగా)

**-కె. రాజేశ్వరి, విశాఖపట్నం.**

## షార్ట్‌కట్స్




| | | |
|---|---|---|
| పుల్లాభట్ల కోమలి | - | పులి |
| నల్గొండ రామక్క | - | నక్క |
| కోరుట్ల తిరుపతి | - | కోతి |
| ఆచంట వెంకట్రావు | - | ఆవు |
| దువ్వూరి రామలింగన్న | - | దున్న |
| పగడాల మీనాక్షి | - | పక్షి |
| మేదర్ల రేణుక | - | మేక |
| బయ్యవరం నాగమల్లి | - | బల్లి |
| చీరాల మనోరమ | - | చీమ |

**-రాయచోటి కృష్ణమూర్తి, డోంబివిలి(మహారాష్ట్ర)**

**ఈ సంచికలోని పేరడీ పెరేడ్‌ని రాసిన కె. రాజేశ్వరి, (విశాఖపట్నం) గారికి సోహాన్ మ్యూజిక్ వారు 'గౌరి' ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.**

SOHAN MUSIC






1961లో విడుదలైన చిత్రాలలో సంగీత సాహిత్యపరంగా చెప్పకోదగ్గ చిత్రాలు చాలా ఉన్నాయి. వాటిలో

# వాగ్దానం

ఒకటి. అక్కినేని, కృష్ణకుమారి ఇందులో ప్రధాన తారాగణం. రచయితగా లబ్దప్రతిష్టుడైన ఆచార్య ఆత్రేయ ఈచిత్రానికి దర్శకత్వం వహించారు. ఆత్రేయ తొలి చిత్రమైన 'దీక్ష'కు సంగీతాన్నిచ్చిన పెండ్యాల నాగేశ్వరరావు ఈ 'వాగ్దానం' చిత్రానికి సంగీత దర్శకుడు. స్వయంగా పాటలు రాసుకోగలిగిన శక్తి ఉండి కూడా శ్రీ శ్రీ, నార్ల చిరంజీవి, దాశరథి వంటి కవులతో ఈ చిత్రంలోని కొన్ని పాటలను రాయించటం ఆత్రేయ ప్రత్యేకత. బెంగాలీ రచయిత శరత్ రాసిన 'దత్త' నవల ఆధారంగా తీసిన ఈ 'వాగ్దానం' పేరు వినగానే సినీ సంగీత సాహిత్య ప్రియులకు మొట్టమొదట గుర్తొచ్చేది -ఘంటసాల పాడిన హరికథ, ఈ హరికథకు సంబంధించిన వివరాలను అందించే ముందు ఓ రెండు పాటల గురించి ఈ సంచికలో...

అ: పాహి రామప్రభూ వరదా శుభదా
పాహి దీనపాలా....
వెలుగు చూపవయ్యా
మదిలో కలత బాపవయ్యా
ఆ: మహాత్ములైనా దురాత్ములైనా
మనుజుల పేరనె మసలేరయ్యా ॥మహా॥
అందరికీ నీ అభయం కలదని
అనుకోమందువా దేవా
అనుకోమందువా దేవా ॥వెలుగు ॥
ఆ: నేరక చేసిన కారణమున
మా నేరము నేరము కాకపోవునా ॥నేరక॥
కన్నీరే ఆ కలుషమునంతా
కడిగివేయునా రామా
కడిగివేయునా రామా ॥వెలుగు॥
ఆ: కలరూపేదో కలవో లేవో ॥కలరూపేదో॥
ఎద ఉన్నది ఈ వేదనకేనో
ఏది అన్నెమో ఏది పున్నెమో
ఎరుగలేము శ్రీరామా
ఎరుగలేము శ్రీరామా ॥వెలుగు॥






ఈ పాటను ఆత్రేయ రాయగా రేలంగి, కృష్ణకుమారి ప్రధాన పాత్రధారులుగా అభినయించారు. కళ్యాణి రాగాన్ని ఎక్కడా ఒక్కచోట కూడా సంకరం చేయకుండా పూర్తి లక్షణాలతో వాడుకుంటూ పెండ్యాల స్వరపరిచిన గీతమిది. కళ్యాణిరాగంలో ఎన్నో భక్తిగీతాలు, రక్తిగీతాలు, విషాదగీతాలు వచ్చాయి. అయితే విషాదాన్ని అంతర్లీనంగా స్పృశిస్తూ ఇది భక్తిగీతమేనని అనిపించే విధంగా ఈ పాటను పెండ్యాల మలచిన తీరు ప్రత్యేకంగా ప్రశంసనీయం. ఒక సన్నివేశాన్ని, అందుకు తగిన పాటని సృజించేటప్పుడు ఎన్నిరకాలుగా ఆలోచించవచ్చో అన్ని కోణాలనూ తనదైన శైలిలో ఆవిష్కరించే ఆత్రేయ ప్రతిభకు అద్దం పట్టేపాట ఇది. మనుషులు చేసిన అకృత్యాలకు నొచ్చుకునే మనసు ఎలా ప్రతిస్పందిస్తూందో మొదటి చరణంలో గమనించవచ్చు. 'అందరికీ నీ అభయం కలదని అనుకోమందువా దేవా' అంటూ ఆత్రేయ వేసిన ప్రశ్నకు ఎవరి ఆంతర్మధనమే వారికి జవాబునిస్తుంది. 'కలవో' అన్న పదాన్ని కొంతమంది ఆస్తిత్వానికి, కొంత మంది స్వప్నానికి అర్థాలుగా వాడు తుంటారు. నిజానికి 'కలండు కలండను వాడు కలడో లేడో " అంటూ పోతన భాగవత పద్యాలలో గజేంద్రమోక్షంలోనే ఉంది. భావ ప్రకటనలో అస్థిరత ఉన్నప్పుడు 'కలవో' అంటూ రెండువిధాలుగా పనికొచ్చేలా వాడకుండా 'కలరూపేదో - కలవోలేవో' అంటూ వర్ణించటంవల్ల చెప్పదలచుకున్నది అందంగానే కాకుండా స్పష్టంగా కూడా ఆత్రేయ చెప్తాడని ఋజువు అవుతోంది. వాస్తవ దృక్పథంతో చూస్తే దైవానికి సంబంధించిన రూపాలు చాలా వరకు ఊహాజనితమైన కల రూపాలే కదా ! ఈ కోణంలో ఆలోచిస్తే ఆత్రేయ తన పదాల్ని ఎంత పొదుపుగా ఎంత అదుపుతో ఎంత పదునుగా వాడతాడో అర్థమవుతుంది. ఇక ఈ పాటలోని చరణాల మధ్య ఘంటసాల చేసిన అలాపనలు కళ్యాణి రాగాన్ని సాకల్యంగా సాధన చేయాలనుకునేవారికి ఒక విధంగా కరదీపికలు. ఒక ఆలాపనకు, మరొక ఆలాపనకు మధ్య పోలికలు లేకుండా ఒకే పాటలో ఇన్ని రకాల ఆలాపనలను పొందుపరచటం చూస్తే 'రమణీయ కళావిష్కృతికి ఆత్మానందమే పరమార్థం' అన్నమాట ఊరికే పుట్టలేదనిపిస్తుంది.

ఆ: నా కంటి పాపలో నిలిచిపోరా
నీ వెంట లోకాల గెలువనీరా ॥నాకంటి॥
ఆ: ఈనాటి పున్నమి
ఏనాటి పున్నెమో
జాబిలి వెలిగేను మనకోసమే - ॥ఈనాటి॥
అ: నెయ్యాలలో
తలపుటుయ్యాలలో ॥నెయ్యాల॥
అందుకుందాము అందని
ఆకాశమే ॥నా కంటి॥
అ: ఆ చందమామలో
ఆనంద సీమలో
వెన్నెల స్నానాలు చేయుదమా ॥ఆ చంద॥
ఆ: మేఘాలలో
వలపు రాగాలలో
మేఘాలలో
వలపు రాగాలలో
దూర దూరాల స్వర్గాలు
చేరుదమా ॥నా కంటి॥
ఆ: ఈ పూల దారులు
ఈ నీలి తారలు
తీయని స్వప్నాల
తేలించగా ॥ఈ పూల॥
అ: అందాలను
తీపి బంధాలను ॥అందాలను॥
అల్లుకుందాము
డెందాలు పాలించగా
ఆ: నా కంటి పాపలో నిలిచిపోరా
నీ వెంట లోకాల గెలువనీరా



ఈపాటకు రచన దాశరథి. ఇది ఆయన తొలిసినీగీతం. ఈ పాట కోసం ఆయనను ఆత్రేయ ప్రత్యేకంగా పిలిపించుకుని రాయించుకున్నారు. పున్నమి -పున్నెము , వెన్నెల స్నానాలు లాంటి ప్రయోగాలు అందర్నీ ఆకర్షించాయి. ఈ పాటను సుశీల, ఘంటసాల పాడగా కృష్ణకుమారి, అక్కినేని అభినయించారు. ఈ పాట తయారవటానికి ముందు ... అంటే... 1959లో శాంతారాం తీసిన 'నవరంగ్' సినిమా విడుదలై బహుళ ప్రజాదరణ పొందింది. ఆ చిత్రంలో 'ఆధా హై చంద్రమా రాత్ ఆధీ' పాట దేశవ్యాప్తంగా హిట్ అయి సంగీతం సమకూర్చిన సి.రామచంద్రకు, పాడిన ఆశాభోన్స్లే, మహేంద్రకపూర్‌లకు ఎనలేని పేరు ప్రఖ్యాతుల్ని తెచ్చి పెట్టింది. ఆ పాట ప్రభావం 'నా కంటిపాపలో' పాట మీద చాలా వరకు ఉంది. అయితే పెండ్యాల ఆ ప్రభావంలో ఉంటూనే తన వ్యక్తిత్వం పూర్తిగా ప్రతిఫలించేలా ఈ పాటను స్వరపరిచారని మనం సులువుగానే గమనించవచ్చు. ఆ హిందీపాట మాల్కోస్ రాగంలో ఉంటే ఆ రాగంలోగల స్వరాలలోని కొన్నికామన్ స్వరాలను తీసుకుని భీంప్లాస్ రాగం నడకతో అన్వయించుకుంటూ అతి సున్నితంగా తెలుగుపాటను మలచారు పెండ్యాల. ముఖ్యమైన మరో విశేషం ఏమిటంటే -ఈపాట చివర్నగల 'ఈ పూలదారులు ఈ నీలితారలు' చరణానికి ముందు, రెండవ చరణం పూర్తయిన తర్వాతగల పల్లవి ముగిసిన వెంటనే వచ్చే ఇంటర్‌లూడ్‌ని పూర్తిగా మనసుకి పట్టించుకుంటే చాలు భీంప్లాస్ రాగంలో గల సినీ గీతాలను ఎన్నిటినైనా గుర్తు పట్టగలం. ముఖ్యంగా భీంప్లాస్ రాగంలో పెండ్యాల స్వరపరిచిన పాటలన్నిటినీ ఒకచోట చేర్చి ఈ ఇంటర్‌లూడ్‌ని వాటికి కలుపుకుంటూ ఉంటే ఏ పాటకైనా సరే ఎంత చక్కగా అమిరిపోతుందో చెప్పలేం. ఆ అనుభవాన్ని సాధన ద్వారా పొందాల్సిందే . ఆ రాగంలో గల జీవస్వరాలు పాటలో అలా ఒదిగిపోయాయి కనుకనే నలభై మూడేళ్ళవుతున్నా ఆ పాట నేటికీ సజీవంగా ఉంది.

వచ్చే సంచికలో 'వాగ్దానం'లోని మరికొన్ని పాటల గురించి....

## 'సరిగపదమని-24

**జవాబులు**

అడ్డం: 1.మామా 3.ఇదిదొరల్ 7.పద 8.జాలి 9.చిలక 11.చారు 12.నీల 15.మన 16.చుక్క 17.ఏ 19.లోన 20.తప్పలేదు

నిలువు:2.మాయబజారు 3.ఇల్ల 4.రమ 5.సుందరి6.కుల 9.చిట్టి 10.కవి11.చాలించు 14.కాదనిలే 15. మజా18.గంగ

**కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:**

పి.విజయలక్ష్మి-కాకినాడ, సహారె ఇందిర- కళ్యాణ్(మహారాష్ట్ర), సామంచి సుధాకర్ - విశాఖపట్నం, కె.లలితాదేవి- విజయవాడ, ఉడాలి జ్ఞానప్రసూన- చెన్నై, బి.మంజుల- నెల్లూరు, యం.అనుపమ్‌కుమార్- అనకాపల్లి, రాయచోటి కృష్ణమూర్తి- డోంబివిలి(మహారాష్ట్ర), కేతవరపు ఈశ్వరసాయి- సత్తెనపల్లి, అలా క్రిష్ణమూర్తి- కరవాడి(ప్రకాశం), ఉదయబాస్కర్&విజయ- రాజమండ్రి, యస్.శ్రీసబిత- తిరుపతి, యం.ఆర్.కె.చార్యులు- సూర్యాపేట(నల్గొండ), కావేరి రాం- హైదారాబాద్, యం.ఎ. రాఘవమూర్తి- రాజమండ్రి(తూ.గో జిల్లా), కె.రఘునాథాచార్లు-కడప, కంచర్ల సాయి శేషారత్నం- రాజమండ్రి, తాడి రంగారావు- రాజమండ్రి, యన్.సి.యస్.శర్మా- హైద్రాబాద్, సుమదేవరాయలు- హైద్రాబాద్, ఆత్మూరి వెంకటసూర్యనారాయణ- హైద్రాబాద్, పి.హరిచందన- రామగుండం, ఎ.దుర్గాగోపి- గుంటూరు, చర్ల సూర్యప్రకాశరావు- హైద్రాబాద్, విహారా శేషశాయి- సత్తెనపల్లి, ఆమంచి వెంకటలక్ష్మికామేశ్వరి- రాజోలు(తూ.గో.జిల్లా), ఎ.టి. శ్రీనివాసన్- అనంతపూర్, మేడామస్తాన్ రెడ్డి- విశాఖపట్నం, కె.కె.విశ్వనాథం- హైద్రాబాద్, కె.వి.సరస్వతి- హైద్రాబాద్, కె.సుధాకర్ శర్మా-మైలవరం (కడప), పి.ప్రశాంత్- సికింద్రాబాద్, డి.జోగాలక్ష్మి- విశాఖపట్నం, యం. మాధూరి రంగారావు- నల్గొండ, యం.దేవేన్ద్రప్రసాద్‌శర్మ- వాల్మీకిపురం(చిత్తూరు), ఆర్.ఫణిబాల-ధవళేశ్వరం, వేంద్రబాలస్వప్న- హైద్రాబాద్, పార్నంది వెంకటసుబ్రహ్మణ్యంమూర్తి- విశాఖపట్నం, భోగరాజు సుబ్బారావు- విశాఖపట్నం, ఆర్. సత్యరాజన్- కరీంనగర్, యస్.టి.పి.శరత్‌చంద్- నూజవీడు, (కృష్ణా), అయ్యంగారి రాజశేఖర్- రాజోలు(తూ.గో.జిల్లా), మేడా పద్మావతి- విశాఖపట్నం, ఎ.సునీల్‌రెడ్డి- విశాఖపట్నం, రాచర్ల రోహిణి- హైద్రాబాద్, పెయ్యేటి రంగారావు- హైద్రాబాద్, ఏ.విజయశ్రీరాధాకృష్ణ- నెల్లూరు, ఎ.యు.వెంకటేశ్వరరావు- హైద్రాబాద్, పసుపులేటి సాయిలక్ష్మి- నెల్లూరు, పి. సత్యనారాయణ- నెల్లూరు, కె.వి.యన్.యస్.భగవాన్- రాజమండ్రి, ఐ.దీప్తి- సిద్దిపేట(మెదక్), బి.శివసుబ్రహ్మణ్యం- సూళ్ళూరుపేట(నెల్లూరు), సి.హెచ్.అరుణకుమారి- ఎలమంచిలి(విశాఖజిల్లా), కోడూరు సత్యనారాయణ- కడప, పి.మధు- విజయనగరం, పుణ్యాల రాజ్యలక్ష్మి- సత్తెనపల్లి, పుణ్యాల శ్రీలక్ష్మి- సత్తెనపల్లి, యస్. అనిల్ కుమార్- హైద్రాబాద్, పాలూరి కామాక్షి- హైద్రాబాద్, యం. అంజిరెడ్డి- ఒంగోలు, చివుకుల చిరంజీవి- ఒంగోలు, ఐ.కమ్మయ్యపంతులు- విజయనగరం, పేరాల శ్రీవాణి- వైజాగ్, జోశ్యుల భానుమూర్తి- భీమవరము(ప.గో.జిల్లా), బి.శ్రీనివాస ప్రభాకర్- హైద్రాబాద్, సి.రుక్మిణమ్మ- చిత్తూరు, ఆర్.శారదాఅనసూయ- హైద్రాబాద్, టి.చెంచల్‌రావు- హైద్రాబాద్, ముగ్గుళ్ళ రాజ్‌కుమార్-హైద్రాబాద్, ఎ.బి.వి.యన్.రమేష్- వేలూరు(తమిళనాడు), కర్రి ఝాన్సీ- హైద్రాబాద్, కె.కృష్ణా- జగన్నాథపురం (మహబూబ్‌నగర్), అడపా విఘ్నేశ్వరరావు- పర్లాకిమిడి(ఒరిస్సా), ఆర్.సరోజిని- చిలకలూరిపేట(గుంటూరు), జి.వి.ఆర్. మూర్తి- హైద్రాబాద్, యం.వి.యస్.యన్.శాస్త్రి- విజయవాడ, యస్.యస్.నాగేశ్వరరావు- సికింద్రాబాద్, ఉప్పాల మోహనబాబు- అవనిగడ్డ(కృష్ణా), జె.యస్.శేఖర్- తిరుపతి, యడ్లపల్లి చంద్రశేఖర్- తెనాలి, పప్పు అప్పారావు- శ్రీరాంనగర్ (విజయనగరం), పింగళిఅశ్వత్థనారాయణ- ఒంగోలు, వెలుటూరి అనంత రఘునాథ్- హైద్రాబాద్.

**ఒక తప్పుతో వ్రాసిన వారు:**

శ్రీపాద స్వర్ణలత- న్యూఢిల్లీ, చిలుకూరి శ్రీనివాసశర్మ- విజయవాడ, నెల్లూట్ల రమాదేవి- హనుమకొండ, చివుకుల సుబ్రహ్మణ్యం- ఒంగోలు, కె.వి.యల్.నరసింహశాస్త్రి- హైద్రాబాద్, డొక్కా వెంకట కుముద- వక్కలంక(తూ.గో.జిల్లా), విశాల శ్రీరామ్‌చంద్రన్- చింతలపూడి(ప.గో.జిల్లా), పి.నాగరాజు- జానకంపేట(నిజామాబాద్), తాళ్ళూరి చంద్రశేఖర్- హైద్రాబాద్, బి.విజయలక్ష్మి- బొకారోస్టీల్‌సిటి, మైసూర్ కీర్తన- మదనపల్లి, సి.హెచ్.పరాత్పరరావు- ఏలూరు(ప.గో.జిల్లా), వి.వి.సత్యప్రసాద్- హైద్రాబాద్, ఎ.సరోజినిదేవి- రాజమండ్రి, వేమనసత్యప్రసాదరావు- రాజమండ్రి, బి.సి.క్రిష్ణామాచారి- చెన్నై, షేక్ గౌస్‌మొహిద్దీన్- కడప, పక్కి చక్రవర్తి- గరివిడి(విజయనగరం), కోపల్లె శ్రీనాథ్- నాచారం(రంగారెడ్డి), మారూరి పుల్లారెడ్డి- సత్తెనపల్లి, గొర్తి అపర్ణ- గౌతమ్‌నగర్ (ఒరిస్సా), పెండ్యాల కామేశ్వరరావు- ముంబాయి, ఎం.పురుషోత్తమాచార్యా- నల్గొండ, పి.పాపారావు- విశాఖపట్నం, పసుపులేటి ఝాన్సీలక్ష్మి- మొగలికుదురు(తూ.గో.జిల్లా), అవసరాలమణి- విశాఖపట్నం, పి.మణిభూషణాచార్య- హైద్రాబాద్, సామంచి రాధా- విజయవాడ, వేలివెంటి కృష్ణవేణి- నిడదవోలు.

**రెండు తప్పులతో వ్రాసిన వారు:**

తుంబళం ప్రేమ్‌కుమార్- కర్నూలు, ఆర్.పద్మావతి- హైద్రాబాద్, కర్రిసీతారామగిరి- కాకినాడ, ఆర్.వి.సుబ్బరావు- రాజమండ్రి, ఎ.అశోక్‌కుమార్‌రావు-గుర్రంపోడు( నల్గొండ), వంగా వంశీమోహన్- విజయవాడ, యన్.సి.రామానుజాచార్యులు- నెల్లూరు,మయూరి రఘు- హైద్రాబాద్, కఠారి చంద్రమోహన్- హైద్రాబాద్, సావినేని వెంకటేశ్వర్లు- కాజీపేట, యం.లలిత- గుంటూరు, రంగారపు అన్నపూర్ణ- సత్తెనపల్లి, వుండమాటి ఆదిలక్ష్మి- కాకినాడ, వి.వి.యల్.యన్. శాస్త్రి- కాకినాడ.

**మూడు తప్పులతో వ్రాసిన వారు:**

ఈ.రాధిక- హైద్రాబాద్, భువనేశ్వరి- శ్రీకాళహస్తి, సిహెచ్.రామ్‌మోహన్‌రావు- విశాఖపట్నం, పి.వి.యస్.యన్.శర్మా- హైద్రాబాద్.

## 'సరిగపదమని-25

**జవాబులు**

అడ్డం: 1.నడక 3.పూబంతి 6.అమ్మ 8.ఈ 10.నేనేరా 13.తన 14.యమా 15.జై 18.గువ్వా 19.పాద 22.రోజు 23.కొడితే 24.అది

నిలువు:1.నగరి2.కమ్మగా4.బంతీ5.అమ్మక7.నేనే 9.మనసు 10.నేను 11.రామ్మా 12లోయ 16.ఎదలో 17.కుతురో 18.గుణ 20.నవ్వింది 21.కోడి

**కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:**

పి.వి.కృష్ణకాంత్- హైద్రాబాద్, ఆర్.సంధ్యారాణి- హైద్రాబాద్, యన్.దివ్య-హైద్రాబాద్, తండ రమేష్‌గౌడ్- చిలుకూరు(నల్గొండజిల్లా), ఆర్. సాయిప్రసాద్ రావు- హైద్రాబాద్, సిహెచ్.పద్మిని- విశాఖపట్నం, డి.అనిత- వెల్దాండ(మహబూబ్‌నగర్), యం.రాధా- సూర్యాపేట్(నల్గొండ), ఎ. శశికిరణ్- రాగంపేట (కరీంనగర్ ), యన్.సి.రామానుజాచార్యులు- నెల్లూరు, టి.వీణాదేవి-అంతర్వేదిపాలెం, ఎ. శివప్రసాద్ గౌడ్- హైద్రాబాద్, బి.స్వప్న శంకర్‌రావు- బొమ్మనదేవ్‌పల్లి(నిజామాబాద్), కె.వి. సరస్వతి- హైద్రాబాద్, గోపాల వ్యాఘ్రేశ్వరరావు- రాజమండ్రి, పోట్ల సుధా- ఖమ్మం, ఉడాలి జ్ఞానప్రసూన- చెన్నై, ఎ. ఆదినారాయణ- చిలకలూరిపేట(గుంటూరు), యం.మాధూరిరంగారావు- నల్గొండ, కె. యస్.ఆర్. గిరి- కాకినాడ, బి.మహేష్- జమ్మలమడుగు, సిహెచ్.రామ్‌మోహన్- విశాఖపట్నం, ఉదయభాస్కర్& విజయ- రాజమండ్రి, ఎ.ఝాన్సీలక్ష్మి-హైద్రాబాద్, సి.దేవసేన- పలమనేరు(చిత్తూరు), తాడి రంగారావు- రాజమండ్రి, వేంద్రగోపాలకృష్ణ- హైద్రాబాద్, నందూరి రామానుజాచార్యులు- జగ్గయ్యపేట, ముగ్గుళ్ళ రాజ్‌కుమార్- హైద్రాబాద్, యన్. చిన్నా- కోల్‌కత్తా, బి.రాము- హైద్రాబాద్, వి.ఎ.కె.శ్రీకాంత్- హైద్రాబాద్, యన్.నాగేశ్వర్‌రావు-దీవక్‌నగర్(ఆదిలాబాద్), యం.వి.యస్.యన్.శాస్త్రి- విజయవాడ, కె.భవానీప్రసాద్- చిత్తూరు, పసుపులేటి ఝాన్సీ లక్ష్మీబాయి- మొగలి కుదురు(తూ॥గో॥జిల్లా), టి.శ్రీనివాస్- గురజాల, ఎ.వి.జె.అప్పారావు- విశాఖపట్నం, కాస వైకుంఠమ్- విజయనగరం, ఆర్.కిషోర్‌కుమార్- పైలెట్ కాలనీ(వరంగల్), యం. అంజిరెడ్డి- ఒంగోలు, పి.శ్రీవాణి- వైజాగ్, పి.అప్పారావు- విశాఖపట్నం, కె.క్రిష్ణా- జగన్నాధపూర్(మహబూబ్‌నగర్), కె. లక్ష్మి- వైజాగ్, యన్.వి.యల్.స్రవంతి- ఎలమంచిలి(విశాఖజిల్లా), జె.యస్.శేఖర్- తిరుపతి.

**ఒక తప్పుతో వ్రాసిన వారు:**

సిహెచ్.బాపయ్యపంతులు-జోగిపేట(మెదక్) వై.వెంకట్‌రామన్- రామచంద్రాపురం, కె.బాలసుబ్రహ్మణ్యం- విశాఖపట్నం, అప్పన శ్రీదేవి- ధవళేశ్వరం, వి.వాణిశ్రీ- గుంటూరు, వంశీ రవళేష్ కుంపట్ల- హైద్రాబాద్, జి. ఆశా జ్యోతి- వినుకొండ(గుంటూరు), ఆర్.సత్యరాజన్- కరీంనగర్, సల్లా మురళి యాదవ్- చల్లావారిపల్లె(చిత్తూరు), బాసరాజుయాదగిరి- రామన్నపేట (నల్గొండ), ఏ.బి.వి.ఎన్.రమేష్-వెల్లూరు(తమిళనాడు), జి.పద్మనాభం- విజయవాడ, ఎస్.శేషకుమారి-దేవాపూర్(ఆదిలాబాద్), యస్.పాండుచారి- సికింద్రాబాద్, కె.శ్రీనివాసులు- పాలకల్ (కర్నూలు), పి.రమాదేవి- హైద్రాబాద్, పండాలా దేవరాజు- హైద్రాబాద్, యన్.చెన్నయ్య- నంధ్యాల, డి.సుందర్‌బాబు- హైద్రాబాద్, వేండా వద్మావతి- విశాఖపట్నం, నేమానసుభాష్‌చంద్రబోస్- శ్రీకాకుళం, బరాటం వెంకటరావు- కోమరవానిపేట(శ్రీకాకుళం), మేడా మస్తాన్‌రెడ్డి- వైజాగ్, కె.సంతోష్ కుమార్- సికింద్రాబాద్, నారోజు శంకరాచార్యులు- చిలుకానగర్, వై.రాజేశ్వరి- హైద్రాబాద్, రావి రాజ్యలక్ష్మి- సీతారామపురం(ప.గో.జిల్లా), సిహెచ్.శ్రీనివాస్- హైద్రాబాద్, కె.లక్ష్మికాంతమ్మ- నెల్లూరు, పింగళి అశ్వత్థనారాయణ- ఒంగోలు, మండలీక అన్నేశ్వరశర్మ- హైద్రాబాద్, కె.రామారావు- హైద్రాబాద్, పి.శిరీష్‌కుమార్- రాజమండ్రి, అభిమన్య కౌశిక్- నెల్లూరు, జి. చంద్రశేఖర్- అనంతపూర్, ఎ.సందీప్- ధోనే (కర్నూలు), ముప్పిరాల వెంకటరమణ- హైద్రాబాద్, మల్లోజ తిరుపతి-సిరోంచా( మహారాష్ట్ర), హర్షకాంత్‌సాహు- నర్సీపురం(శ్రీకాకుళం), యడ్లపల్లి చంద్రశేఖర్- తెనాలి, యల్లాపంతులు చందు- శ్రీకాకుళం, ఎ.శ్రీనివాసులు- పాతపలమూరు(మహబూబ్‌నగర్), జ్యోషిహరిప్రియ- సువర్ణపురి(ఆదిలాబాద్), ఎ.సుందర్రావు- విశాఖపట్నం, ఆర్.వి.ఎ.క్రిష్ణా- హైద్రాబాద్, యన్.ఐశ్వర్య- హైద్రాబాద్, రామసహాయం రఘువీరా రెడ్డి- నూతనకల్లు(నల్గొండ), పుణ్యాల శ్రీలక్ష్మి- సత్తెనపల్లి, పుణ్యాల రాజ్యలక్ష్మి- సత్తెనపల్లి, కోవి సాయిరామ్- విజయవాడ.

**రెండు తప్పులతో వ్రాసిన వారు:**

వై.రాజానాయుడు-పెద్దచెన్నయ్యగారిపాలెం(చిత్తూరు), ఎ.సునీల్ రెడ్డి- విశాఖపట్నం, ఆరాధ్యుల స్వాతి,అతీష్,నితీష్- విజయవాడ, పైడి లక్ష్మీకాంతరావు- అనంతపూర్, గాంధారి శ్రీనివాస్- పహిల్‌వాన్‌పూరు(నల్గొండ), బాచరాజు ప్రభాకరరావు- హైద్రాబాద్, జి.ముత్తుమారన్- విజయవాడ, కె.జితేంద్రకుమార్- ధర్మసాగర్(వరంగల్), ఆరో శ్రీనివాస్- బెంగళూర్, వెంకట్ సలుగు- కాశీబుగ్గ, వి.వి.సుజన- హైద్రాబాద్, విశాల శ్రీరామచంద్రన్- చింతలపూడి(ప.గో.జిల్లా), మైసూర్ కీర్తన- మదనపల్లి, ఆడూరి బాలస్వామి-మధ్యపూడి ( ఖమ్మం), ఉప్పాల మోహనబాబు- అవనిగడ్డ, పి.పార్వతి- పలాస(శ్రీకాకుళం), ఎస్.శివశ్వేత- విశాఖపట్నం, వి.యస్.ఆర్.చంద్రికా- మేడిపల్లి (రంగారెడ్డి), వి.వి.సాయిరామకృష్ణ- శ్రీకాకుళం, పప్పు.అప్పారావు- శ్రీరాంనగర్ (విజయనగరం), యం.డి.సోని- పిఠాపురం, శ్రీనివాస పవార్-ఆర్మూర్( నిజామాబాద్), పప్పు.సత్యవతి- బరంపురం(ఒరిస్సా), సిహెచ్. సురేష్‌కుమార్- గనిశెట్టిపాలెం (విజయనగరం), అనంతుల సుబ్బారావు- గుంటూరు, గాయత్రి- హైద్రాబాద్, యం. స్వప్నరెడ్డి- హైద్రాబాద్, వి. రజిత- హైద్రాబాద్, యన్.శ్రీలలిత- పర్లపల్లి (నెల్లూరు), లుంబూరు లక్ష్మిదేవి- హైద్రాబాద్, ఇప్పగుంట వెంకటశ్రీనివాసరావు- మీర్‌పేట్, పక్కి చక్రవర్తి- గరివిడి(విజయనగరం), ఎ.ఉషారాణి- తిరుపతి, మామిడి మహేంద్ర- పూణె, మల్యాల రాజేష్- కమన్‌పూర్(కరీంనగర్), అద్దంకి సీతాదేవి- హైద్రాబాద్, బి.కవిత- తిరుపతి.

**మూడు తప్పులతో వ్రాసిన వారు:**

మహ్మద్ లతీఫ్- నాచారం (రంగారెడ్డి), పి.హారిణి- హైద్రాబాద్, ఎం.వి.యస్.లక్ష్మి- కాకినాడ, కైసారవాజీద్- మంచిర్యాల(ఆదిలాబాద్), ఎస్.బాలసుబ్రహ్మణ్యం- హైద్రాబాద్, జి.పాండురంగశర్మ- హైద్రాబాద్, చివుకుల సుబ్రహ్మణ్యశాస్త్రి- వంగోలు, మాదిన నరేష్‌కుమార్- చిన్నశ్రీరాంపూర్ (శ్రీకాకుళం), బొక్కి బర్నాబాసు- విజయనగరం, దాసరి స్నేహ- చల్లపల్లి(కృష్ణా), ఆర్. నాగేంద్రనాయుడు- హైద్రాబాద్, నిర్మల క్రిష్ణా- తిరుపతి, తల్లిబోయిన శ్రీనివాస్- కాకినాడ(తూ.గో.జిల్లా), వై. గౌరిశంకర్‌రావు- పుర్లిపేట (శ్రీకాకుళం), ఇందిర సహారె- ఆడుమబర్ (మహరాష్ట్ర), సాలా దేవీరాహుల్- పొట్టిమల్లయ్యపాలెం, రమేష్- హైద్రాబాద్, మోకా రామారావు- మానేపల్లి(ఈస్ట్‌గోదారి), యం.క్రిషా-గుంటూరు, ఎస్.శారద- విశాఖపట్నం, టి.శ్రీధర్- సికింద్రాబాద్, పి.లక్ష్మిదేవి-డోర్నిపాడు( కర్నూలు), బి.శ్రీనివాస ప్రభాకర్- హైద్రబాద్, అడపా విఘ్నేశ్వరావు- పర్లాకిమిడి(ఒరిస్సా), కె.వి.యస్.యస్.భగవాన్- రాజమండ్రి.

రచన: సి.నారాయణరెడ్డి గానం : సుశీల

లీల: యే మజా దేఖ్‌లో
జిందగీ సీఖ్‌లో ॥యే మజా॥
అందితే జుట్టు పట్టు- అందకుంటే కాళ్ళు పట్టు
అదే జీవితం తెలుసుకో
లైఫ్ -లైఫ్- దట్స్ ది లైఫ్
గోళ్ళు గిల్లుతూ కూర్చొని వుంటే
గొప్పవాడివి కాలేవు
నీళ్ళు నములుతూ నిల్చొనివుంటే
చిల్లిగవ్వకూ కొరగావు
వేషం మార్చుకో
అవకాశం చూసుకో
సందుచూసి, మాటువేసి, కోటలోన పాగవేసి
అందలాలపైన సాగిపో... ॥యే మజా॥
లైఫ్ -లైఫ్ - దట్స్ ది లైఫ్
నురుగులు చిందే మధువు పొంగులో
పరువపు విలువలు తెలుసుకో
పరుగులు తీసే మగువ మనసులో
విరహపు బరువులు పంచుకో
మైకం వీడకు
ఈ లోకం చూడకు
అంతులేని సంబరాల అందలేని అంబరాలు
అంచులంది తేలి తేలిపో
లైఫ్ -లైఫ్ - దట్స్ ది లైఫ్ ॥యే మజా॥

రచన: సి.నారాయణరెడ్డి గానం : మహమ్మద్ రఫీ

అ: ఎంతవారుగానీ వేదాంతులైన గానీ
వాలు చూపు సోకగానే తేలిపోదురోయ్
కైపులో - కైపులో - కైపులో ॥ఎంత॥
హొయ్ హొయ్ చిన్నది -
మేనిలో మెరుపున్నది
హా హా చేపలా తళుక్కుమన్నది -
సైపలేకున్నది... చిన్నదీ
మేనిలో మెరుపున్నది
చేపలా తళుక్కుమన్నది -
సైపలేకున్నది...
ఏవన్నెకాని వలపునమ్మి వలను చిక్కునో
కైపులో - కైపులో- కైపులో ॥ఎంత॥
ఆడకు - వయసుతో చెరలాడకు
ఆడితే వెనుకాడకు - కూడి విడిపోకు
మనసు తెలిసి, కలిసిమెలిసి, వలపునింపుకో
కైపులో - కైపులో - కైపులో ॥ఎంత॥
బలే బలే-
లేత వయసుబికిందిలే -
తాత మనసూరిందిలే
లోకమింతేలే - అహ హ - బలె బలే
లేత వయసుబికిందిలే -
తాత మనసూరిందిలే
లోకమింతేలే
పాతరుచులు తలచితలచి తాత ఊగెనోయ్
కైపులో - కైపులో - కైపులో
ఎంతవారుగానీ వేదాంతులైన గానీ
వాలు చూపు సోకగానే తేలిపోదురోయ్
కైపులో - కైపులో - కైపులో

రచన : సి.నారాయణరెడ్డి గానం: మహమ్మద్ రఫీ, సుశీల

అ: గోపాలబాల నిన్నేకోరి నీ సన్నిధిచేరి
నీచుట్టె తిరుగుతూ ఉంటాను ॥గోపాల॥
నీనామం వింటూవుంటే, నిలువెల్లా పులకించేను
నీ రూపం కంటూ వుంటే , నన్నూ నేనే మరిచేను
హే గీతా ! నాథా! ॥నీ నామం॥
గారాల బాలా మారాముచెయ్యొద్దు
బైరాగిని అనుకోవద్దు
నేను - ఆ నేనే - ఈ నేను - ॥గోపాల॥
ఏ ముద్దులు కాదంటున్నా నా మనసే నీదేనన్నా
పూజారి అడ్డంవున్నా, నా దైవం నీవేనమ్మా
కృష్ణమ్మా-
నిను నమ్మినవాణ్ణి నట్టేట ముంచేస్తావో
మరి గట్టు మీద చేరుస్తావో,
అంతా నీ భారమన్నాను ॥గోపాల॥
సిరులంటే ఆశలేదు, వరమేమి అక్కరలేదు
గీతాపారాయణమె నా జీవితలక్ష్యం అన్నాను
నా ముద్దూ మురిపాలన్నీ తీర్చేదాకా
నీలో నన్నే చేర్చేదాకా, నీడల్లే నిన్నంటే వుంటాను ॥గోపాల॥

రచన : సి.నారాయణరెడ్డి గానం: మహమ్మద్ రఫీ, సుశీల

ఆ: ఇద్దరి మనసులు ఒకటాయె సరి
హద్దులు లేనే లేవాయె
అ: ముద్దుల తలపులు మొదలాయె మరి
నిద్దుర రానే రాదాయే ॥ఇద్దరి॥
అ: కనులు కనులు కలిసినపుడే
మనసు మనసూ మాటలాడే
మరులు విరబూసే ॥ఇద్దరి॥
ఆ: చేయి చేయి తాకగానే
హాయి ఏదో సోకగానే
పైట బరువాయె ॥ఇద్దరి॥
ఆ,అ: కలత లెరుగని కోనలోన
చెలిమిపండే సీమలోన
కలిసిపోదామా ॥ఇద్దరి॥

రచన: సి. నారాయణరెడ్డి గానం: మహమ్మద్ రఫీ, సుశీల

ఆ: గుమ్మ గుమ్మ గుమ్మా
గుమ్మెత్తించే ముద్దులగుమ్మ
కై పెక్కిన కన్నులతోనే మత్తెక్కించీ
కవ్వించే బొమ్మ- ఈ ముద్దుల గుమ్మ
ఉసికొలిపే వొంపులతోనే మరులెత్తించీ
ఊగించే రెమ్మ - ఈ ముద్దులగుమ్మ ॥గుమ్మ॥
విసుగెత్తిన బ్రతుకులలోన ఏముంది పస ఏముంది
సిసలైన సారం ఈ క్లబ్బుల కౌగిట దాగుంది
సరదాగా సీతాకోక చిలకల్లాగ
తిరగాలి రోజూ - తీరాలి మోజు
రేపన్నది లేనేలేదు రానేరాదు
ఉందొకటే నేడు - నీ ముందుంది చూడు ॥గుమ్మ॥
అ: కాకి కోకిల అవుతుందా, కంచు కనకం అవుతుందా
క్లబ్బు కాపురమవుతుందా, వెలయాలు ఇల్లాలు అవుతుందా
జబ్బలదాకా జాకెట్టు, సిగ్గూ ఎగ్గూ తీసికట్టు
బారెడు జుట్టు జానెడాయె,
బొడ్డు క్రింద చీరకట్టు మోజులాయె హేయ్:
ఓరయ్యో ఉన్నది అంతా ఉన్నట్టంటే
ఊరంతా ఉలుకు - గుండెల్లో కలుకు ॥గుమ్మ॥

రచన: సి. నారాయణరెడ్డి గానం: మహమ్మద్ రఫీ, సుశీల

ఆ: నేడే ఈ నాడే
కరుణించె నన్ను చెలికాడే ॥నేడే॥
కనులముందున్న రతనాలమూర్తిని
విలువలెరుగక విసిరితిని
కనులు తెరచీ విలువ తెలసీ
మనసే గుడిగా మలచితిని
మనసే గుడిగా మలచితిని ॥నేడే॥
మదిలో విరిసే మమతల మాలలు
చెలిమికి కానుక చేసెదను
ఆరని వలపుల హారతి వెలుగుల
కలకాలం నిను కొలిచెదను
కలకాలం నిను కొలిచెదను ॥నేడే॥
అ: చిలిపిగ కసిరే చెలియ విసురులో...
చిలిపిగ కసిరే చెలియ విసురులో
అలకలు గని నవ్వుకున్నాను
చేతులు సాచీ చెంతకుచేరిన
చేతులు సాచీ చెంతకుచేరిన
ఆ చెలినే అందుకున్నాను
ఆ చెలినే అందుకున్నాను
నేడే ఈనాడే
మురిపించె నన్ను చెలితానే ॥నేడే॥

రచన: సి. నారాయణరెడ్డి గానం: మహమ్మద్ రఫీ, సుశీల

ఆ: షరాబీ కళ్లతో నిను దోచుకోనా
అ: లాజవాబ్
ఆ: నషేలి కురులలో నిను దాచుకోనా
అ: ఉష్ యాషబాబ్
ఆ: మనసైన నారాజా నా మనసే నీది
ఆజా-
అ: హై హై
ఆ: లేజా-
అ: క్యాఖూబ్ - క్యాఖూబ్
ఆ: బంగారు గువ్వను నేను, రంగేళి రవ్వవు నీవు
సైఁ యంటే - రమ్మంటే నీ జంటగ ఉంటాను
అ: నీ సొగసే దిగిపోని నిషా
ఆ: హోయ్ - హోయ్ - హోయ్
అ: నేనే నిన్నేలు తానీషా
ఆ: ఓ - మేరే మెహబూబ్
అ: ఉంటాను - నీతోనే హమేషా
ఆ: సచ్
అ: కనుగొంటాను - నీలోని తమాషా
ఓ మెజుగా కలుసుకుంటా, నాజూకు తెలుసుకుంటా
రోజుల మహలు కట్టీ, రాజులా ఏలుకుంటా
మేరీషహజాదీహోతుం ఓ లైలా
ఆ: నా అడుగుల అలజడిలోన, నా అందాల సవ్వడిలోన
కవ్వించీ, కరిగించీ, బిగి కౌగిట బంధిస్తా
అ: కవ్వించు సైగలకు కలేజా బెదరదులే
తల్వారు చూపులకు ఝుల్మిలా యింపనులే
బడాదిల్ వాలా హుంమై - ఓ లైలా
బడాదిల్ - ఓ మేరీ మెహబూబా
ఓ మేరీ లైలా
బడాదిల్ వాలా హుంమై

# కథా సంగ్రహం

పాల్....!

డేర్‌డేవిల్-పాల్ ప్రభుత్వానికే సవాల్! అతడు ప్రపంచం తలకిందులైనా పట్టుబడని పడగవిప్పిన కోడెత్రాచు! అయినా -విధి బలీయం -కారు ప్రమాదంలో చిక్కుకుని పోలీసులకు పట్టుబడతాడు. కాని ప్రాణం పోయినా తన గాంగ్ రహస్యాలు బయటపెట్టని శతమొండి! ఇనస్పెక్టర్ శేఖర్ అతడిచేత రహస్యాలు కక్కించటానికెంతో ప్రయత్నిస్తాడు.

మిష్టర్ శ్యామ్ భలే చురుకైనవాడు-తెలివైనవాడు. 'డు ఆర్ డై' అనే మనస్తత్వం అతడిది. అనుకున్నది చేసెయ్యడం తప్ప ఆలోచించటం అలవాటు లేనివాడు. బ్రతుకు తెరువుకోసం క్లబ్‌లలో పాటలు పాడుతూంటాడు. రావ్‌సాహెబ్ కూతురు గీతను గాఢంగా ప్రేమిస్తాడు.

గీత రాత్రిళ్లు ప్రొద్దుపోయి యింటికి రావటం, విలాసంగా తిరగటం రావుసాహెబ్ గమనిస్తాడు. ఆమెకి వెంటనే పెళ్ళి చేయాలని నిశ్చయించుకుని మద్రాసునుంచి హైద్రాబాద్ తిరిగివెళ్లటానికి ప్రయాణమవుతాడు. శ్యామ్ ఇది పసికట్టి కాబోయే మామగారికెలాగో మస్కాకొట్టి వారెక్కిన మొదటితరగతి పెట్టెలోనే యెక్కి హైద్రాబాద్ చేరుకుంటాడు.

ఇంత దూరం నుంచి అంతదూరం వెళ్లినా శ్యామ్‌కి గీతను కలుసుకోటానికి వీలుపడదు. చివరికిక తెగించి ఎలాగో రావుసాహెబ్ గారి మేడమీద గీత గదిలో ప్రత్యక్షమవుతాడు. వెంటనే రావుసాహెబ్ అతణ్ణి పట్టించి పోలీసులకు అప్పగిస్తాడు.

ఇన్‌స్పెక్టర్ శేఖర్ శ్యామ్‌ని చూసి, అతడచ్చుగుద్దినట్లు పాల్‌లాగా ఉండటంతో చకితుడౌతాడు. వెంటనే ఒక ఆలోచన అతనిలో మెరుస్తుంది. శ్యామ్‌ని పాల్‌గా స్మగ్లర్స్ గాంగ్‌లోకి పంపి, వారి రహస్యాలు సేకరించాలని-అతడికి సి.ఐ.డి. ఉద్యోగం ఆఫర్ చేస్తాడు. శ్యామ్ ఉప్పొంగిపోయి ఆ ఉద్యోగంలో చేరుతాడు.

శ్యామ్‌ని విడిచి ఉండలేక తల్లి మద్రాసునుంచి హైద్రాబాద్ వచ్చేస్తుంది. శ్యామ్ తల్లితో-పాల్ అనే గజదొంగ అచ్చు తనలాగే ఉంటాడని- తాను పాల్‌గా ఆ గాంగ్‌లో చేరి, వాస్తవాన్ని పైకిలాగటానికి వూనుకున్నానని చెపుతాడు. అది వినగానే ఆమె ఆ పాల్ చిన్నప్పుడు బందిపోట్లెత్తుకుపోయిన తన పెద్దకొడుకు రాంప్రసాద్ ఏమో అన్న అనుమానంతో జైల్లో ఉన్న పాల్‌ని చూడాలని తహతహలాడుతుంది.

పాల్‌ని చూసి తన రామేనని గుర్తించి, పొంగి పొర్లే పుత్రవాత్సల్యంతో అతడిదగ్గర కెడుతుంది. పాల్ కన్నతల్లిని గుర్తించకపోవటమేగాక ఆమెను తూలనాడి పంపిస్తాడు. తల్లి దుఃఖంతో క్రుంగిపోతుంది. శ్యామ్, శేఖర్ ఆమెని ఓదారుస్తారు.

జైల్ అస్పత్రిలోవున్న పాల్ అప్రూవర్‌గా మారాడని పత్రికల్లో నీలివార్త వెలువడుతుంది. అదిచూసి గాంగ్ లీడర్ గన్ అదిరిపోయి, అతణ్ణి సఫా చెయ్యమని అనుచరులను పంపుతాడు. పాల్ వేషంలో ఉన్న శ్యామ్ వాళ్ళ నెదిరించి, తాను మారలేదని నమ్మించి వారితో కలిసి పారిపోయి వచ్చి , గన్‌గాంగ్‌లో చేరిపోతాడు.

శ్యామ్‌ని అందరూ పాల్‌గానే భ్రమిస్తారు. వారి హోటల్లో డ్యాన్సర్, పాల్ ప్రియురాలు లీల కూడా అలాగే భ్రమించి అతణ్ణి చేరబోతుంది. శ్యామ్ నేర్పుగా ఆమె నుంచి తప్పుకుంటాడు. ఆ గాంగ్‌లోని చింగ్లీ అనే 'కాబ్లర్' మాత్రం శ్యామ్‌ని అనుమానించి ఓ కన్నేసి ఉంటాడు.

శ్యామ్ గీతను ఏకాంతంగా కలుసుకునే యత్నంలో ఉంటాడు. గన్ అతణ్ణి అమీర్ మహల్‌లోని రత్నాలు పొదిగిన బొమ్మను అపహరించి తెమ్మని ఆదేశిస్తాడు. మారువేషంలో దాన్ని కొట్టేసివస్తూ, పోలీసులు

వెంబడించటంతో అక్కడ తన కోసం వెయిట్ చేస్తున్న గీత కారులో యెక్కి పారిపోతాడు. గీత శ్యామ్ వేషం చూసి అతణ్ణి గజదొంగగా శంకించి, ఇష్టం వచ్చినట్లల్లా దూషిస్తుంది.

శ్యామ్ తిరిగివచ్చాక లీల -అతడు రాత్రి మరొక యువతితో గడిపి వచ్చినందుకు ఈర్ష్యపడుతుంది. శ్యామ్ ఆమెని నిర్లక్ష్యం చేస్తాడు. లీల అతణ్ణి అసలైన పాల్ కాదని అనుమానిస్తుంది.

చింగ్లీ కూడా అతడు సిసలైన పాల్ కాదని గ్రహించి చంపటానికి ఉద్యుక్తుడవుతాడు. శ్యామ్ అతని మీద కలియపడేసరికి, లీల శ్యామ్ మీద రివాల్వర్ యెత్తుతుంది. శ్యామ్ ఆమె తాను పాల్‌ని కానని నిజం చెప్పి, పాల్‌ని రక్షించటాని కామె సహాయాన్ని కోరుతాడు. ఆమె అందుకు అంగీకరించగానే , గన్ వచ్చి అతణ్ణి బంధిస్తాడు. జైల్లో ప్రమాదస్థితిలో ఉన్న పాల్‌ని అంబులెన్స్‌లో ఆసుపత్రికి తీసుకెడుతుండగా అంబులెన్స్‌కి ఘోరమైన ప్రమాదం జరుగుతుంది. పాల్ తప్పించుకుంటాడు.

గన్ చెప్పిన మాటలు నమ్మి తమ్ముడు శ్యామ్‌తో కలపడతాడు పాల్. తన తండ్రిని చంపింది గన్ అని తమ్ముడు శ్యామ్ చెప్పిన మాటల వల్ల పాల్‌కు గుర్తొస్తుంది. అన్నదమ్ములు ఒకటై గన్ ఆట కట్టిస్తారు. ప్రభుత్వం గన్‌తో పాటు పాల్‌ను కూడా కస్టడీలోకి తీసుకుంటుంది. పాల్ సత్ప్రవర్తనతో అధికారులను మెప్పించి గడువుకు ముందే విడుదలవుతాడు. అంతవరకూ వేచి ఉన్న లీల అతణ్ణి చేరుకుంటుంది. శ్యామ్‌కు పోలీసు డిపార్ట్‌మెంట్‌లో ఉద్యోగం వస్తుంది. పాల్‌కు లీలతో, శ్యామ్‌కు గీతతో పెళ్లవుతుంది.

-శుభం-



బి.ఏ.సుబ్బారావు



టి.వి.రాజు



డా॥సి.నారాయణరెడ్డి



మహమ్మద్ రఫీ



సుశీల

## తారాగణం

పద్మశ్రీ నందమూరి తారక రామారావు
నటరత్న యన్.టి. రామారావు
రేలంగి
రాజనాల
ప్రభాకర్‌రెడ్డి
మిక్కిలినేని
రామదాసు
వి. శివరాం
జయకృష్ణ
జగ్గారావు
కోళ్ళ సత్యం
జనార్దనరావు
ఆనందమోహన్
ఎ.యల్. నారాయణ
మల్లిఖార్జునరావు
మద్దాలి
బలరాం
శ్రీమతి కె. ఆర్. విజయ
కుమారి విజయ గిరిజ
కుమారి రమాప్రభ
శ్రీమతి శ్రీరంజని
నర్తకి : అరుణా ఇరానీ
బేబీ బ్రహ్మాజీ

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| ఫోటోగ్రఫీ | : శ్రీ యస్.యస్.లాల్ |
| మాటలు | : శ్రీమద్దిపట్ల సూరి |
| పాటలు | : డా॥సి.నారాయణరెడ్డి |
| సంగీతం | : శ్రీ టి.వి.రాజు |
| కళ | : శ్రీ మాధవపెద్ది గోఖలే |
| నృత్యాలు | : శ్రీతంగప్పన్, చోప్రా |
| కూర్పు | : శ్రీ కందస్వామి |
| స్థిరచిత్రాలు | : శ్రీ బౌన |
| పబ్లిసిటి | : విజయా పబ్లిసిటీస్, విజయవాడ |
| పబ్లిసిటీ డిజైన్లు | : స్టూడియో : కేతా |
| స్టూడియోలు | : వాహినీ, ఎ.వి. యం. వాసూ |
| శబ్దగ్రహణం (పాటలు రికార్డింగ్) | : శ్రీ స్వామినాథన్, శ్రీ.వి. శివరాం |
| నేపథ్యగానం | : పద్మశ్రీ మహమ్మద్ రఫీ, సుశీల |
| వేషధారణ | : శ్రీ పీతాంబరం, సాంబశివరావు, వెంకటేశ్వరరావు |
| అలంకరణ | : శ్రీ జెమినీ రామమూర్తి |
| పోరాటములు | : శ్రీ సాంబశివరావు |
| ప్రొడక్షన్ మేనేజర్లు | : శ్రీ జనార్దనరావు, సుబ్రహ్మణ్యం |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : శ్రీ జి. మాధవరావు |
| నిర్మాత | : శ్రీ.ఏ. పుండరీకాక్షయ్య |
| దర్శకత్వం | : శ్రీ.బి.ఏ. సుబ్బారావు |



స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: యస్.వి.కృష్ణారెడ్డి M.Com
కొసరాజు రాజేంద్రబాబు సమర్పించు
శ్రీ శివసాయి పిక్చర్స్
లేత మనసులు
LETA MANASULU
నిర్మాతలు: వి. బాలశౌరి B.A, M.P, యమ్.అనంతవర్మ M.B.A, Ex-M.L.A
యం.యం.కీరవాణి చింతపల్లి రమణ . కంతేటిశంకర్ . ముత్యాలనాని . జెపి .
V.BALASOURY M.ANANTA VARMA

